అపరాధ పరిశోధన అనుబంధం—61

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## చావు ఎవరికి?

రచన : 'సికింధర్'

## నిజం తెలుసుకోకు!

రచన : వసుంధర

## రత్న కిరీటం?

రచన: విద్వాన్ వై. సురేంద్రనాథ రెడ్డి

## అసమర్థుడి పరిశోధన!

రచన : ఏ. వీ. మోహన్రావ్

## అడుగు ముందుకు వేస్తే చస్తావ్!

(మొదటి భాగము)

అపరాధ పరిశోధన సప్లిమెంట్—61
జనవరి, 1979
వెల : రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# చావు ఎవరికి?

'సికిందర్'

సిగరెట్ వెలిగించి సూటిగా ఆకాశానికేసి చూశాను.

అసంఖ్యాకమైన నక్షత్రాలు కన్పించాయి. అలా వాటినిచూస్తే నా అసంఖ్యాకమైన సమస్యలు కళ్ళ ముందు మెదులుతాయి. పరిష్కారం దొరకని సమస్యలు.

సమస్య ఎదురయినప్పుడల్లా సిగరెట్ వెలిగించి ఆలోచించడం నా అలవాటు. ఆ విధంగా 70 శాతం సమస్యలు పరిష్కరింపబడతాయి. కానీ, ఇప్పుడు నన్ను వేధిస్తోన్న సమస్యకి ఒకపట్టాన పరిష్కారం దొరకడము లేదు ఆరు నెలలనుంచీ...

ఈ ఆరు నెలల్లో రోజుకి అయిదుప్యాకెట్లు చొప్పున సుమారు తొమ్మిదివేల సిగరెట్లు కాల్చాను. లాభంలేదు. సిగరెట్లవల్ల నా సమస్యకి పరిష్కారం దొరకదనుకుని ఆ తర్వాతి మెట్టు ఎక్కాను.

కానీ, మద్యం సేవించితే ఉద్యోగం మానేస్తానని నా అసిస్టెంట్ బెదిరించడంతో తాగుడు మానేశాను.

హైదరాబాదులో నేను డిటెక్టివ్ ఏజెన్సీ ప్రారం భించి ఆర్నెల్లు గడిచినా నన్నెవరూ డిటెక్టివ్ గా గుర్తించలేదు. కాబట్టి నా సేవలు ఎవరూ వినియోగించు కోవడం లేదు. అందువల్ల ఎక్కువకాలం ఆఫీసుకి తాళం వేసి ఇంట్లో గడుపుతున్నాను.

ఈ ఆరు నెలల్లో నేను సంపాదించింది శూన్యం. కోల్పో యింది వూహించనంత. అయినా నాలుగు నెలలు ఆఫీసు అద్దె, ఇంటి అద్దె బకాయిపడ్డాయి. అతి కష్టంమీద అసిస్టెంట్ కి జీతం ఇవ్వగలుగుతున్నాను.

నా అసిస్టెంట్ నా కష్టాల్లో పాలుపంచుకోకపోతే నేను మనోధైర్యం కోల్పోయి, చిటికెడు సైనేడ్ తో ఈ లోకానికి గుడ్ బై చెప్పేవాడ్ని.

సంపాదన ఏమీ లేకపోవడంతో అంతకుముందు బాగా బ్రతికినరోజుల్లో సంపాదించిన వస్తువులన్నిటినీ ఒక్కొ క్కటి అమ్మకానికి పెట్టవలసి వచ్చింది. నా అసిస్టెంట్ కూడా అంతపనీ చేసింది. విలువయిన ఆభరణాల్ని అమ్మి వేస్తూ నాకు సహాయపడుతోంది ఎంత వారించినా!

ఆరు నెలల క్రితం నేను నా అసిస్టెంట్ చిత్రతో బెంగు ళూరు విడిచి పారిపోయి రాకపోతే ఈ దుస్థితి ఏర్పడేది కాదు.

బెంగుళూరులో నేను రెండున్నర సంవత్సరాలు టాప్ క్లాస్ డిటెక్టివ్ గా చెలామణీ అయ్యాను. ఫీజు వసూలు చెయ్యడంలో నా అసిస్టెంట్ దిట్ట. ఆమె వసూలుచేసే ఫీజు వందరూపాయలనుంచి క్రమంగా వేలరూపాయలకి పెరిగింది. బెంగుళూరు విడిచేనాటికి మా కనీసపు ఫీజు వెయ్యిరూపాయలు.

అటువంటి సంపాదనతో విచ్చలవిడిగా ఖర్చుచేస్తూ

విలాసంగా జీవితం గడిపేం. దేనికయినా అంతువుంటుంది. మా విలాసజీవితం సరిగ్గా ఆరునెలల క్రితం అంతమై పోయింది.

అందుకు నేనే బాధ్యుడ్ని. నాకు చావు భయం ఎక్కువ. ఎవరయినా మామూలువోంగ నన్ను చంపుతానని బెదిరించితే భయపడనుగాని, బెంగుళూరులో పేరు మోసిన గాంబ్లర్ రామచంద్రగౌండర్ బెదిరిస్తే నేనే కాదు, పోలీసులుకూడా భయపడతారు. నేను చేసిన పొరబాటు ఒకానొక నైట్ క్లబ్ లో జరిగిన హత్య పరిశోధించడం. వారంరోజులు పరిశోధించి అది గౌండర్ చేసిన హత్య అని తెలుసుకుని విపరీతంగా భయపడ్డాను.

ఈ విషయం పోలీసులకి తెలియజేసేలోపున గౌండర్ నన్ను కలుసుకుని హెచ్చరించాడు — నేను కనుక్కున్న వివరాలు ఇక్కడే మర్చిపోయి సిటీవదిలి వెళ్ళకపోతే స్వర్గానికి పంపించేస్తానని!

ఇది విన్నాక చిత్ర అక్కడవుండేందుకు యెంత మాత్రమూ ఒప్పుకోలేదు. గౌండర్ 18 గంటలసమయం ఇచ్చాడు — ఈలోపు పారిపోవాలి. లేదా చావుతప్పదు!

పోలీసులతో నేనేమీ చెప్పలేదు. కేసు విరమించుకుని మరొకరికి అప్పగించమన్నాను. గౌండర్ చెప్పింది చేసితీరుతాడు. అతను చెప్పినట్టు చెయ్యకపోతే నాకే కాదు, చిత్రకికూడా చావు తప్పదు.

నా కారణంగా చిత్ర చనిపోవడం నాకిష్టంలేదు. గౌండర్ని ఎదుర్కొనే ధైర్యంకూడలేదు. అందువల్ల మెతో బెంగుళూరు విడిచి హైదరాబాదుకి రాక తప్పలేదు.

కాలిపోయిన సిగరెట్ విసిరేసి మరో సిగరెట్ వెలి ను.

ఇక్కడ నా డిటెక్టివ్ ఏజెన్సీ ఫ్లాప్ అయింది. భవిష్యత్‌లో కూడ బాగుపడే నమ్మకం లేదు. ఈ సిటీలో డిటెక్టివ్‌లకి ఆదరణలేదని తేలిపోయింది. అందువల్ల ఇక్కడనుంచి వెళ్ళిపోయి మద్రాసులో ఆఫీసు తెరవాలి.

సిగరెట్ విసిరి టైం చూసుకున్నాను. 10-50. మరో గంట గడిస్తేగాని నిద్రపట్టదు. లైటార్పేసి చీకట్లో వెల్లికిలా పడుకున్నాను. జనవరినెల చలి ఎముకల్ని కొరికేస్తోంది. దానికితోడు పైన ఫ్యానుకూడ తిరుగుతోంది.

ఈరాత్రి నా సమస్యకి పరిష్కారం దొరికింది. ఇక్కడనుంచి మద్రాసుకి మకాం మార్చాలి. అందుకు ఖర్చులకి కొంత డబ్బుకావాలి. కాబట్టి నెలరోజులనించి పెట్రోలుకి డబ్బులేక మూలబడివున్న ఫియట్‌ని అమ్మక తప్పదు.

ఈ ఆలోచన ఎంతో కలవరపర్చింది. అయినాతప్పదు రేపువెళ్ళి బ్రోకర్ని కలుసుకోవాలి...ముందు చిత్ర సలహా తీసుకోవాలి. ఆమె ఒప్పుకోదు. ఇదొక సమస్య! యే విషయంలోనయినా చిత్రని ఒప్పించాలంటే చాలా కష్టమయిన పని. కారు విషయంలో ఎలాగయినా ఆమెను ఒప్పించాలి! ఎలా?

సమస్య! సమస్య!...అడుగడుగునా సమస్యలే!

అసహనంగాలేచి లైటుస్విచ్ నొక్కబోతుండగా ఫోను మ్రోగింది...

ఒక్కక్షణం సందేహించాను. మూడురోజుల నుంచి ఆఫీసు అద్దెకిచ్చిన ఆసామీ నన్ను వేధిస్తున్నాడు. నేను ఇప్పుడు రెస్పాన్స్యిస్తే తిట్లుపడక తప్పదు!

మౌనం వహించడం మంచిది.

కానీ, మరొక విషయం తట్టింది. ఒక వేళ చిత

చేస్తోందా? ఇంత రాత్రి ఏంపని? లేక ఎవరైనా క్లయింట్ చేస్తున్నాడా?

తొందరపాటం అది క్లయింట్ అవడానికి వీల్లేదు.

తక్షణ రిసీవర్ ఎత్తి చెవిదగ్గర పెట్టుకున్నాను. "ఇది! డిటెక్టివ్ ఈశ్వర్రావ్ గారి గృహాము" అన్నాను వినయంగా.

"తెలుసు" అంది అవతలి కంఠం—స్త్రీ కంఠం. "నీవు పదివేలు సంపాదించాలని వుంటే రేపుదయం పదిగంటలకి హోటల్ కంపాలా రూం ట్వెంటీఫోర్‌లో నన్ను కలుసుకో—జాగ్రత్త! ఈ విషయం ఎవరికీ చెప్పకు!—నీ సెక్రటరీకి కూడా!"

తక్షణ లైను కట్ అయింది. ఒక్క క్షణం మతిపోయింది.

రిసీవర్ పెట్టేసి బెడ్ మీద పడుకుని జాగ్రత్తగా ఆమె మాటలను మననం చేసుకున్నాను. ఆమె మాటల్లో నన్ను ఆకర్షించింది ఒక్కటే.

'నీవు పదివేలు సంపాదించాలని వుంటే...'

ఎందుకులేదు? పదిరూపాయలకోసం నేనిప్పుడు యేపనయినా చేయడానికి సిద్ధంగావున్నాను. పదివేలు! అంతడబ్బు నా కెవరూ ఇవ్వలేదు!

ఆమె మాటలు నేను సరిగా విన్నానా? నా వళ్ళు జలదరించింది. ఆమె కంఠంలో ప్రత్యేకతవుంది. కర్కశంగా, యేమాత్రం దయలేనిదిగా... మొత్తానికి అది స్త్రీలకుండే సహజమైన స్వరంకాదు!

ఆమెకి నాతో ఏం పని? ఆమె ఎవరు? ఆమె హోటల్ లో వుంటోంది కాబట్టి, ఆమెది హైదరాబాదు కాదు. ఆమె ఎవరయినా, ఎక్కడనుంచి వచ్చినా నాకు

అనవసరం! నాక్కావలసింది డబ్బు! పదివేల రూపా యలతో నాకు మద్రాసువెళ్ళే అవసరం వుండదు. ఇలాంటి క్లయింట్సు నెలకొకరు దొరికినా చాలు.

ఉదయం సరిగ్గా పదిగంటలకి ఆమెని కలుసుకోవాలి.

ఆమె ఒక హెచ్చరిక చేసింది: నేనామెను కలుసు కొన్నట్టు ఎవరికీ తెలియకూడదు-నా అసిస్టెంటుకి కూడా.

నవ్వుకున్నాను. నేను పదివేలు సంపాదిస్తున్నట్టు ఒక రికీ ఎందుకు తెలియాలి? అంతడబ్బు ఒకేసారి చిత్ర చేతిలో పెట్టి ఆమెని ఆశ్చర్యపరచనూ?

చిత్రవిచిత్రమైన కలలతో ఆ రాత్రి సరిగా నిద్రపట్ట లేదు.

## 2

కారిడార్ లో నడుస్తోంటే నాకాళ్ళు వణకసాగాయి. నా భయానికి కారణం అనుక్షణం అనేక సమస్యలతో సతమత మవుతున్న నేను, సామర్థ్యం కోల్పోయానేమో నన్న అనుమానం.

వరుసగా గదుల్ని చూస్తూ నడుస్తున్నాను.

రూం ట్వెంటీవన్...టూ...త్రీ...ఫోర్!

టక్కున ఆగి టైంచూసుకున్నాను. 10-00.

జేబులో పిస్టల్ ని ఒకసారి తడుముకుని కాలింగ్ బెల్ నొక్కాను. మరుక్షణం "కమిన్!" అన్న మాటలు విన్పించాయి.

అదేకంఠం! వొళ్ళు జలదరించే కంఠం!

నెమ్మదిగా తలుపునెట్టి లోనికి అడుగుపెట్టాను. చల్లటి గాలి శరీరానికి సోకి వణుకుపుట్టింది. ఆమె సోఫాలో కూచోని నాకేసి సూటిగా చూస్తోంది.

ఆమెకి నలభై అయిదేళ్ళుంటాయని అంచనా వేశాను.

మాపులు అసహ్యంగా వున్నాయి, ఆమె కంఠం కంటే. గోధుమరంగు శరీరం. ఆమె శరీరంకంటే ఆమె ధరించిన నగలే నన్ను ఆకర్షించాయి. ధనవంతురాలు...

"గుడ్ మార్నింగ్ మాడమ్" అన్నాను.

ఆమె తలూపి కూచోమన్నట్టు సైగ చేసింది కళ్ళతో. ఆమె కంఠంతో చెప్పడంకంటే కళ్ళతో చెప్పడమే నయమనిపించింది నాకు.

"నా పేరు నళినీదేవి."

నా వళ్ళు జలదరించింది ఆమె మాటలువిని. రాత్రి ఆమె కంఠమే విన్నాను. ఇప్పుడామె రూపంకూడా చూస్తున్నాను. ఆమెరూపం ఎవరయినాచూస్తే ఆడ విలన్‌గా అంచనా వేయక తప్పదు.

ఆమెతో నేను జాగ్రత్తగా వ్యవహరించాలి. బాగా ఆలోచించి ఆమెను నమ్మాలి. ఆమె నాకు జిత్తులమారిలా కన్పిస్తోంది.

ఆమె యెదురుగా సోఫాలో కూచోని, "యస్, మాడమ్...?" అన్నాను.

ఆమె నన్నోసారి చూసింది. పచ్చటి పెదవుల్ని బిగబట్టి రెండుక్షణాలు ఏదో ఆలోచించింది. ఆ తర్వాత నాతో అంది. "ఈశ్వర్, నిన్న సాయంత్రం నేను రాజమండ్రినుంచి ఇక్కడికొచ్చాను. నువ్వు నాకు సహాయం చేయాలి."

"చెప్పండి?"

"ఇంతవరకు యిలాటి సహాయం నిన్నెవ్వరూ కోరి వుండరు." మళ్ళీ రెండుక్షణాలు నిశ్శబ్దం. "నువ్వు తప్ప కెవరూ సహాయపడలేరు. ఈశ్వర్, నువ్వు డబ్బు ందిలో వున్నావనుకుంటాను?"

"మీకెలా తెలుసు?" ఆమె నన్ను ఏకవచనములో సంబోధిస్తోంటే నా దుస్థితికి ఏడుపొస్తోంది. బెంగుళూర్లో నన్నెవరూ అలా సంబోధించలేదు.

"నాకు సహాయపడే వాళ్ళగురించి గాలిస్తోండగా ఎవరో నీ పేరు చెప్పేరు. నీగురించి తెలుసుకున్నాను. నీ ఏజన్సీ మూతబడిందట?"

ఆమె కంఠమేకాదు, ఆమె మాటలుకూడా నాకు నచ్చడంలేదు. ఆమె ఎత్తిపొడుపుల్ని భరించలేక పోతున్నాను.

"ఎవరు చెప్పేరుమీకు?" అన్నాను కోపంగా.

ఆమె అసహ్యపు చూపులు నామీద నిలిచాయి. నా కోపం ఎగిరిపోయింది.

"అది నీ కనవసరం ఈశ్వర్ — పదివేల రూపాయలకు నేను చెప్పిన పని చేస్తావా?"

ఉలిక్కి పడ్డాను. ఆమె గొంతులో వణుకు స్పష్టంగా గమనించాను! ఆమె ఎందుకో భయపడుతోంది! ఏమిటి ఆమె చెప్పేపని?

"ఏం చెయ్యాలి మాడమ్?" ఆదుర్దా అణుచుకొని అడిగాను.

ఆమె వెంటనే జాగ్రత్తపడింది. "తీరా విన్నాక నువ్వు చేయడానికి నిరాకరించకూడదు! అర్ధమయిందా? పదివేల రూపాయల్ని ఒక్కసారి తలచుకో! అంత డబ్బుని ఒకేసారి నువ్వు సంపాదించావా?"

"మాడమ్, నా పర్సనల్ విషయాలు మీ కనవసరం, అనవసరంగా టైం వేస్ట్ చేయకండి! మీరిచ్చే పదివే రూపాయలకి నేనేం పని చెయ్యాలి?" అన్నాను యస్ గా.

"ఈశ్వర్, నువ్వు డిటెక్టివ్వి. పథకాలు బాగా వేస్తావు. అందుకే నిన్ను నమ్మి ఎన్నుకున్నాను" అంది ఆమె సౌమ్యంగా. "నేను సాధించదలచుకున్న పనికి పటిష్టమయిన పథకం కావాలి. నేను చదువుకున్నదాన్ని. ప్రతీది ఒక పద్ధతి ప్రకారం జరగాలి. ఎక్కడా లోటు పాట్లు వుండకూడదు."

ఆమె లేచి టేబిల్ దగ్గరికి నడిచింది. ఆమెని గమనించాను. ఏ కోశానా ఆమెలో స్త్రీ సహజగుణాలు లేవు. ఆమెలో నాకు నచ్చని అంశాలు ఒకొక్కొక్కటి బయట పడుతున్నాయి.

టేబిల్ మీది సూట్ కేసు తెరిచి ఒక కవరు తీసింది. వెనక్కి తిరిగివచ్చి సోఫాలో కూచోని ఓ కవరు నాకు అందిస్తూ, "ఈ ఫోటో చూడు!" అంది.

కవరులోంచి ఫోటో బయటకు లాగాను. నొసలు చిట్లించాను. ఆ ఫోటోలో వున్నది ఎవరో నాకు తెలియదు. అతను పాతికేళ్ళ యువకుడు. కోలముఖం, మొన దేలిన ముక్కు, వుంగరాలు తిరిగిన జుత్తు, సన్నటి మీసాలు...అతనికీ, నా ఎదురుగా కూచున్న నళినికీ ఎలాంటి పోలికా లేదు.

ఫోటో తిరిగి కవర్లో పెట్టి టీపాయ్ మీద పెట్టాను. ఆమె అలాగే చూస్తోంది. "ఎవరితను?" అడిగాను.

"శివరాం. నాకాబోయే అల్లుడు. అతను అల్లుడు కావడం నా కిష్టంలేదు."ముక్కలు ముక్కలుగా చెప్పిందామె.

నాకర్థం కాలేదని చెప్పాను.

ఆమె నిట్టూర్చి అంది, "నా కూతురు సుమిత్ర అతన్ని ప్రేమిస్తోంది. సుమిత్రకి నేను వేరే మంచి సంబంధం నిశ్చ

యించాను. అది ఆమెకి ఇష్టంలేదు. ఆమె శివరాంని ప్రేమించడం నాకిష్టంలేదు."

"మీ యిద్దరి అయిష్టాలతో నాకేమిటి పని?"

"అదే నీకు చెప్పబోతున్నాను." అందామె వెంటనే.

"చూడు ఈశ్వర్, సుమిత్ర ఒక్కతే నా సంతానం. దానితండ్రి చనిపోయినప్పటినుంచీ నాకు చాలా బాధ్యతలు వచ్చాయి. బయట వ్యాపారం, దాని బాగోగులూ అన్నీ నేనే చూడాలి. సుమిత్ర నాకు దూరమైతే నేనే కాదు, నా నలభైలక్షల వ్యాపారంకూడా సర్వనాశనం అయిపోతుంది.

"నీకు నాలో స్త్రీలక్షణాలు కన్పించడం లేదనుకుంటాను. మావారు చనిపోయాక ఆ లక్షణాలన్నీ దూరమయ్యాయి. విశ్రాంతిలేదు. క్షణానికోచోట వుంటాను. మీటింగులూ, కాన్ఫరెన్సులూ... తెల్లారితే స్తే అర్ధరాత్రి దాకా మగవాళ్ళ మధ్య మసలుతాను. నామీద పడ్డ బాధ్యతలన్నీ నన్ను ఒక ప్రత్యేక స్త్రీగా తయారు చేశాయి. ఈ కారణంవల్లనే ననుకుంటాను, సుమిత్ర నాకు దూరమవుతోంది..."

ఆమె కాస్సేపాగింది. నేను మాట్లాడలేదు.

ఆమె తిరిగి చెప్పసాగింది. "బిజినెస్ ఎవరికయినా అప్పగించి నేను ఇంటిపట్టున వుందామనుకుంటే, నాకు ఆప్తులెవరూ లేరు. ఎక్కువకాలం నేను బిజినెస్ వ్యవహారాల్లో గడపడంవల్ల సుమిత్రతో ఏకాంతంగా గడిపే సమయం చిక్కడంలేదు! ఆమె నాకు దూరమవుతోంది. అసహ్యించుకొంటోంది అయినా నేనెలాంటి జాగ్రత్తలూ తీసుకోలేకపోయాను.

"ఈమధ్యే తెలిసింది: ఆమె శివరాం అనే వుద్యో

ప్రేమిస్తోంది. రెండు నెలల క్రితం నేను మంచి సంబంధం చూశాను. అతను డాక్టర్. పేరు జయదేవ్. సుమిత్ర కిది ఇష్టంలేదని ముఖంమీద చెప్పేసింది. ఒక ఆఫీసరు కూతురు సామాన్య వుద్యోగిని పెళ్ళి చేసుకుంటుందిట!"

హఠాత్తుగా మాటలాపేసి నన్ను చూసిందామె.

నేనలా మాటాడకుండా కూచోడం బావుండదనిపించింది.

"జీవితంలో స్త్రీ ఒక్కడికే మనసు అంకితం చేస్తుంది." కామెంట్ చేశాను.

"నాన్సెన్స్!" అరిచిందామె గట్టిగా. "దాని మనసు ఎదగలేదింకా అంకితం చెయ్యడానికి! నిన్ను రమ్మన్నది నాకు ఫిలాసఫీ చెప్పడానిక్కాదు!"

"ఎక్స్‌క్యూజ్ మీ," అన్నాను నొచ్చుకుంటూ, "ఆమె కన్నేళ్ళు?"

"పదిహేడు." చెప్పిందామె శాంతించి. "అయినా దాని మనసు ఎదగలేదు. లేకపోతే నన్నర్థం చేసుకునేది. మంచీ_చెడూ గ్రహించే వయసుకాదు. నాకు సుమిత్ర తప్ప ఇంకెవరూ లేరు. నేనామెని ఎందుకు నిర్లక్ష్యం చేస్తాను ఈశ్వర్?"

"సరే, అసలు విషయం చెప్పండి. మాతృత్వంలోని మాధుర్యం నాకు తెలీదు."

"నువ్వు ఫిలాసఫీ మాట్లాడకు దయచేసి! సుమిత్ర దూరం కావడం నేను భరించలేను! అంతేగాక, యిది నా పరువు ప్రతిష్ఠలకి సంబంధించిన సమస్య! సుమిత్ర ఏ చిన్న తప్పు చేసినా దాన్ని శిక్షించను—నన్ను నేను శిక్షించుకుంటాను, ఆత్మహత్య చేసుకుని!

"కాబట్టి, మేం ఇద్దరం క్షేమంగా వుండాలంటే నీ

సహాయం కావాలి. సుమిత్ర నడతని నా యిష్టప్రకారం మార్చేందుకు ఇప్పుడొకే ఒక్క మార్గముంది. ముక్కూ మొఖం తెలియని అనామకుడితో అది ఇల్లువిడిచి వెళ్ళి పోవడానికి నిశ్చయించుకుంది. ఒకవేపు నేను జయదేవ్‌తో దానికి పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నాను— ఇప్పుడు ఆలోచించు, నా పరువేం అవుతుంది?''

''సుమిత్ర శివరాంతో వెళ్ళిపోవడం వలన మీరు నిశ్చయించిన పెళ్ళి ఆగిపోతుంది. వాళ్ళు కారణం అడుగుతారు. చెప్పడానికి మీ ఆత్మాభిమానం ఒప్పుకోదు— అందువల్ల ఆత్మహత్య చేసుకుంటారు. కాబట్టి మీ పరువుకి ఎలాటి భంగమూ వుండదు!'' అన్నాను.

''సరిగా చెప్పావు. నేను చావడం నీ కిష్టమేనా?''

వులికిపడ్డాను. పది వేల రూపాయలు కళ్ళముందు మెదిలాయి.

''లేదు!'' అన్నాను వెంటనే.

''అందుకేం చేస్తావు?''

రెండు నిమిషాలు ఆలోచించాను. ఆ తర్వాత అన్నాను. ''నేను చేయగలిగిందేమీ లేదు. మీమాట వినకపోతే ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించండి. సుమిత్ర దారికొస్తుంది. ఏ కూతురూ తన తల్లి చావు కోరుకోదు!'' నాలిక కరుచుకున్నాను, నా మాటల్లో ఫిలాసఫీ దొర్లినందుకు...

అది ఆమె గ్రహించలేదు. ''ఈశ్వర్, దానిదృష్టిలో నేను ఎప్పుడో చచ్చాను. చావు రెండుసార్లు రాదు. నువ్వు చెప్పినట్టు నేను బెదిరించానుకూడా! దానికిపట్టింపు లేదు! నేనేమయి పోయినా దానికి చింతవుండదు!''

''అయితే మీరు ఆత్మహత్యా ప్రయత్నం విరమించుకున్నట్టే కదా?''

"కాదు, సుమిత్రని నా దారికి మళ్ళించేందుకు కాయ శక్తులా ప్రయత్నం చేస్తాను. ఫలించకపోతే ప్రాణాలు తీసుకుంటాను..."

"అయితే ఇప్పుడు నన్నేం చేయమంటారు?"

ఆమె తీక్షణంగా చూసింది. ఇప్పుడామె చూపులు అసహ్యంగా లేవు. కారణం: నే నామెను పూర్తిగా అర్థం చేసుకున్నాను.

"నేను చావడం నీకిష్టం లేదుకదూ?" అందామె అలాగే చూస్తూ. "అయితే శివరాంని చంపు!"

"మాడమ్! మీరేమన్నారూ?" అర్చాను గట్టిగా.

"నీ కర్థమయింది. ఏ విషయమైనా నేను ఒకేసారి అర్థమయ్యేలా, వినపడేలా చెప్తాను. ఏమిటని అడిగితే నాకు కోపంవస్తుంది."

నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. నళినిముఖం ఇప్పుడింకా క్రూరంగావుంది. అక్కడ కూచోడానికి నాకు మనస్కరించలేదు.

నేను వూహించినట్టే జరిగింది. ఆమె జిత్తులమారి!

"సారీ, మాడమ్" అన్నాను లేచి నిలబడి. "మీ మానసిక స్థితి చాలా ఘోరంగా వుంది. మీరు సంప్రతించవలసింది డిటెక్టివ్‌ని కాదు, సైకియాట్రిస్ట్‌ని."

ఆమె సమాధానంకోసం ఎదురుచూడకుండా, నా పదివేల కల చెదిరిపోయినందుకు బాధతో తలుపువేపుకు నడిచాను. ఇంతలో వెనుక భళ్ళున తలుపు తెరుచుకున్న శబ్దమైంది.

తిరిగి చూశాను.

బాత్‌రూంలోంచి ఒక వస్తాదులాంటి మనిషి గదిలోకి ప్రవేశించాడు. నేను ఛటుక్కున జేబులోంచి పిస్తోలు తీసి పట్టుకున్నాను.

“మాడమ్! ఎవరతను?”

“శంభూ!” గొణిగింది నళిని.

ఆ వస్తాదు నిగనిగలాడుతున్న కండల్ని ప్రదర్శిస్తూ గదిలో కాస్సేపు పిల్లి మొగ్గ లేశాడు. ఆ తర్వాత జేబు లోంచి లావాటి పచ్చివక్క తీసి నోట్లో వేసుకుని పట పటమని కొరికి మింగేశాడు.

నా కళ్ళు జలదరించింది! పిస్తోలు అలాగే గురి పెట్టాను.

ఆ వస్తాదుకి ముప్ఫై అయిదేళ్ళుంటాయి. ఉక్కు శరీరం. చేతులు, ఛాతీ, పిక్కలు నూనె రాయడంవల్ల నిగనిగలాడుతున్నాయి, చిన్న కళ్లు. చప్పిడి ముక్కు. మొనదేలిన పలువరస. వొంటిమీద తెల్లటి బనియన్, నల్లటి నిక్కరు ధరించాడు — కాళ్ళకి కాన్వాస్ బూట్స్.

నళిని నన్ను చూసి పకపకమని నవ్వింది. “శంభూ నా బాడీగార్డ్. వరల్డ్ ఛాంపియన్ ఆలీని అవలీలగా చిత్తు చేసే శక్తివుంది వీడిదగ్గర! నామాట విని ఇలా వచ్చి కూచో, ఈశ్వర్.”

బదులుగా నేనూ గట్టిగా నవ్వాను.

“మాడమ్, మీ బాడీగార్డ్ సంభూ భూతంకాదు! నా చేతిలో పిస్తోలువుంది—వళ్ళు దగ్గర పెట్టుకోమనండి! లేదా ఛస్తాడు!”

వస్తాదు మాటాడలేదు.

నళిని అంది, “ఏదీ పిస్తోలు పేల్చు? పిచ్చివాడా! పేలుడువిని అందరూ వస్తారు! అనవసరంగా శంభూని చంపి జెయిలు కెందుకెళతావ్? శివరాంని చంపి పది వేలు దక్కించుకో!”

"మాడమ్, నేనెవర్నీ చంపను! ఇక్కడ్నుంచి వెళ్ళిపోతున్నాను. మీ మనసులోంచి హత్యచేయించే ఆలోచన తీసేయండి!" అన్నాను. పిస్తోలు తిరిగి జేబులో పెట్టుకుని శంభూని చూశాను నవ్వుతూ.

ఆ తర్వాత గబగబ తలుపుదగ్గరికి నడిచి పిడిమీద చెయ్యివేశాను. నా భుజంమీద బరువైన హస్తం పడింది....

తిరిగిచూశాను. శంభూ చూస్తున్నాడు నవ్వుతూ. నేనతన్ని విదిలించి కొట్టేలోగా అతను నన్ను రెండు చేతుల్లో పైకెత్తి గిరగిర తిప్పి సోఫాలో కూలేశాడు. నేను గట్టిగా కేకపెట్టి కళ్ళు మూసుకున్నాను.

"ఈశ్వర్!" నళిని అంటోంది. "పరిస్థితి గ్రహించే వుంటావు. నా రహస్యాలు తెలుసుకుని నాకు సహాయ పడకుండా నువ్వు వెళ్ళలేవు! నేను చెప్పినట్టు చేసి పది వేలు దక్కించుకో!"

నెమ్మదిగా కళ్ళు తెరిచాను. అప్పటికి ఆయాసం తక్కువైంది. ఎదురుగా శంభూ నిల్చుని వున్నాడు మంచినీళ్ళ గ్లాసుతో. గ్లాసందుకుని నీళ్ళు తాగుతుండగా నా జేబులో చెయ్యిపెట్టి పిస్తోలు తీసుకున్నాడు శంభూ.

"వెరీగుడ్" అంది నళిని. "ఇప్పుడు చెప్పు, చెప్పి నట్టు చేస్తావా? నీతో ఆడుకోమని శంభూతో చెప్ప మంటావా?"

నేను పరిస్థితి గ్రహించాను. ఒంటరిగాడ్ని. నళిని చెప్పినట్టు చేస్తానని ఒప్పుకోకపోతే ఒళ్ళు హూనమవు తుంది! ఆ శంభూతో నేను ఆయుధం లేకుండా తలపడ లేను.

"ఆల్ రైట్ మాడమ్. మీ శక్తి గ్రహించాను. మీ సమస్యకి మరో పరిష్కారం దొరకలేదా?"

"శివరాం చావడం ఒక్కటే పరిష్కారం. అతన్ని చంపకపోతే నువ్వెక్కడున్నా వెతికి పట్టుకుని చంపిస్తాను—నా శక్తి నువ్వు గ్రహించావు" అందామె కర్కశంగా.

"అవును గ్రహించాను. ముందు కాఫీ తెప్పించండి. తర్వాత బిజినెస్ మాట్లాడుకుందాం!"

నళిని శాంభూకి సైగ చేసింది.

శాంభూ హోటల్ సర్వీస్‌కి ఫోన్ చేసి కాఫీలు ఆర్డరిచ్చాడు.

నళిని నావేపు తిరిగి, "చాలా సంతోషం! నువ్వు నీ క్షేమం కోరుకుంటున్నావు!" అంది.

"మీ క్షేమంకూడా కోరుకుంటున్నాను. పదికాలాల పాటు మీరు కళకళలాడుతూ వుండండి. శివరాం నశించాలి!" అన్నాను.

"నిన్ను నమ్మాను ఈశ్వర్. కేవలం మూడు రోజుల్లో నువ్వాపని చెయ్యాలి. ఇరవై మూడవ తారీఖున ఆ యిద్దరూ కలకత్తా వెళ్ళిపోతున్నారు."

"మాడమ్, మీరు బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చారా? నేను అతన్ని చంపితే మీ కూతురు ఆత్మహత్య చేసుకుంటుందేమో......జీవితంలో స్త్రీ ఒకే ఒక్క—"

"దానికేమీ తెలియదు ఈశ్వర్! ఆ శివరాం మాయ చేశాడు! చేతిలో కానీ లేకుండా కలకత్తాకి ఎలా వెళతారు? నగలు తెమ్మని చెప్పివుంటాడు దగాకోరు వెధవ. ఆ నగలతో నాలుగు రోజులు జలసా చేస్తారు...ఆ

తర్వాత వీధిన పడతారు! నీచానికి తలపడతారు! నాశన మైపోతారు. నా కూతురు నా కళ్లముందు నాశనమవడం సహించను! దాన్ని నువ్వు రక్షించాలి"

"మీరు శివరాంతో మాట్లాడారా?"

"మాట్లాడాను. హెచ్చరించాము—నన్నేమాత్రం లెక్క చేయడంలేదు! శివరాం సుమిత్రతో పారిపోతే నా పరువు మంటగలుస్తుందని గ్రహించి అతన్ని చంప డానికే నిశ్చయించాను. శంభూ ఒక్క గుద్దు గుద్దితే ప్రాణాలు వదలడం ఖాయం. కానీ—హత్య బయట పడే అవకాశాలున్నాయి.

పటిష్టమైన పథకం కావాలి. శివరాం హత్య ఎవరికీ అంతుబట్టకూడదు. అందుకే నిన్ను ఎన్నుకున్నాను. నువ్వు చేయవల్సిందల్లా ముక్కూముఖం తెలియని మనిషిని పథకం ప్రకారం చంపి, హత్య బయటపడకుండా జాగ్రత్త తీసుకోవడమే."

కాఫీలు వచ్చాయి. నేను తాగుతూ ఆలోచించాను. హత్య చెయ్యాలి! ముక్కూ ముఖం తెలియని మనిషిని! అతను నాకేం అపకారం చేశాడు? లేదు, నేను హత్య చేయను. హంతకుల్ని పట్టుకోడం నా వృత్తి.

నళినిని ఎలాగైనా బోల్తా కొట్టించి ఈ వ్యవహారం నుంచి బయటపడాలి. అందుకు ఆమె చెప్పినట్లు చేస్తానని నమ్మించాలి. ఆ తర్వాత కొన్ని షరతులు పెట్టాలి. కాలయాపన చేయాలి. అవకాశం చిక్కగానే ఈవూరు వదిలి పారిపోవాలి!

ముందుగా షరతులు ఆలోచించాను.

"ఆల్ రైట్ మాడమ్, ముందు డబ్బుగురించి మాట్లాడుకుందాం." అన్నాను.

"పది వేలిస్తాను" అందామె.

"లాభం లేదు!" అన్నాను అడ్డంగా తలూపుతూ. "మరో పది వేలు ఇవ్వండి!"

ఆమె ఉలిక్కిపడింది, "ఏమిటన్నావ్?"

"మీకర్థమైంది. ఏ విషయమైనా నేను ఒకేసారి చెప్తాను. మీరు అదనంగా ఇచ్చే పది వేలు శివరాం పేర్న రక్షణ నిధికి పంపుతాను" అన్నాను.

"ఎందుకు?"

"నేను చేసే పాపం ఆ విధంగా కడిగేసుకుంటాను. శివరాం పేర్న ఆ డబ్బు రక్షణ నిధికి పంపి పుణ్యం కట్టుకుంటాను."

"ఈశ్వర్! నువ్వు మితిమీరుతున్నావు!"

నేనామె మాటలు పట్టించుకోలేదు. "మరో విషయం. ఈ హత్య మీరు చేయిస్తున్నట్టు వ్రాయితం రాసి ఇవ్వాలి."

ఆమె మరోసారి ఉలిక్కిపడింది. "ఎందుకు?"

"ఒక వేళ నేను పట్టుబడితే నా రక్షణకోసం" అన్నాను విలాసంగా సిగరెట్ కాలుస్తూ.

"నువ్వెందుకు పట్టుబడతావ్? పటిష్టమైన పథకం తయారుచేయాలని నేను చెప్పాను కదా?"

"ఆల్ రైట్. పటిష్టమైన పథకం తయారుచేస్తాను. హత్యచేస్తాను. పట్టుబడను—ఆ గ్యారంటీ నేనిస్తాను. అయితే నా ప్రాణానికి మీరు గ్యారంటీ ఇవ్వాలి।"

"నా కర్థంకాలేదు."

"నేను శివరాంని చంపాక, మీ రక్షణకోసం నన్ను చంపించరని గ్యారంటీ ఏమిటి?"

ఆమె ఒక్క క్షణం సూటిగా చూసింది.

నళిని గొంతు వినిపించింది: "హల్లో ఈశ్వర్! ఏం ఆలోచించావ్?"

ఆమె మాటలు నన్ను తికమక పెట్టాయి.

"ఆలోచించవల్సింది మీరు కదా?" అనడిగాను.

ఆమె గొంతు ఆశ్చర్యంగా పలికింది: "అరె, ఈశ్వర్! శంభూ నీకు ఫోన్ చేయలేదా?"

"లేదు. ఎందుకు?" ఇంకా అయోమయంగా వుంది నాకు.

"నీ అసిస్టెంట్‌ని బంధించినట్టు శంభూ నీకు చెప్ప లేదా?"

నా గుండె ఆగిపోయింది! కళ్ళు తిరిగి కూలి కింద పడ బోయాను. జిత్తులమారి నళిని! నన్ను—ఒకప్పటి టాప్ క్లాస్ డిటెక్టివ్‌ని—ఫూల్ చేసింది! నేనెంతపిచ్చివాడ్ని! ఆమె చిత్రని బంధిస్తుందన్న అనుమానం నా బుర్రకి తట్టనేలేదు!

"శంభూకి మతిమరుపు ఎక్కువైంది." అంటోం దామె. "వాడి మతిమరుపుకి మందు ఒక్కటే. వాడికి ఆడతోడు కావాలి."

"చిత్ర ఎక్కడ వుంది?" అరిచాను.

పకపక నవ్విందామె. "శంభూ ఆమెని ఏమీ చేయడు. నేను చెప్పిన పని నువ్వు చేస్తే ఆమె నీకు క్షేమంగా దక్కుతుంది. ఉదయం నువ్వు నాతో చాలా తెలివిగా మాట్లాడానని మురిసిపోయావు కదూ? నీ ఎత్తులు గ్రహించాను. నువ్వు నా శక్తి మరోసారి గ్రహించావు. అవునా?"

నేను పూర్తిగా చెమటలో తడిసిపోయాను. నోరు తడారిపోయింది. ఏం చెప్పాలో తోచలేదు.

"ఈశ్వర్, నువ్వనవసరంగా టైమ్ వేస్ట్ చేయడం నీకూ నాకూ మంచిదికాదు. త్వరగా చెప్పు! శివరాంని చంపుతావా?"

"చంపుతాను!" అన్నాను కసిగా. "నా అసిస్టెంట్ క్షేమంగా వుండాలంటే అతన్ని చంపక తప్పదు! మాడమ్, మీరు పరమకిరాతకులని ఇప్పుడు బోధపడింది. మరోసారి హెచ్చరిస్తున్నాను. మీ స్వంత కూతురి జీవితంతో ఆటలాడటం మీకు మంచిదికాదు."

"ఆ విషయాలన్నీ ఉదయం మాట్లాడుకున్నాం. వది లేయ్!" అందామె.

నేను వేగంగా ఆలోచించాను. శివరాంని చంపకుండా, చిత్ర క్షేమంగా దక్కే మార్గం కావాలి! ఎలాగైనా సరే నళినిని బోల్తా కొట్టించాలి. కాబట్టి ఆమెని ఇంటికి రప్పించి ఏదైనా ట్రాప్‌లో ఇరికించాలి.

ఒక నిర్ణయానికి వచ్చి ఆమెతో అన్నాను,"మాడమ్, నేను శివరాంని చంపడానికి సిద్ధం. దయచేసి నా ఇంటికి వస్తారా? ఇలాటి రహస్య విషయాలు హోటల్ గదిలో చర్చించటం మంచిదికాదు."

"చంపడానికి సిద్ధమన్నావు. సంతోషం, ఇప్పుడే బయలుదేరి వస్తాను. ఏ విషయం మాట్లాడాలి?"

"హత్య ఎలా చేయాలో పథకం తయారుచేయాలి కదా?"

"అవును. వెంటనే వస్తాను!"

నా మనసు ఉరకలువేసింది. "థాంక్యూ" అన్నాను. లైను కట్ అయింది.

గర్వంగా నవ్వుకుని తేలిగ్గా వూపిరివదిలాను.

నలభైలక్షల ఆస్తికి అధికారిణిని నా బోనులో యెలుకలా బంధిస్తాను! నా సామర్థ్యం క్షీణించలేదు! కేవలం నా ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్స్ అలా భావింపజేస్తోంది...

గబగబ పక్కగదిలోకి నడిచి అల్మైరాలోంచి టేప్ రికార్డర్ తీశాను. ఫిలిప్స్ పోర్టబుల్. దీనికున్న మైక్రోఫోన్ చాలా శక్తివంతమయినది. ఎలాంటి సూక్ష్మశబ్దాల్నయినా గ్రహించేస్తుంది.

డ్రాయింగ్ రూంలోవున్న టీపాయ్ కింది భాగంలో వున్న హుక్ కి దాన్ని బిగించాను. నళినితో నా సంభాషణ ప్రారంభమయ్యే సమయానికి జాగ్రత్తగా కాలుజాపి రికార్డర్ స్విచ్ నొక్కితేచాలు—పూర్తి మర్డర్ ప్లాను టేపులో ఎక్కిపోతుంది!

మా సంభాషణలో నళిని, చిత్రని బంధించిందన్న విషయంకూడ ప్రస్తావనకి రావాలి.

శివరాం మర్డర్ ప్లాను, చిత్ర కిడ్నాపింగ్, ఈ రెంటినీ టేప్ చేసి పోలీసులకి అప్పగిస్తేచాలు!

చిత్ర, నేను, శివరాం—అపాయంనుంచి బయటపడినట్టే. మా ముగ్గురుకీ చావు సంభవించే అవకాశముండదు.

నళిని వ్యవహారం పత్రికలు ప్రముఖంగా ప్రచురిస్తాయి. ఆత్మాభిమానం ఎక్కువవున్న నళిని అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుంటుంది...

కాబట్టి...చావు ఎవరికి? నళినికి?

నళినిలాంటి కిరాతకులు వున్నంతకాలం నాలాంటి డిటెక్టివ్ లు స్వేచ్ఛగా బ్రతకలేరు!

చిత్ర జ్ఞాపకం వచ్చింది: మధ్యాన్నం ఆమె అలా వింతగా ఎందుకు ప్రవర్తించిందో అర్థంకాలేదు. ఆమె మాటల్లోని మర్మంకూడ అంతుబట్టలేదు.

గుండె వేగంగా కొట్టుకుంది. ఒకవేళ ఆమె ప్రవర్తనకీ, ఆమెని నళిని బంధించడానికి ఏదయినా సంబంధం వుందా?

నా ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ ఇంటిముందు హారన్ మోగింది. అదిరిపడ్డాను. నళిని వచ్చింది! నాలో ఆతృత ఎక్కువయింది. ఈసారి నేనుచాలా జాగ్రత్తగా వ్యవహరించాలి! ఇది చివరి అవకాశం! నళినిని చాలా జాగ్రత్తగా వలలో బిగించాలి!

మరోసారి హారన్ మోగింది...

తటాలున తలుపు తెరిచి బయటకొచ్చాను. కారులో నవ్వుతూ చూస్తున్న శంభూ ముఖం కన్పించింది. వెనక సీట్లో నళినివుంది.

నన్ను చూసి మరోసారి హారన్ మోగించాడు శంభూ.

చకచక నడిచి కారు చేరుకున్నాను.

"గుడ్ ఈవెనింగ్ మాడమ్."

ఆమె తలెత్తి చూసింది. అసహ్యపుచూపులు! ఆమె శాశ్వతంగా కళ్ళుమూసే సమయం చాలా దగ్గరలోవుంది.

నేనూ చూశాను కర్కశంగా. "పదండి మాడమ్, ఇంట్లోకి."

ఆమె విషపునవ్వు విసిరింది. నాగుండె వేగం హెచ్చింది!

"కారెక్కు ఈశ్వర్" అందామె ముక్తసరిగా.

నాకాళ్ళు నేలకతుక్కుపోయాయ్!

"నిన్నే ఈశ్వర్, కారెక్కు!" మళ్ళీ అందామె.

పరిస్థితి గ్రహించాను. బలహీనంగానవ్వి, "ఇంట్లోకి రండి, మాడమ్!" అన్నాను.

మళ్ళీ కర్కశంగా చూసింది. "ఈశ్వర్, నీ ఎత్తులు

"ఈశ్వర్, నాకు రాని ఆలోచనలు నీకు వస్తున్నాయి. నన్ను నమ్ము! నిన్ను చంపాలన్న ఆలోచన నువ్వు చెప్పేవరకు నాకు రాలేదు! నిన్నెందుకు చంపుతాను ఈశ్వర్?"

"నేను బ్లాక్ మెయిల్ చేస్తానని భయపడి"

"ఓహ్, కాదు!" అరిచిందామె. "నువ్వు బ్లాక్ మెయిల్ చెయ్యవు! నిన్నెవరైనా ప్రేరేపిస్తే తప్ప నువ్వు చెడ్డపనులు చేయవు! నన్ను బ్లాక్ మెయిల్ చేయమని ఎవరూ నిన్ను ప్రేరేపించే అవకాశంలేదు! నిన్ను చంపించే ఆలోచన నాకుంటే శివరాంని నేనే చంపించేదాన్ని—నీ సహాయం లేకుండా. ఇది గ్రహించు."

"మీ మాటలు నాకు పనికిరావు మాడమ్. ఒక్క ముక్కలో చెప్పండి: హత్య మీరు చేయిస్తున్నట్టు కాయితం వ్రాసి ఇస్తారా లేదా?"

ఆమె మాటాడలేదు. ఆలోచనల్లో పడింది.

నేను లేచి శంభూని చూశాను. "ఆల్ రైట్, మిస్టర్ శంభూ, నా పిస్టల్ ఇచ్చేయ్!"

అతను అడ్డంగా తలూపాడు. "ఎందుకు?"

"ఇచ్చేయ్!" అర్చాను. "లైసెన్స్ నాదగ్గర వుంది—పిస్టల్ నీ దగ్గరవుంది. ఇది చట్టవిరుద్ధం."

నళిని తేరుకుని సైగ చేసింది. శంభూ పిస్టల్ తిరిగి నాకిచ్చాడు.

"ఆల్ రైట్, మాడమ్. ఈ బిజినెస్ గురించి బాగా ఆలోచించండి." అన్నాను. "సాయంత్రం అయిదు గంటలవరకు ఇంట్లో వుంటాను. ఇరవై వేల రూపాయలతోబాటు నేను కోరిన కాయితం వ్రాసి ఇచ్చేందుకు

అంగీకరిస్తే నాకు తెలియచేయండి. లేకపోతే మీకూ నాకూ రాం రాం!''

వెనక్కి తిరిగి చకచక బయటికి నడిచాను.

# 3

అక్కడనుంచి బయలుదేరి నా అసిస్టెంట్ చిత్ర ఇంటికెళ్ళేటప్పటికి సమయం రెండు గంటలైంది.

అక్కడామెతో భోజనంచేసి, పిచ్చాపాటి మాట్లాడుతూ నళినిని మర్చిపోవడానికి ప్రయత్నించాను. నళిని విషయం చిత్రతో చెప్పలేదు.

చిత్ర ప్రవర్తన ఈరోజు ఎందుకో ప్రత్యేకంగా వుంది. ఆమెలో ఏదో మార్పు వచ్చింది. కారణం అడిగాను. ఆమె చెప్పలేదు. అయితే కష్టాలు దూరమయ్యే రోజు చాలా దగ్గర్లో వుందని చెప్పింది.

ఆమె మాటలు నాకర్థంకాలేదు. నేనేమీ అడగలేదు. ఆమెదగ్గర సెలవు తీసుకుని తిరిగి నాయింటికి వచ్చేసరికి సమయం మూడు గంటలైంది.

మళ్ళీ నళినిగురించి ఆలోచనలు ముసురుకున్నాయి. ఒకవేళ ఆమె నా షరతులు అంగీకరిస్తే ఏంచేయాలి?

ఒకవేపు నా షరతులు ఆమె ఒప్పుకోదని ఆశగా వుంది. కాని నళిని ముఖం చూస్తే ఆమె దేనికైనా తెగించేలా వుంది.

నాలుగు గంటలవరకు వేచిచూశాను... ఫోను మోగలేదు.

ఇంతవరకు ఫోను మోగలేదు. నళిని మనసుమార్చుకుని తిరిగి వెళ్ళిపోయిందా?

హఠాత్తుగా మోగింది ఫోను.

అదిరిపడి పరిగెత్తి రిసీవర్ ఎత్తాను.

గ్రహించాను. నన్ను బోల్తా కొట్టించడానికి నువ్వుమరో జన్మ ఎత్తాలి! కారెక్కు!"

నేను కొయ్యబారిపోయి చూశాను. ఆమె మామూలు ఆడది కాదు. చక్కటి ఆలోచనా శక్తివున్న మేధావి! నేను అనుకున్నదంతా తల్లకిందులయిపోయింది...!

"మాడమ్, ఏమిటి మీరంటున్నది? నేనేంచేశాను?"

"నాకు తెలియదు. కాని నన్నేదో ట్రాప్‌లో యిరికించడానికి ఏర్పాట్లు చేస్తావని తెలుసు. మర్యాదగా కారెక్కు!"

"నన్ను నమ్మండి! నేనేమీ చేయలేదు!"

"నువ్వేమీ చేయలేవు! అయినా నిన్ను నమ్మను! కారెక్కు, షికార్లు కొడుతూ బిజినెస్ మాటాడుకుందాం!"

ఇక నాకు తప్పలేదు! చివరి అవకాశం చేజారిపోయింది. శివరాం చావు నా చేతిలోకొచ్చింది! ఒక్కక్షణం దేవుణ్ని తలచుకుని, భారమంతా వాడిమీద వేసి, ఇంటికి తాళంవేసి కారెక్కి కూచున్నాను.

కారు స్టార్టుచేసేముందు శంభూ జేబులోంచి వక్కలీసి నమిలి, నన్నుచూసి వెకిలిగా నవ్వాడు.

కారు బయలుదేరింది.

"ఈశ్వర్, మరోసారి నాశక్తి గ్రహించావు!" అంది నళిని. "అఫ్‌కోర్స్, అడుగడుగున గ్రహిస్తావు! ఇక చెప్పు, శివరాంని ఎలా చంపుతావు?"

శివరాం జ్ఞాపకంవచ్చి నాగుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

పిచ్చిప్రశ్న వేశాను. "శివరాంని చంపకపోతే యేం చేస్తారు?"

"నీ అసిస్టెంట్ ని చంపేస్తాను."

"నా అసిస్టెంట్ మీ అధీనంలో వుందని నమ్మకం యేమిటి?"

"మంచిది. చెప్పు, ఆమె శరీరంలో ఏ అవయవం పంపించమంటావు, నువ్వు నమ్మేందుకు?"

అదిరిపడ్డాను. "పిచ్చిప్రశ్నలు వేయకు!" అందామె.

"ఆమెనెక్కడ బంధించారు?"

"నాకు తెలియదు. శంభూకి తెలుసు. అతను చెప్పడు."

"చిత్రనెక్కడ బంధించారో మీకు తెలియదా?"

"శంభూకి తప్ప ఎవరికీ తెలియదు! ఏమిటి నీ అయిడియా?"

"ఏమీ లేదు! ఇప్పుడు నేను చేయగలిగిందేమీ లేదు" అన్నాను.

"అంటే?" అడిగిందామె గాభరాగా.

ఆమె కంగారుచూసి నేను సంతోషంతో వుక్కిరిబిక్కిరి అయ్యాను.

"శివరాంని చంపడం తప్ప!" అన్నాను. ఆమె తేలికపడింది.

"మాడమ్, మరి నేను కోరిన పైకం, కాయితము యిస్తారా?"

"పైకం పదివేలు. కాయితం—మర్చిపో!" అందామె.

కాబట్టి నా షరతులన్నీ మంటగలిశాయి. నా అసిస్టెంట్ ఆమె నిర్బంధంలో వుండగా ఏ విషయంలోనూ ఆమెని ఒప్పించలేను! ఆమె చెప్పినట్లు చచ్చినట్టు చెయ్యాలి!

"సరే, ఇక ప్లాను గురించి మాట్లాడుకుందాం!" అన్నాను.

"మంచిది. శివరాంని ఎలా చంపుతావు? ఈ విషయం ఇంతవరకు ఆలోచించలేదనుకుంటాను. పనికిరాని ఎత్తులు వేసి కాలం వ్యర్థం చేశావ్!" అరిచిందామె.

"నెవర్ మైండ్. మర్డర్ ఎలా చేయాలి? పబ్లిగ్గా చేయాలా, మరొకంటికి తెలియకుండా చెయ్యాలా?"

"పబ్లిగ్గా చేసే ధైర్యం వుందా నీకు?"

"అనుమతిస్తే చేస్తాను."

"పట్టుబడితే నా బాధ్యత వుండదు!"

"తెలుసు. మీరే చేయించారని నేను అరిచి గీపెట్టినా ఎవరూ నమ్మరు! నా దగ్గర ఆధారాల్లేవు! కాబట్టి పట్టుబడే అవకాశాలు లేకుండా చేస్తాను. సుమిత్ర–శివరాం రోజూ ఎక్కడ కలుసుకుంటారు?"

"బ్రిడ్జిమీద" అందామె ఆసక్తికరంగా చూస్తూ.

"గోదావరిమీద రెండు బ్రిడ్జిలున్నాయి" అన్నాను.

"ఓహ్, అవును! వాళ్ళిద్దరు కలుసుకునేది రైలు–రోడ్డు బ్రిడ్జిమీద!"

"ఏ సమయంలో?"

"సాయంత్రం ఏడుగంటలకి. గంటసేపు అక్కడ గడిపి తిరిగి విడిపోతారు–నేను గమనించాను."

ఆమె మాటలు విని నేను ఆలోచించాను. కారు అయిదు నిమిషాలు విశాలమైన రోడ్డుమీద నిశ్శబ్దంగా ప్రయాణించింది. ఆలోచించి, ఒక నిశ్చయానికి వచ్చి టైం చూసుకున్నాను. ఆరుగంటలైంది.

"మాడమ్, శివరాంని ఎలా చంపుతానో రఫ్ అయిడియా ఇస్తాను" అన్నాను. "సుమిత్ర, శివరాం ప్రతి సాయంత్రం బ్రిడ్జిమీద కలుసుకుంటారు కాబట్టి, నేను కింద లాంచిమీద నుంచి షూట్ చేయగలనేమో చూస్తాను—"

"ఈశ్వర్! పొరపాటున సుమిత్రని..." ఊపిరి బిగబట్టి అందామె.

నవ్వాను. "భయపడకండి! నా గురిమీద నమ్మకం వుంది. నేను పిస్తోలు చేతబట్టి పుట్టాను!" అన్నాను.

"పిస్తోలు శబ్దం ఎవరయినా వింటారు" మళ్ళీ అందామె.

"నా అయిడియా పూర్తిగా చెప్పనివ్వండి. సందేహాలు తర్వాత అడగండి. నాకోసం మీరొక లాంచి ఏర్పాటుచేయాలి. ఆ లాంచి టాపుమీద నేను బ్రిడ్జికి దగ్గరగా వెళతాను. కింద చీకటిగా వుంటుంది కాబట్టి లాంచి కన్పించదు. అఫ్‌కోర్స్, నేనూ కన్పించను యెవరికీ.

"నా చేతిలో సైలెన్సర్ అమర్చిన టెలిస్కోపిక్ రైఫిల్ వుంటుంది. టెలిస్కోప్‌లోంచి వరసగా బ్రిడ్జ మీద మనుషుల్ని గమనిస్తాను. ఒక వేళ వాళ్ళిద్దరూ నడుస్తూ కన్పిస్తే షూట్ చేయను. మూవింగ్ టార్గెట్‌ని అంత ట్రాఫిక్‌లో షూట్ చేయడం అసాధ్యం.

"వాళ్ళిద్దరు యెక్కడేనా నిలబడతారేమో గమనిస్తాను. లైట్స్ వెలుగులో పవర్‌ఫుల్ టెలిస్కోప్ లోంచి వాళ్ళని గుర్తించడం సులభం. శివరాం ఎప్పుడైతే దిశలోకొస్తాడో ట్రిగ్గర్ లాగేస్తాను."

నళిని నిట్టూర్చింది. ఏమీ మాట్లాడలేదు.

నేను మళ్ళీ అన్నాను. "నా గురి తప్పదు మాడమ్. శివరాం ఎప్పుడైతే నేలకూలతాడో అప్పుడే అలజడి ప్రారంభమవుతుంది. ఆ ఘోరం చూసి సుమిత్ర ఏ అఘాయిత్యం చేసుకుంటుందో నాకు తెలియదు. మీరను కున్నట్టు యేదీ జరగదు మాడమ్! ప్రియుడ్ని చంపి

సుమిత్రకి బలవంతపు పెళ్ళి చేయలేరు. సందేహంలేదు_ ఆమె తప్పకుండా ఆత్మహత్య చేసుకుంటుంది...''

''ఈశ్వర్, అవన్నీ నీ కనవసరం! శివరాంని చంపడం వరకే నీ పని. ఆ తర్వాత ఏం జరిగినా నీకు సంబంధం వుండదు__సుమిత్ర విషయంలో. మాతృత్వంలోని మాధుర్యం నీకు తెలియదన్నావు-ఎలా తెలుస్తుందనుకుంటాను. అది తెలియక తప్పటడుగులేస్తోంది. నచ్చచెప్పి, లాలించి దానికి సన్నిహితమవుతాను. నాకు నమ్మకం వుంది. దానికి ఇంకా ప్రేమ అంటే యేమిటో తెలియదు! అంతా మాయ! శివరాం ప్రేమించడంలేదు, మోహిస్తున్నాడు...సుమిత్ర వట్టి అమాయకురాలు!''

మొదటిసారిగా ఆమె కన్నీళ్ళు చూశాను.

కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుని దుఃఖాన్ని దిగ మింగుతూ బలవంతపు నవ్వు విసిరింది. నేను గాభరాపడ్డాను. ఇంత వరకు యిలాంటి సన్నివేశం ఎదురవలేదు.

''సారీ, మాడమ్...'' అన్నాను.

''ఈశ్వర్, సుమిత్రలేని నేను లేను!'' అందామె అస్పష్టంగా.

నాకు వెంటనే చిత్ర జ్ఞాపకం వచ్చింది.

''మాడమ్, చిత్రలేని నేను లేను!'' అన్నాను.

''అవును, ఆమె చెప్పింది__ఈశ్వర్, శంభూ నడుగు చిత్ర యేం చెప్పిందో?''

నేను కంగారుగా శంభూని చూశాను. అతను వెనక్కి__తిరిగిచూశాడు.

''ఆమె నిన్ను ప్రేమిస్తోందట పాపం! ప్చ్, నీకేదైనా సంభవిస్తే చచ్చిపోతుందట!'' అన్నాడతను.

నా గుండె విపరీతంగా కొట్టుకుంది! మధ్యాహ్నం

చిత్ర ప్రవర్తనకి, మాటలకి అర్థం యిదన్నమాట. ఆమె నన్ను ప్రేమిస్తోంది! ఈ నిర్ణయం ఆకస్మాత్తుగా ఎందుకు తీసుకుంది? నా మతి పోతోంది...

"భయపడకు ఈశ్వర్. చెప్పినపని పూర్తిచేసి చిత్రని జీవితాంతం ప్రేమించవచ్చు. ఆమెకెలాంటి హానీ జరగదు! ప్రేమికులంటే శంభూకి గౌరవం" అంది నళిని.

నే నింకా తేరుకోలేదు.

నళిని మళ్ళీ అంది. "ఈ రాత్రి నేను బయలుదేరి వెళ్ళి పోతున్నాను. రేపు సాయంత్రంవరకు నువ్వక్కడ వుండాలి. ఆరోజు, మర్నాడు అక్కడి పరిస్థితులు అర్థం జేసుకుని యెల్లుండి సాయంత్రం పని పూర్తి చేయాలి. పని పూర్తవగానే చిత్ర నిన్ను చేరుకుంటుంది."

పర్సులోంచి ఒక వందరూపాయల నోట్లకట్ట తీసి నా చేతిలో పెట్టింది. "మూడు వేలు. పనయ్యాక మిగతా డబ్బు."

నేను పరధ్యానంగా కట్ట జేబులో కుక్కాను. నళిని కారాపమని చెప్పింది. శంభూ ఆపాడు. నళిని నన్ను చూసి, "మళ్ళీ యెలాటి యెత్తులూ వేయకు—చిత్ర నా బందీ. అర్థమైందా? ఇక దిగు" అంది.

అదే పరధ్యానంలో నేను దిగి నిలబడ్డాను. కారు మరుక్షణం ఆలస్యం చేయకుండా దూసుకుపోయింది...

# 4

నా కారు అప్పుడే సూర్యారావుపేట దాటి వచ్చేసింది...

ఎంత వేగంతో డ్రైవ్ చేస్తున్నానో నాకు తెలియదు. కేవలం రెండుగంటల సమయంలో సూర్యాపేట చేరుకున్నాను. అది ఉత్సాహమో, భయమో అర్థం కాలేదు.

నళిని యిచ్చిన మూడు వేల రూపాయల్లో వెయ్యి రూపాయలు మిగిలినాయి. ఆఫీసు అద్దె, కారు టాంకు నిండా పెట్రోలు, ఇంటి అద్దె పీటన్నిటికీ రెండు వేలు ఖర్చయ్యాయి.

నేనిప్పుడు సంపాదిస్తోంది పాపిష్టి డబ్బు-ఖూనీ డబ్బు! ఆ డబ్బుతో జలసా చేయలేను. దానం చేస్తాను.

రాత్రంతా సరిగ్గా నిద్రపట్టలేదు. ఒక ధనవంతురాలి పరువు నిలబెట్టేందుకు, నా ప్రియురాలి(?) ప్రాణాలు కాపాడేందుకు, ఒక ప్రేమికుడ్ని హత్య చెయ్యాలి! అంతే గాక ఒక అమాయకురాలి జీవితం నాశనం చేయాలి!

పాపం, ఆ పెద్దమనిషి జయదేవ్ యెన్ని కలలుకంటు న్నాడో-నలభైలక్షల ఆస్తి తెచ్చే సుమిత్రకోసం!

నళిని చెప్పిన విధంగా నే నిప్పుడు యెలాటి ఎత్తులూ వేయడానికి ప్రయత్నించడంలేదు. ఇప్పటికే అనేకసార్లు చిత్తయి, అలసిపోయి మతి చెడిపోయింది...

సాయంత్రానికల్లా చారిత్రాత్మక ప్రసిద్ధిగల రాజ మహేంద్రవరం చేరుకుంటాను. ఒక హోటల్ లో బస చేసి నళినికి ఫోన్ చేస్తాను. నా ఆగమనం తెలిపి సుమిత్రని చూసేందుకు అనుమతి తీసుకుంటాను. నేనెవరో తెలియకుండా సుమిత్రనీ, శివరాంనీ చూస్తాను. ఒకసారి బ్రిడ్జి మీదికెళ్ళి సర్వే చేస్తాను. నళిని సిద్ధం చేసిన లాంచిలో మర్నాడు బ్రిడ్జికి దగ్గరగా వెళ్ళి రిహార్సల్స్ చేస్తాను...

ఇప్పుడు నా కారు డిక్కీలో సైలెన్సర్ అమర్చిన టెలిస్కోపిక్ రైఫిల్ వుంది. ఏర్పాట్లన్నీ పూర్తయ్యేదాకా అది డిక్కీలోనే వుంటుంది రహస్యంగా. నేను చేయబోయే హత్య పోలీసులకి అంతుచిక్కకుండా వుంటుంది.

హత్యాప్రదేశంలో ఎలాంటి క్లూస్ వుండవు. బుల్లెట్స్ ఏ దిశలో దూసుకొచ్చాయో యెవరూ వూహించలేరు_ ఇక యెవరు ప్రయోగించారో అసలు వూహించలేరు! లాంచిమీద నా రాకపోకలు యెవరి కంటబడకుండా జాగ్రత్తగా సాగించాలి...

ఇలా యెన్నో జాగ్రత్తలగురించి ఆలోచించసాగాను. ...ఆలోచనల మధ్య చిత్ర జ్ఞాపకం వచ్చింది. ఆమె నన్ను ప్రేమిస్తోంది! ఎందుకీ హఠాత్ నిర్ణయం? ఈ రెండేళ్ళు ఆమె యెంతో నిక్కచ్చిగా వుంది. మా ఇద్దరి మధ్య వృత్తిరీత్యాగాక వేరే సంబంధం లేదు! వేరే ఆలోచనలు లేవు!

సరే, ఆమె ఈ నిర్ణయం తీసుకోవడం ఒకందుకు మంచిదే. ఆమెని చేసుకుంటే యెలాంటి యిబ్బందులు వుండవు. అలాగాక మేం వేరొకర్ని చేసుకుంటే కీచులాట లేని క్షణం వుండదు.

నూతనోత్సాహంతో మరింత వేగంగా డ్రైవ్ చేశాను...

హత్యగురించి ఆలోచనలు గాలికి కొట్టుకుపోయాయి. ఇప్పుడు నేను పెళ్ళిగురించి ఆలోచిస్తూ విపరీతమైన వేగంతో గాలిలో తేలిపోతున్నాను...

శివరాంని చంపిన మరుక్షణం చిత్ర నన్ను చేరుకుంటుంది_ఎక్కడ?_ హైదరాబాదులోనా? రాజమండ్రీలోనా? శంభూ ఆమెని యెక్కడ బంధించి వుంచాడు?_

ఇవన్నీ నా కనవసరం. శివరాం చావు నన్నూ చిత్రనీ ఏకం చేస్తుంది. అదే చాలు!

## 5

నాలుగంతస్తుల నరకకి హోటల్‌లో నా గది మూడవ అంతస్తులోని నెంబర్ ట్వెంటీఫోర్.

రాజమండ్రీ రావడం ఇది రెండవసారి. ఇరవైఏళ్ళ క్రితం, యెప్పుడో మొదటిసారిగా వచ్చాను. ఇప్పుడేమీ జ్ఞాపకంలేదు.

అప్పుడు నేను ఎనిమిదేళ్ళ పిల్లాడిని. మా తాత వెంట ట్రెయినులో వచ్చాను. బ్రిడ్జిమీదుగా ట్రెయిన్ వెళ్తున్నప్పుడు నేనప్పుడే నిద్రలేచి కిందికి దిగబోయానట!

ఆ సంఘటన జ్ఞాపకం వచ్చి నవ్వుకున్నాను! సిగరెట్ వెలిగించి నాలో నేను అనుకున్నాను: 'మిస్టర్ ఈశ్వర్, ఆనాడు నువ్వు ట్రెయిను దిగివుంటే కింద నీళ్ళలోపడి చచ్చేవాడివి... ఈనాడు అదే నీళ్ళలో దిగి మరొకర్ని చంపబోతున్నావ్. ఇది నీ లైఫ్‌లో మరుపురాని అనుభవం కదూ?'

నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. చెమట పట్టింది. ఛటుక్కున లేచి బాల్కనీలో కొచ్చి నిలబడ్డాను. సమయం ఏడుగంటలైంది. నేనిక్కడికి వచ్చి గంట గడిచింది. కింద ఆవరణలో నా ఫియెట్ వుంది– తాళంవేసిన రైఫిల్‌తో.

ఇప్పుడు నా కర్తవ్యం నళినికి ఫోన్ చేయడం. అయిదు నిమిషాలు విశ్రాంతిగా పొగ తాగి, తిరిగి గదిలోకొచ్చి, టెలిఫోన్ డైరెక్టరీ తిరగేయసాగాను.

నళిని నెంబర్ సులభంగానే దొరికింది. రిసీవర్ ఎత్తి ఆపరేటర్‌కి నెంబర్ చెప్పాను. మరునిముషం కనెక్షన్ దొరికింది.

అవతల నళిని పలికింది: "యస్. ఎవరు మీరు?"

నేను సంతోషించాను. ఆమె నన్ను 'మీరు' అని పిలిచింది!

"మాడమ్, నేను ఈశ్వర్‌ని" అన్నాను.

"నువ్వా! ఎప్పుడొచ్చావ్? ఎక్కడున్నావ్?" గబ గబ అడిగిందామె.

"గంట క్రితం—నరకి." అన్నాను.

"జాగ్రత్త! ఆ హోటల్‌లో క్యాబరే జరుగుతుంది—అటువేపు చూడకు!"

"నో పర్సనల్ మాటర్స్! టాక్ బిజినెస్! సుమిత్ర ఎక్కడుంది?" అన్నాను.

"ఇప్పుడు ఏడుగంటలైంది—శివరాంని కలుసుకుంటుంది."

"ఎక్కడ?"

"అతని యింటిదగ్గర. దానికి డ్రైవింగ్ వచ్చు. ఇద్దరూ బ్రిడ్జిమీద కారులో వెళతారు..." అని కారు నెంబర్, మోడల్ చెప్పిందామె.

"మీరు హైద్రాబాదు యెందుకు వెళ్ళారో ఆమె అడిగిందా?"

"లేదు. నేనెక్కడికెళ్ళినా అది పట్టించుకోదు—స్వర్గానికెళ్ళినా!" అందామె.

"ఆల్ రైట్, నేనిప్పుడు వాళ్ళిద్దర్ని కలుసుకుంటాను. తర్వాత ఫోన్ చేస్తాను" అన్నాను.

"లాంచి సిదంచేశాడు శంభూ."

"ఎవరు నడుపుతారు?"

"అతనే."

"లాంచి వ్యవహారం రహస్యంగా వుంచారా?—అది చాలా ముఖ్యం!"

"భయపడకు. నా డబ్బు యెలాటివారి నోటినైనా మూయిస్తుంది!" టక్కున లైను కట్ అయింది.

నేను ఆలోచించకుండా బయటికి వచ్చి గదికి తాళం వేశాను.

# 6

బ్రిడ్జికి దారి ఎటో నాకు తెలియదు కాబట్టి టాక్సీ ఎక్కి పోనివ్వమన్నాను.

ఈ వూళ్ళో నన్నెవరూ గుర్తించరు—ఒక్క నళిని, ఆమె అనుచరుడు తప్ప. హోటల్‌లో మారు పేరు వ్రాయించాను.

బ్రిడ్జి చేరుకోగానే టాక్సీ దిగి పంపించేశాను.

నళిని చెప్పిన కారు బ్లాక్ అంబాసిడర్. దాని నెంబర్ జ్ఞాపకం పెట్టుకున్నాను. నా కళ్ళు ప్రతీ కారుని పరీక్షగా చూస్తున్నాయి.

గబగబ నడుస్తున్నాను. చలికాలం కావడంవలన వాతావరణం చాలా చల్లగా వుండి వణుకు పుట్టిస్తోంది.

వెనకనుంచీ, ముందునుంచీ రకరకాల వాహనాలు దాటిపోతున్నాయి. నాకా్కవల్సింది ఒక్కటీ లేదు అందులో. దాదాపు బ్రిడ్జి మధ్యకు వచ్చేశాను... అప్పుడే కింద అటువేపునుంచి ట్రైను వచ్చి బ్రిడ్జిని కాస్సేపు కుదిపేసింది. తొంగి కింద చూశాను. చంద్రుడు లేడు - కింద చీకట్లో నీళ్ళు కన్పించడంలేదు.

ఇంతలో 'సుమిత్రా!' అన్న పిలుపు నన్ను ఉలిక్కిపడేలా చేసింది.

తటాలున వెనక్కి తిరిగి చూశాను: ఎడమవేపు ఒక బ్లాక్ అంబాసిడర్ ఆగివుంది. లైటు వెలుగులో రెండు ఆకారాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఒకటి స్త్రీది, మరొకటి పురుషుడిది.

వాళ్ళిద్దరూ సుమిత్ర, శివరాంలని గుర్తించడానికి నాకెంతోసేపు పట్టలేదు.

"లాభంలేదు — ప్లైరు మార్చాలి" అంటున్నాడు

శివరాం. శివరాంని నేను చక్కగా గుర్తించాను. ఇప్పుడతను నల్లటి పాంట్ మీద తెల్లటి షర్టు ధరించాడు. విశాలమైన ఛాతీ, బలిష్ఠమైన చేతులు, చురుకైన కళ్ళు.. ...నేను చూసిన ఫోటోకీ, ఇప్పుడతని విగ్రహానికీ ఏమాత్రం భేదంలేదు.

అతనికి పక్కన కారు బానెట్ కి మోచేతులు ఆనించి నిలబడ్డ సుమిత్రకీ, నళినకీ ఎలాటి పోలికాలేదు! తల్లి ముఖంలోని క్రూరత్వం ఈమెలో లేదు. ఆమెది శాంత స్వభావమని ముఖంచూసి చెప్పవచ్చు.

నళిని ఆమె వయసు పదిహేడు అని చెప్పకపోతే ఇప్పుడు నేనామెని చూసి పొరబడే వాడిని. సుమిత్ర విగ్రహం చూస్తే ఎవరైనా ఆమె వయసు ఇరవై అని అంచనా వేస్తారు. గోధుమరంగు నైలెక్స్ చీర, అదే రంగు జాకెట్ ధరించింది. వంటిమీద ఎలాటి నగలూ లేవు, రిస్ట్ వాచీ తప్ప!

"రాం, కారునిక్కడే వదిలేద్దాం. టాక్సీలో ఇంటి కెళదాం" ఆమె మాటలు విన్పించి ఆలోచనల్లోంచి తేరుకుని చూశాను: ఎంతో మృదువైన స్వరం!

శివరాం అటూ ఇటూ దిక్కులు చూశాడు. నన్ను చూడలేదు. నేను నెమ్మదిగా కదిలాను వాళ్ళవేపు. వాళ్ళిద్దరు నన్ను చూసి బెదిరినట్టు కన్పించారు—ముఖ్యంగా శివరాం ముఖంలో ఆశ్చర్యం వ్యక్తమైంది.

"ఎక్స్యూజ్ మీ, కారు ట్రబుల్ ఇస్తోందా?" అడిగాను.

సుమిత్ర నన్ను విసుగ్గా చూసింది. "పద, రాం. నడిచి వెళదాం!"

శివరాం నన్ను మరోసారి చూశాడు. మా కళ్ళు కలి

శాయి. నేను ఘటుఫ్కాన చూపులు తప్పించి, కారు ముందరి టైరుకేసి చూశాను: గాలి దిగిపోయివుంది.

"ఆల్ రైట్, మీరేమీ అనుకోకపోతే టైరు మార్చేస్తాను." అన్నాను.

సుమిత్ర అసహనం ఇంకా ఎక్కువై అర్చింది. "రాం, అతన్ని వెళ్ళమను!"

నేనామెకేసి సూటిగా చూశాను. ఆమె నన్ను పళ్ళు నూరుతూ చూసింది.

"ఆల్ రైట్, మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తే క్షమించండి, వెళ్ళిపోతాను" అన్నాను.

"నెవర్ మైండ్" శివరాం పలికాడు. "మీ పేరు తెలుసుకోవచ్చా?"

వెంటనే జాగ్రత్తపడి, "అర్జున్రావ్" అన్నాను.

"థాంక్స్. శివరాం నా పేరు" అన్నాడతను. చేతులు కలిపాం.

"మీకు టైరు మార్చడం వచ్చా?"

"నేను డబ్బుకోసం ఏ పనైనా చేస్తాను."

శివరాం నన్ను అదోలా చూశాడు. "ఆల్ రైట్, టైరు మార్చండి!"

నేను మాట్లాడకుండా ఆ పనిలో నిమగ్నమయ్యాను. సుమిత్ర, శివరాం ఏవో కబుర్లు చెప్తూ గడిపారు. పావుగంటలో టైరు మార్చి బండి సిద్ధంచేశాను. శివరాం నవ్వి నాకు పదిరూపాయలు అందించబోయాడు. నేను తిరస్కరించాను. "ఇటీజ్ మై ప్లెజర్" అన్నాను.

"మీరు డబ్బుకోసం ఏ పనైనా చేస్తానన్నారు కదా?" అడిగాడతను.

"ఇలాటి చిన్న పనులు కావు" అన్నాను క్లుప్తంగా.

"అయితే పెద్దపనులా? ఏమిటవి?"

శివరాంని తీక్షణంగా చూశాను. అతనూ అలాగే చూస్తున్నాడు. సుమిత్ర ఈ లోకంతో సంబంధంలేనట్టు ఎటో చూస్తోంది.

"ఎ. కే. అర్జున్ గారూ, నా పిచ్చి ప్రశ్నలతో మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నాను. మీరు చాలా సహాయం చేశారు. నేనెవరి రుణమూ వుంచుకోను! పదండి హోటల్ కెళదాం" శివరాం స్వరం ఆజ్ఞాపించినట్టు వుంది.

నేను అదిరిపడ్డాను.

'నేనెవరి రుణమూ వుంచుకోను!' ఓహ్, గాడ్! నేను చేసిన ఈ చిన్న సహాయానికి రేపు అతను నాకు ప్రాణాలర్పించి రుణం తీర్చుకోబోతున్నాడు! ఆ ప్రాణాలు నేను తీయబోతున్నాను! ఈ చేతులతో!

తేరుకుని వారిద్దరిని చూశాను. సుమిత్రమీద నాకు జాలివేసింది. తల్లిని ఎదిరించి ఆమె శివరాంని ప్రేమిస్తోంది. ఆమెకి శివరామ్ తప్ప ఆప్తులెవరూ లేరు.

శివరామ్‌ని చంపడం ఎంత ప్రమాదకరమైనదో నాకు తెలుసు. కానీ, ఆ మతిభ్రమించిన మగువ తాను చాలా తెలివిగలదాననుకుంటోంది! సుమిత్రని లాలించి, నచ్చచెప్పి సన్నిహిత మవుతుందట! అది అసంభవమని ఆమెకి తెలియదు! శివరాం హత్య కాబడితే సుమిత్ర ఆత్మహత్య చేసుకోడం ఖాయం!

శివరాంని చంపడం వరకే నా పనసీ, ఆ తర్వాత ఏ విషయంలోనూ నాకు సంబంధముండదని చెప్పింది నళిని. నేనిప్పుడు నిర్ణయం మార్చుకున్నాను. శివరాం – సుమిత్రలని విడదీయడం నాకిప్పుడు ఇష్టంలేదు.

రెండు ప్రేమ జంటలకి శత్రువుగా తయారైన నళినిని

చంపితే సమస్యలన్నీ పరిష్కరింపబడతాయి. సుమిత్ర - శివరాం, నేను — చిత్ర క్షేమంగా వుంటాం. ఇది సరయిన ఆలోచన. వెంటనే ఆచరణలో పెట్టాలి!

నా ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ శివరాం అన్నాడు, "మీరు చిత్రమయిన మనిషిలా వున్నారు. ఏమిటి ఆలోచిస్తున్నారు?"

నెమ్మదిగా తలతిప్పి అతన్ని చూశాను. "క్షమించండి, నేను అర్జంటుగా ఒక పని చేయవలసివుంది. తర్వాత కలుసుకుందాం, మీరెక్కడ వుంటారు." అడిగాను.

నవ్వాడతను. "ప్రతీ సాయంత్రం ఈ సమయానికి ఇక్కడే వుంటాం!" అన్నాడతను.

థాంక్స్ చెప్పి వెనక్కి తిరిగి చకచక నడిచాను.

వెనకనుంచి సుమిత్ర ఫక్కాలున నవ్వడం, నన్ను పిచ్చివాడని అనడం నాకు అస్పష్టంగా వినిపిస్తూనే వుంది...

# 7

మర్నాడుదయం నిద్రలేచేసరికి బాగా పొద్దుపోయింది.

రాత్రంతా నాకు సరిగా నిద్రపట్టలేదు, నళినిని చంపాలన్న నా నిర్ణయం నన్ను చాలా కలవరపర్చింది. ఆమె చావు ఎన్నో సమస్యల్ని పరిష్కరిస్తుంది.

అయితే శంభూనికూడా చంపక తప్పదు. ఈ వ్యవహారాని కంతటికీ అతను ప్రధానసాక్షి.

నళినిని, శంభూనీ చంపేస్తే చిత్ర నాకు ఏదోవిధంగా క్షేమంగా దక్కుతుంది. అలాగే సుమిత్ర — శివరాం భవిష్యత్‌లో ఎలాటి ఆటంకాలూ లేకుండా స్వేచ్ఛగా జీవించగలుగుతారు. ఇలా జరగడంవల్ల నష్టపోయేదిఒక్కడే: జయదేవ్ తనకి జరిగిన అన్యాయానికి ఎంత విలపిస్తాడో!

"డామిట్! అతనిమీద నాకు జాలెందుకు? ఈ వ్యవ

వారంలో అతను ప్రాణాలకి ప్రమాదంవున్న వ్యక్తికాదు! మేం క్షేమంగా వుండాలంటే అతనికి అన్యాయం జరగక తప్పదు! శివరాం ప్రాణాలు కోల్పోయి, తన ప్రేయసిని జయదేవ్ కి అప్పగించడమన్నది నాకు నచ్చలేదు!

కాబట్టి, నళినిని, ఆమె అనుచరుడు శంభూనీ చంపాలి! తల్లి చనిపోతే సుమిత్ర ఏమాత్రం చింతించదని నాకు నమ్మకంగా తెలుసు! ఆమె చనిపోతే ఒక్క జయదేవ్ తప్ప చింతించేవారుండరు!

చకచక స్నానంచేసి, టిఫిన్ చేసి సిగరెట్ వెల్గించాను. నా మెదడ్లో ప్రవేశించిన ఈ కొత్త ఆలోచన ఒక సమస్యగా తయారైంది.

నళినిని చంపి నేను పట్టుబడకుండా వుండగలనా? ఈ సందేహం గురించి క్షుణ్ణంగా ఆలోచించాను. అయితే చిత్ర నాకెలా దక్కుతుంది? ఆమె ఎక్కడ వుందో నాకు తెలియదు.

గదిలో వేగంగా పచార్లుచేస్తూ అరగంట తర్వాత చిత్రని దక్కించుకునే మార్గం ఆలోచించి ఒక పథకం తయారుచేశాను...

ఆ తర్వాత నళిని బంగళాకి బయలుదేరాను.

సమయం పదకొండు గంటలయింది—ఎండ తీవ్రంగా వుంది.

నళిని బంగళాలో శంభూ నాకు గమ్మత్తుగా స్వాగతం చెప్పాడు. ముందుకి వంగి చెయ్యెత్తి నమస్కారంచేసి, నృత్య భంగిమలో నడిచివచ్చి నా చెయ్యి పట్టుకుని లోనికి తీసుకెళ్ళాడు.

మేడమీద గదిలో నళిని సోఫాలో కూచోని ఏవో కాయితాలు చూస్తోంది. నా ఉనికి పసిగట్టి ఆమె తలెత్తి చూసి చిరునవ్వు విసిరింది.

నేనా మెని విష్ చేయకుండా, బదులుగా నవ్వకుండా, మొండి వైఖరి ప్రదర్శిస్తూ ఆమె ఎదురుగా వెళ్ళి కూచు న్నాను. ఆమె ఆశ్చర్యపడిందిగానీ, అది బయటపడకుండా జాగ్రత్తపడింది. "ఏమిటిలా వచ్చావ్?" కసిరిందామె.

"రాత్రి మీ కూతుర్ని, శివరాంనీ చూశాను—నాకు అన్యాయమన్పించింది" అన్నాను.

ఆమె వులిక్కిపడి చూసింది. "ఈశ్వర్, మరేదైనా కొత్త అయిడియా తట్టిందా?" వ్యంగ్యంగా అడిగిందామె.

నేను వెనక్కి తిరిగి చూశాను. శంభూ గుమ్మంలో నిలుచ్చివున్నాడు.

"అవును మాడమ్" అన్నాను. "సుమిత్ర ఎక్కడ వుంది?"

ఆమె అయోమయంగా చూసి, "బయటకెళ్ళింది" అంది.

నేను ఆలస్యం చేయకుండా తటాలున ఆమె పక్కన దూకి పిస్తోలు తీసి ఆమె కణతకి ఆనించాను. ఇది చూసి శంభూ ముందుకి దూకాడు. నళిని కొయ్యబారిపోయి చూస్తుండిపోయింది.

నేను గట్టిగా నవ్వి శంభూని చూశాను. "శంభూ, ఇక్కడ నేను పిస్తోలు ప్రయోగిస్తే వినేవారు లేరు. వుండరు. అర్థమైందా? ఒ.కే. ఇక చెప్పు, చిత్ర ఎక్కడ వుంది?"

శంభూ గాభరాగా నళినిని చూశాడు. నళిని తటస్థంగా కూచుంది.

"శంభూ! తెలివి తక్కువగా ప్రవర్తించకు! చిత్ర ఎక్కడ వుంది?" అరిచాను.

"చెప్పను!"

"చెప్పవా? అయితే మాడమ్‌ని చంపుతాను!"

అతను భయపడలేదు. రెండడుగులు ముందుకేశాడు.

"మాడమ్, శంభూని అడగండి! చిత్ర ఎక్కడ వుంది? వెంటనే సమాధానం కావాలి నాకు!"

"ఈశ్వర్," నళిని గొణిగింది. "నువ్వు పెద్ద చిక్కులో పడ్డావిప్పుడు."

"ఏమిటి మీరనేది?"

"చిత్ర ఎక్కడ వుందో శంభూ చెప్పడు! విధి నిర్వహణలో తన యజమానినికూడా ఖాతరు చేయడతను!"

శంభూని చూశాను. అతను తాపీగా చూస్తున్నాడు.

"శంభూ, చిత్ర ఎక్కడ వుందో చెప్తావా, మాడమ్‌ని చంపమంటావా?"

శంభూ వికృతంగా నవ్వాడు. "ఈశ్వర్—నువ్వు మాడమ్‌ని చంపు. నేను చిత్రని చంపుతాను.—ఆ తర్వాత ఇద్దరం ఏడుద్దాం!"

అతని మాటలకి నేను రెచ్చిపోయాను. నా చూపుడు వేలు ట్రిగ్గర్ లాగేందుకు సిద్ధంగా వుంది. ఉద్రేకంలో ఏం చేస్తానో నాకే తెలియదు. విపరీతంగా చెమటలు కారుతున్నాయి.

శంభూ మాటలకి నేను ఉలిక్కిపడ్డాను. "బాస్టర్డ్! చిత్ర ఎక్కడ వుందో చెప్పకపోతే మీ ఇద్దర్నీ ఇక్కడే చంపేసి వెళతాను. కమాన్ చెప్పు!"

"మా ఇద్దర్నీ చంపేయ్!" అరిచాడతను. "చిత్ర ఎక్కడ వుందో తెలుసుకోలేవు! ఆమె దిక్కుమాలిన చావు చస్తుంది."

నా నరాలు బిగదీసుకుపోయాయి. ప్రాణాలకి తెగించిన మనుషులు వీళ్ళు! పరిస్థితి బోధపడింది. నా బెదిరింపులవల

ఇక లాభంలేదు. చిత్ర ఎక్కడ వుందో తెలియనంత కాలం వీళ్ళని చంపలేను! తెలుసుకునే మార్గం ఆలోచించి ఈ పథకం వేశానుగానీ, ఇంత ఘోరంగా దెబ్బ తింటా ననుకోలేదు. ఇక నేనేమీ చేయలేను. పిస్తోలు జేబులో వేసుకుని నిస్సహాయంగా చూశాను.

నళిని తేలిగ్గా వూపిరి వదిలింది. శంభూ నోట్లో వక్క వేసుకున్నాడు.

"నా శక్తిని చీటికీమాటికి పరీక్షించాలనుకోడం నీకు మంచిది కాదు" అంది నళిని,

నేను మాట్లాడలేదు. అవమానంతో తల వంచుకున్నాను.

"పాపం! బాబుగారికన్ని కష్టాలో! నాకు జాలిగా వుంది!" శంభూ కామెంట్ చేశాడు.

నళిని అంది. "ఇక వెళ్ళు ఈశ్వర్. నన్ను అనవసరంగా డిస్టర్బ్ చేశావు. సాయంత్రం సరిగ్గా ఏడు గంటలకి శంభూ నిన్ను లాంచిమీద తీసుకెళతాడు. పని పూర్తయాక మిగతా డబ్బు నీకు లభిస్తుంది. చిత్ర నీకు దక్కుతుంది."

చేసేదిలేక అలాగే తల వంచుకుని బయటకి నడిచాను.

# 8

లాంచి నీటి ప్రవాహానికి ఎదురుదిశలో దూసుకెళుతోంది. చీకట్లో కింద నీట్లోకి చూడాలంటే భయంగా వుంది.

గంభీరంగా డ్రైవ్ చేస్తోన్న శంభూని చూస్తూ నన్ను వేధిస్తోన్న ఆలోచనల్ని అణగదొక్కుతూ, విశ్రాంతిగా సిగరెట్ కాల్చసాగాను.

సమయం ఏడుగంటలు దాటి అయిదునిముషాలైంది.

మరో అయిదు-పది నిముషాల్లో శివరాం ప్రాణాలు గాల్లో కలుస్తాయి. రైఫిల్ లో రెండే రెండూ తూటాలునింపాను. నా గురిమీద నమ్మకం వుంది.

శివరాంని చంపకూడదని మనసు యెంతో గోల చేస్తున్నా దాని పీక నొక్కేశాను. చిత్ర గురించితప్ప ఇంకెవరిగురించీ ఆలోచించడంలేదు. ఆమెని రక్షించ డానికి నేను చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. కాబట్టి శివరాంని చంపుతాను! ఆ తర్వాత సుమిత్ర, జయదేవ్, నళిని ఏమైతే నాకెందుకు? లెట్ దెమ్ గో టు హెల్!

లాంచి బ్రిడ్జికి చేరువగా వచ్చేసింది. నేను అప్రయత్నంగా రైఫిల్ మీద చెయ్యి వేశాను. సుమిత్ర-శివరాం ఈరోజు బ్రిడ్జిమీదకి వస్తారా? తప్పకుండా వస్తారు! నిన్న శివరాం చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి.

బ్రిడ్జి యాభైగజాల దూరాన వుండగా నేను కేబిన్ లోంచి పైన టాపుమీదకి వచ్చాను.

పరిసరాలన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. చుట్టు పక్కల మరే నావలుగాని, లాంచీలు గాని లేవు. శంభూని లాంచీని బ్రిడ్జికి సమాంతర దిశలో పోనివ్వ మన్నాను. ఆ తర్వాత టెలిస్కోపిక్ రైఫిల్ ఎక్కుపెట్టి చూడసాగాను.

బ్రిడ్జిమీద జనసంచారం అధికంగా లేదు. వాహనాలు అధికంగా వున్నాయి. టెలిస్కోప్ లోంచి బ్రిడ్జిమీద దృశ్యమంతా స్పష్టంగా కనిపిస్తోంది.

నా చూపుడువేలు ట్రిగ్గర్ మీద సిద్ధంగా వుంది. అక్కడక్కడ ఒంటరి మనుషులు కనిపించారు గానీ సుమిత్ర-శివరాంల జంట కన్పించడంలేదు. శంభూని నెమ్మదిగా డ్రైవ్ చేయమని చెప్పాను.

మళ్ళీ టెలిస్కోప్‌లో చూశాను. రెండు కార్లు వేగంగా వెళ్ళడం కనిపించింది. రంగు స్పష్టంగా గుర్తించలేకపోయాను. లాంచి మరో పదిగజాలు ప్రయాణించింది నెమ్మదిగా.

అప్పుడు చూశాను—ఆగివున్న ఒక అంబాసిడర్ కారు, దాని పక్కన యిద్దరు మనుషులు—శివరాం, సుమిత్ర. వాళ్ళిద్దర్నీ పరీక్షగా గమనించాను టెలిస్కోప్ లోంచి. సందేహంలేదు! వాళ్ళే!

సుమిత్ర గతరోజు ధరించిన దుస్తుల్లోనే వుంది. శివరాం ఎర్రచొక్కా, తెల్లపాంటు ధరించాడు. వాళ్ళిద్దరు ఎదురెదురుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు. అయితే శివరాం వీపు నాకేసివుంది. నేను నిరాశపడ్డాను. అతన్ని నాకేసి తిరిగేవరకు వేచి చూడాలి.

లాంచి వాళ్ళని దాటి చాలాదూరం వచ్చేసింది. తిరిగి వెనక్కి తిప్పి పోనివ్వమన్నాను.

"కన్పించారా?" శంభూ అడిగాడు.

"అవును—ఆ కారుదగ్గర రెండు ఆకారాలు—సుమిత్ర, శివరాం. జాగ్రత్తగ చూస్తుండు ఒక ఆకారం, నేలకూలుతుంది!" అన్నాను.

"నమ్మకమేనా?"

"చూస్తావుగా?"

"కదులుతున్న లాంచిమీద కూచొని షూట్ చేయగలవా అని!"

"నువ్వు నోర్మూసుకుని చూడు!" కసిరాను. లాంచి తిరిగి సరిగ్గా శివరాం నిలబడివున్న దిశలోకి వచ్చింది. శివరాం అలాగే నిలబడి వున్నాడు. వీపు నాకేసి వుంది. టెలిస్కోప్‌లోకి మళ్ళీ చూశాను. రేంజి ఎడమచేతి జట

ఒకటికి పదిసార్లు చూశాను. సందేహంలేదు. వాళ్ళిద్దరు సుమిత్ర, శివరాం! శివరాం నా వేపు తిరిగేవరకు నేను వేచివుండదలచలేదు. ఏక్షణాన్నైనా వాళ్ళిద్దరు కారెక్కి వెళ్ళిపోవచ్చు.

"శంభూ! బ్రిడ్జికేసి చూడు!" అర్చాను. రైఫిల్ గురి పెట్టి, టెలిస్కోప్‌లో జాగ్రత్తగా చూశాను. నా గురి శివరాం వీపుకేసి వుంది. వీపులో రెండుగుళ్ళు—అవి తప్పకుండా గుండెలోకి దూసుకువస్తాయి. తక్షణం చావు సంభవిస్తుంది.

ఆలస్యం చేయకుండా రెండుసార్లు ట్రిగ్గర్ లాగి రైఫిల్ కింద పెట్టి నిట్టూర్చాను.

నా రైఫిల్ నుంచి ఎలాటి పేలుడూ వినబడలేదు. గుట్టుచప్పుడు కాకుండా రెండు తూటలు దూసుకెళ్ళి శివరాం వీపులో రెండు చక్కటి రంధ్రాలు చేశాయి. జివ్వుమని రక్తం విరజిమ్మటం టెలిస్కోప్‌లో కనిపించింది.

శివరాం ముందుకు తూలి సుమిత్ర భుజాలు పట్టుకుని, ఆ తర్వాత నెమ్మదిగా జారి ఆమె కాళ్ళదగ్గర పడ్డాడు.

సుమిత్ర భయంకరంగా నోరు తెరిచి అర్చింది. అరుపు నాకు వినిపించలేదు. మరుక్షణం ఆమె కింద కూలబడి శివరాంని కుదిపేస్తోంది. చూస్తుండగానే జనం, వాహనాలు వాళ్ళచుట్టూ మూగడం కనిపించింది.

నేనెంతసేపు అలా చలనం లేకుండా కూచున్నానో తెలియదు. తేరుకుని చూస్తే లాంచి వేగంగా దూసుకెళ్ళడం గమనించాను. ఇంజన్ శబ్దంలో శంభూ అరుపులు వినిపిస్తున్నాయి.

"శభాష్ ఈశ్వర్! భలేగురి! మాడమ్ నిన్ను మెచ్చుకుంటుంది! నువ్వీ పని చేయగలవని నేను నమ్మలేదు!"

నేను కేబిన్‌లోకి ప్రవేశించాను.

"బాస్‌సర్! నేనిప్పుడు హంతకుడిని!" అన్నాను కటిగా.

పకపక నవ్వాడు శంభూ. "చేసింది మర్చిపో! మేడమ్ వల్లగానీ, నావల్లగానీ నీకే ప్రమాదమూ వుండదు! నేనిప్పుడే మేడమ్‌ని కలుసుకుని అంతా ఓ.కే. అంటాను. అంతే! ఏడువేల రూపాయలతో చిత్ర నీ వొళ్ళో వచ్చి వాలుతుంది... హోటల్ గదిలో ఎదురుచూస్తుండు. మరో విషయం—చిత్ర నిన్ను చేరుకున్నాక ఒక్క క్షణంకూడా నువ్వు ఈ వూళ్ళో వుండకూడదు!"

"బాస్‌సర్, అలాగే!...అలాగే, బాస్‌సర్!" అన్నాను కసిగా.

# 9

హత్యచేసి నేను చిత్రని రక్షించుకోగలిగానుగాని, పట్టుబడితే నన్ను రక్షించేవారుండరు. ఇది నా స్వంత బాధ్యతమీద చేసిన హత్య. మొట్టమొదటి హత్య.

నేను యెన్ని జాగ్రత్తలు తీసుకుని హత్యచేసినా యెక్కడో ఆధారం వదిలానని నా అనుమానం. నేర పరిశోధకుడిగా నా అనుభవంలోంచి తెలుసుకున్నదేమిటంటే, నేరం చేసినవాడు తప్పకుండా తనకు తెలియకుండా ఏదో ఒక ఆధారం వదులుతాడు. ఆ ఆధారం అతన్ని పట్టిస్తుంది. కాబట్టి ఇవాళ కాకపోయినా రేపైనా, రేపు కాకపోయినా మరేనాటికైనా నేను పట్టుబడక తప్పదు.

నా రక్షణ విషయంలో నళిని ఏమాత్రం కల్పించుకోలేదు. పరిస్థితుల ప్రాబల్యం నన్ను హత్య చేసేందుకు

ప్రేరేపించిందని నేనెంత వాదించినా అందుకు ఆధారాలు చూపినా కొట్టివేస్తారు...నళిని తన డబ్బు ఉపయోగించి తనని తాను రక్షించుకుంటుంది!

ఈపాటికి పోలీసులు హత్యాప్రదేశానికి చేరుకునే వుంటారు. సుమిత్రని ప్రశ్నిస్తారు. ఆమె ఏం చెబుతుంది? తన తల్లి ఈ పని చేయించిందని అంటుందా? లేక తల్లి దుర్మార్గానికి శివరాం బలైనందుకు తనూ చావు కోరుకుంటుందా? అసలు శివరాంని చంపించింది తన తల్లి అని ఆమెకి తెలుసా?

వేగంగా పరిగెడుతున్న నా ఆలోచనలకి అడ్డుగోడ కట్టేస్తూ తలుపుపైన చప్పుడైంది. ఈ లోకంలోకొచ్చి పడ్డాను...

చిత్ర!

ఆమె వచ్చేసింది! సందేహం లేదు! రెండేళ్లు నాకెంతో సహకరించి, నా తెలివితక్కువతనం వలన రెండురోజులు ఖైదీగా గడిపి, ఈ రాత్రి నన్ను కలుసుకునేందుకు వచ్చేసింది—నన్ను ప్రేమిస్తోన్న చిత్ర!

గబగబ వెళ్ళి తలుపు తెరిచాను.

"ఓ...హ్, ఈశ్వర్!" అర్చిందామె, సందేహం లేదు, ఆమె నా అసిస్టెంట్ చిత్రే!

నేను వెనక్కి తొలిగి ఆమెకి దారి ఇచ్చాను. ఆమె లోనికి వచ్చాక తలుపు మూశాను.

"ఈశ్వర్, ఈశ్వర్...ఏమిటిదంతా?" ఆమె అరుపు విని ఆమె ముఖంలోకి చూశాను. రేగిపోయిన జుత్తు, పీక్కుపోయిన చెంపలు, పాలిపోయిన పెదవులు ..మాసిపోయిన దుస్తులు...ఆమెనలాంటి స్థితిలో ఎన్నడూ చూడలేదు!

"ఏమీ లేదు చిత్రా! నువ్వు క్షేమంగా వున్నావా?" బలహీనంగా నవ్వి అడిగాను.

"నాకేమీ కాలేదు! ఏం జరిగింది? మీరిక్కడ ఎందుకున్నారు? నన్నిక్కడికి ఎందుకు తెచ్చారు?"

ఇంటరాగేషన్ చేయడంలో ఆమెది అందెవేసిన చేయి.

"చిత్రా, యేమీ జరగలేదు. దయచేసి నన్నేమీ అడక్కు!"

"లేదు! యేదో జరిగింది! మీరేదో చేశారు! నాతో చెప్పితీరాలి..."

"ఎందుకు చెప్పాలి? నేను నీ బాస్‌ని."

"ఓహ్, ఈశ్వర్! ఐ లవ్ యూ! రియల్లీ! బిలీవ్ మీ!"

నేను వూపిరి బిగబట్టి ఆమెని చూశాను. ఆమె ఏడ్వగా నేనెప్పుడూ చూడలేదు!

"చిత్ర, జరిగింది చెప్తే నన్ను ప్రేమించవు! అసహ్యించుకుంటావు!"

"మీకు సహాయపడతాను! మీ కోసం ప్రాణాలిస్తాను!"

ఆమె మాటల్లో అబద్ధంలేదు. చిత్ర స్వభావం నాకు తెలుసు. ఆమె చేయగలిగే మాటలే చెప్తుంది. ఆమె నన్ను ప్రేమిస్తోంది కాబట్టి, నేనూ ఆమెని ప్రేమిస్తున్నాను కాబట్టి లైఫ్‌లో ఎదురయ్యే కష్టాల్ని మేం ఇద్దరం పంచుకోవాలి కాబట్టి, కష్టాల్ని పంచుకోడం నిజమైన ప్రేమ అవుతుంది కాబట్టి... జరిగిందంతా పూసగుచ్చినట్టు మొదటనుంచి చివరిదాకా చెప్పాను.

అంతా విని ఆమె గజగజ వణుకుతూ నన్ను గట్టిగా కౌగిలించుకుంది.

"ఈశ్వర్! మీరు... మీరు హత్య చేశారు!"

"నీకోసం! నిన్ను ప్రేమిస్తున్నాను!"

"ఓహ్, ఈశ్వర్! మీ ప్రేమకోసం సాటి ప్రేమికుల్ని నాశనం చేశారు!"

"నా ప్రేమకంటే నాకు నీ ప్రాణాలెక్కువ చిత్రా! తప్పలేదు!" ఇంకా ఇంటి మాటలెన్నో చెప్పి నన్ను నేను సమర్థించుకుని, నేను చేసింది సబబేనని ఆమెచేత ఒప్పించాను.

ఆ తర్వాత అడిగాను: "శంభూ నిన్నెక్కడ బంధించాడు?"

"నాకు తెలియదు! అది పాడుబడ్డ కొంప!"

"డబ్బిచ్చాడా?"

ఆమె భుటుక్కున హాండ్ బ్యాగ్ తెరిచి చూపించింది. సరికొత్త నోట్లకట్టలు కన్పించాయి. కళ్లు మూసుకున్నాను. ఆ డబ్బు నాకొద్దు! శివరాం పేర్న ఏ సహాయ నిధికైనా పంపించేస్తాను.

"ఆల్ రైట్ చిత్రా, నువ్వు స్నానం చెయ్!" అన్నాను సిగరెట్ వెల్గించి.

"ఈ రాత్రి ఇక్కడ వుండాలా!"

"తప్పదు!"

"అంటే?"

"పోలీసులకి అనుమానం రాకుండా వుండాలంటే ఈ రాత్రి మనం గది ఖాళీ చేయడం మంచిదికాదు. రేపు వెళ్ళిపోదాం!"

ఆమె తలూపి వెనక్కి తిరిగింది. బాత్ రూం తలుపు తీయబోతుండగా నేను వెనకనుంచి టవల్ విసిరాను. ఆమె దాన్ని అందుకుని, చిరునవ్వు విసిరి లోనికెళ్ళింది.

నేను నిట్టూర్చి సోఫాలో కూలబడి సిగరెట్ వెల్గించాను.

రెండున్నర సంవత్సరాలు బెంగళూరులో టాప్ క్లాస్ డిటెక్టివ్ గా చెలామణి అయిన నేను కేవలం ఒక ఆడదాని చేతిలో కీలుబొమ్మగా మారాను! నేనిక ఈ వృత్తికి పనికిరాను. నా సామర్థ్యం ఎంత గొప్పదో ఈ వ్యవహారంలో అడుగడుగున గోచరించింది! ఈ వృత్తికి గుడ్ బై కొట్టి, మరోదారి చూసుకోవాలి.

తలుపుమీద చప్పుడైంది...

బాత్ రూమ్ తలుపుమీద కాదు. గది ప్రవేశద్వారం మీద.

నాకేమీ అర్థంకాలేదు. ఎవరు వచ్చారు? బట్లర్ వచ్చాడా? లేక శంభూ వచ్చాడా? లేక — లేక... పోలీసులు వచ్చారా?

నా గెండెలో బాంబు పేలింది. ఇంత త్వరగా నన్ను వాళ్ళెలా చేరుకోగలుగుతారు?

"మిస్టర్ ఈశ్వర్, నీ సామర్థ్యం క్షీణించిందని నువ్వు గ్రహించావు. పోలీసులు నిన్ను క్షణాలమీద పట్టుకునే ఆధారాలు ఏవైనా హత్యాప్రదేశంలో వదిలావేమో ఆలోచించు!" అంతరాత్మ చెప్పింది.

నా మతిపోయింది. అది సంభవమా?

మరోసారి చప్పుడైంది. నా మనసు పరుగులు తీసింది. నా కాళ్ళు తలుపువద్దకు అప్రయత్నంగా నడిచాయి...

నా గుండె వేగం చూస్తోంటే అది ఏక్షణాన్నైనా పగిలేలా వుంది. దాన్ని అతి ప్రయత్నంమీద అదుపులో వుంచి, తలుపుదగ్గర నిలబడి గట్టిగా గాలిపీల్చి, కళ్ళు

మూసుకుని తలుపు తెరిచాను. ఆ తర్వాత కళ్ళు తెరిచాను...

గొప్ప గొప్ప సాహసకృత్యాలు చేసే టార్జన్, ఫాంటమ్‌లను గురించి పుస్తకాల్లో చదివి ఆ పాత్రలపట్ల ఎంతో అభిమానం ఏర్పరచుకున్నాను గానీ, ఆ పాత్రలే వాస్తవ రూపం ధరించి ఇలాటి పరిస్థితిలో, నా స్థానంలో వుంటే, తప్పకుండా మతి చలించి పిచ్చివాళ్ళవుతారని నమ్మకంగా చెప్పగలను.

ఎందుకంటే, ఇప్పుడు నా ఎదురుగా శివరాం నిలబడి వున్నాడు.

# 10

"హల్లో మిస్టర్ అరుజ్నావ్ అలియాస్ ఈశ్వర్రావ్! హౌ ఆర్యూ? ఎలాగున్నారు?"

"కమిన్, కమిన్, కమిన్..." ఏమంటున్నానో నాకే తెలియదు. చలిజ్వరం వచ్చినవాడిలా వణికిపోతున్నాను. హిప్నటిజానికి గురయినట్టు కళ్ళప్పగించి చూస్తున్నాను.

"థాంక్స్ వెరీమచ్! మిస్టర్ ఈశ్వర్, మీతో మాట్లాడాలి."

"తప్పకుండా! కమాన్, రండి..."

"మీరేమీ భయపడకండి! నేను దెయ్యాన్ని కాను. మీరు నాకు సహాయం చేసిపెట్టాలి!"

అప్పుడు తేరుకుని చూశాను. నా స్వహస్తాలతో రెండు తూటాల్ని వీపులోకి పంపించిన శివరాం ఇప్పుడు నా ఎదురుగా నిలబడి వున్నాడు! ఇది కలా? నిజమా?

అసలు నేను శివరాంని చంపానా? చంపినట్టు భ్రమించానా? అయితే చిత్ర ఎలా వచ్చింది? ఇది కలకాదు,

భ్రమకాదు. నేను శివరాంని చంపాను. కళ్ళారా అతని చావు చూశాను మరి ఇదెలా సంభవం—ఇప్పుడతను నా ఎదురుగా ప్రత్యక్షమయ్యాడు?!

"మిస్టర్ ఈశ్వర్! నేను బ్రతికే వున్నాను—తాకి చూడండి."

భయపడుతూ చెయ్యి జాపాను. అతను షేక్‌హాండ్ ఇచ్చాడు. వెచ్చని స్పర్శ!

ఈ మొత్తం వ్యవహారంలో ఏదో మర్మం వుంది. నళిని ఏదో రహస్యం నా దగ్గర దాచింది. శివరాం చావలేదంటే మరెవరో చచ్చారన్నమాట. ఎవరు? నేను చంపిందెవర్ని?

"మిస్టర్ ఈశ్వర్, వివరాలు తర్వాత చెప్తాను: మీరూ, నేనూ క్షేమంగా వుండాలంటే మీరు తక్షణం వెళ్ళి నళినిని చంపండి."

నా తల తిరిగింది శివరాం మాటలకి. "ఎందుకు?"

"మన క్షేమంకోసం. లేదా మీరూ నేనూ నాశన మవుతాం! ఆమె జిత్తులమారి! నమ్మకండి, ప్రమాదకర మైన ఆడది!"

"శివరాం, నాకిదంతా ఏమిటో అర్థంగావడంలేదు! పిచ్చెక్కుతోంది! ఏం జరిగిందో మీరు చెప్తేగానీ నేను ఏ నిర్ణయమూ తీసుకోలేను!"

అతను కూచుని చెవులప్పగించి బాత్‌రూంలో నీళ్ళ శబ్దం విన్నాడు.

"ఎవరది?"

"నా అసిస్టెంట్."

అతని ముఖంలో రంగులు మారాయి. "ఆమె నెక్కడ బంధించారో నాకు తెలిస్తే ఇన్ని దారుణాలు జరిగేవి కావు!"

"దయచేసి వివరంగా చెప్పండి!" అసహనంగా అన్నాను.

"ఓ.కే. చెప్తాను. ఇప్పుడు ఎక్కువ సమయం లేదు కాబట్టి క్లుప్తంగా చెప్తాను." అన్నాడతను. ఆ తర్వాత సిగరెట్ ముట్టించి చెప్పడం ప్రారంభించాడు:

"ఈశ్వర్, సుమిత్రని నేను పెళ్ళాడేందుకు నళిని ఎప్పుడైతే అయిష్టం తెల్పిందో అప్పుడే నేనామె శత్రువయ్యాను. ఆమెమీద కన్నువేసి వుంచాను. ఆమె చర్యలు నాకు వింతగా తోచాయి. మొన్న ఆమె హైద్రాబాదు వెళ్ళిన సంగతి తెలుసుకుని నే నామెని వెంబడించాను. ఆమె బసచేసిన హోటల్ మీద కన్నేసి వుంచడమేగాక, ఆమె గదిలో జరిగిన సంభాషణలు కూడ విన్నాను.

"ఆ గదిలో ఆమె మిమ్మల్ని నన్ను చంపేందుకు బలవంతం చేసింది. ఆ వస్తాదు మీపైన దౌర్జన్యం చేశాడు. విధిలేక మీరు ఒప్పుకున్నారు. అయితేనన్ను ఏవిధంగా చంపుతారో మీ రా గదిలో మాట్లాడుకో లేదు. సాయంత్రం అయిదు గంటలకి ఆమె మీ ఇంటికి వెళ్ళి మిమ్మల్ని కార్లో తీసుకెళ్ళింది—అప్పుడు నన్నెలా చంపాలో ప్లాను వేశారనుకుంటాను.

"నిన్న మీ రిక్కడికి బయలుదేరి వచ్చారు. నళిని నిన్న ఉదయం ఇక్కడికి వచ్చింది. ఆమెతోబాటు మీఅసిస్టెంట్ కూడ వుంది. ముందు మీ అసిస్టెంట్ని నళిని ఇంటికి తీసుకెళ్ళి ఆ తర్వాత ఎక్కడికో మాయం చేసింది. మీరు నన్ను చంపేందుకే మీ అసిస్టెంట్ని బంధించిందని వూహించాను.

"మీ రిక్షాడికి వచ్చాక ఆమని కలుసుకుంటారని ఎదురుచూశాను. కానీ కలుసుకోలేదు. ఫోన్ చేశారు.

"మీ సంభాషణ వినలేకపోయాను. అయితే ఉదయంనుంచీ నేను నళినిమీదా, శంభూమీదా కన్నేసి వుంచడంవలన— ఒక సంగతి తెలుసుకున్నాను. నిన్న వుదయం శంభూ ఒక లాంచీ అద్దెకి తీసుకున్నాడు. దేనికో అప్పుడు నాకు బోధపడలేదు.

"నన్ను చంపేందుకు మీరు ఆయుధం ఉపయోగిస్తారు కాబట్టి నిన్న రహస్యంగా మీ గది గాలించాను. ఏమీ దొరకలేదు. ఒక అనుమానం వచ్చి నిన్న రాత్రి మారు తాళాలతో మీ డిక్కీ తెరిచి చూశాను. అందులో రైఫిల్ వుంది. దానికి సైలెన్సర్, టెలిస్కోప్ అమర్చివున్నాయి ... అప్పుడర్థమైంది, లాంచి దేనికోసమో. ఈ రైఫిల్‌తో మీరు లాంచిమీద కూచోని బ్రిడ్జిమీద నన్ను షూట్ చేస్తారని ఊహించాను.

"నిన్న రాత్రి మమ్మల్ని మీరు బ్రిడ్జిమీద కలుసుకుని మారుపేరు చెప్పి టైరు మార్చి వెళ్ళారు—సరే, ఆ విషయం వదిలేయండి. నన్ను మీరేవిధంగా చంపుతారో తెలిసిపోయింది కాబట్టి ఈరోజు సుమిత్రతో బ్రిడ్జిమీదకి వెళ్ళకూడదని నిశ్చయించుకున్నాను.

"సాయంత్రం సుమిత్ర ఎప్పటిలా కారులో నావద్దకి వచ్చింది. నేను రానని చెప్పాను. ఆమె వెళ్ళిపోయింది. నామీద హత్యా ప్రయత్నం జరుగుతున్నట్టు ఆమెకి చెప్పలేను. పోలీసులకీ రిపోర్టు ఇవ్వలేదు. ఈ వ్యవహారం అంతా రచ్చకెక్కడంవలన నాకే మీ లాభం వుండదు. నాకు న్యాయం జరగదు. నళినికి పలుకుబడి వుంది, డబ్బు వుంది.

"ఈరోజు బ్రిడ్జిమీదకి వెళ్ళకపోతే నాకు చావు తప్పేతుంది. మీ ప్లాను తల్లకిందులవుతుంది. రేపుదయం గట్టు చప్పుడు కాకుండా సుమిత్రతో కలకత్తా వెళ్లి పోతే నన్ను ఎవరూ ఏమీ చేయలేరు!

"నా ఆలోచన బాగానే వుంది. మీప్లాను తల్ల కిందులై నన్నుగాక మరొకర్ని చంపారు. నేను రాక పోతే సుమిత్ర తిరిగి ఇంటికి వెళ్ళిపోతుందనుకున్నాను - కానీ అలా జరగలేదు_దురదృష్టం మిస్టర్ ఈశ్వర్, బాడ్ లక్! ఆమె జయదేవ్‌తో బ్రిడ్జిమీదకి వెళ్లింది."

"జయదేవ్‌తో!"

"అవును. జయదేవ్‌తో. అయితే నాకు ముందు తెలియలేదు. షూట్ చేయబడ్డాక తెలిసింది. దిసీజ్ టూ బాడ్. ఐ పిటీ హిమ్!"

రాయిలా కూచుండిపోయాను. ఊపిరి అందడంలేదు. బట్టలన్నీ చెమటలతో తడిసిపోయాయ్...

జయదేవ్! దురదృష్టవంతుడు. నేను షూట్ చేసే సమయంలో కనీసం — ఒక్కసారి — నావేపు తిరిగి చూసివుంటే ప్రాణాలు దక్కివుండేవి! అసలతను సుమిత్రతో బ్రిడ్జిమీదకి ఎందుకొచ్చాడు? ఎందుకొచ్చినా ఇప్పుడు చేయగల్గిందేమీ లేదు!

జయదేవ్ మరణించాడు! నళిని అనుకున్నదంతా తల్ల కిందులైంది! జరిగింది తెలిసి ఆమె ఏం చేస్తుంది?

వెంటనే ఒక అనుమానం వచ్చింది.

శివరాంని అడిగాను. "ఆల్ రైట్, మిస్టర్. నేను పొరపాటు చేశాను. అయితే నాకొక అనుమానం. నాచేత ఈ పొరపాటు మీరు చేయించారా ఉద్దేశ్య పూర్వకంగా?"

"అంటే?"

"నేను మిమ్మల్ని చంపుతానని తెలిసి మీరు ఒక పథకం వేశారా? అంటే సుమిత్రతో జయదేవ్‌ని మీరు కావాలని పంపి నాచేత చంపించారా?"

"వాట్ నాన్సెన్స్ యూ ఆర్ స్పీకింగ్!"

"చెప్తాను. సుమిత్ర వెంట జయదేవ్‌ని పంపితే అతను మరణిస్తాడన్నది ఖాయం! అప్పుడు మీ మార్గంలో అడ్డంకులుండవు. ఇక నళిని వుంది. ఆమెవల్ల మీ కెప్పుడైనా ప్రమాదమే. కాబట్టి ఆమెనికూడా చంపాలి. అందుకే మీరు నన్నిప్పుడు బ్లాక్ మెయిల్ చేస్తున్నారు."

"బ్లాక్ మెయిల్!"

"అవును. నేను నళినిని చంపకపోతే పోలీసులకి అప్ప గిస్తానంటారు. అంతేనా?"

శివరాం గాభరాగా లేచి నిలుచున్నాడు.

"ఈశ్వర్! నళినివల్ల ప్రమాదం మనిద్దరికీ వుంది!" అరిచాడతను.

చిత్ర బాత్‌రూంలోనుంచి వచ్చింది.

"ఈశ్వర్! జయదేవ్ మరణించినట్టు నళినికి తెలస్తే ఆమె మీగురించి చెప్పేస్తుంది పోలీసులకి! మీరు నాతో చేతులు కలిపి జయదేవ్‌ని అంతం చేసినట్టు ఆమెకి అను మానం వస్తుంది! అంతే! ఇక మీరూ నేనూ జైల్లో కెళ్లాలి! ఆమెని చంపండి ప్లీజ్!"

అతని మాటలు నాకు సబబుగా తోచాయి. అలా జరిగేందుకు అవకాశం వుంది. నళినికి తప్పకుండా నా మీదా, శివరాంమీదా అనుమానం వస్తుంది. ఆమె జిత్తులమారి! దేనికైనా తెగిస్తుంది. ఆమె వేలుపెట్టి

నన్నూ శివరాంనీ చూపించిందంటే చాలు—మేం జైలు పాలవుతాం! మాదగ్గర డబ్బులేదు, పలుకుబడిలేదు. నళిని తెలివైన కథ అల్లి కోర్టుని నమ్మిస్తుంది. ఆమె ఆ పని చేయకుండా వుండాలంటే ఆమెని చంపాలి. అవును ఆమెని చంపాలి!

ఛటుక్కున లేచి నిలబడ్డాను. "శివరాం, జయదేవ్ చావుకి మీ బాధ్యతలేదు కదా?"

"లేదు. నిరూపిస్తాను."

"ఆల్ రైట్, ఇక పదండి. మన పని పూర్తి చేద్దాం!"

"ఈశ్వర్!" చిత్ర అరిచింది. "నళినిని చంపేస్తారా?"

"ఇట్ వుడ్ బి ఎ ప్లెజర్!" అన్నాను. "పదండి శివరాం!"

మేం బయటికి నడిచాం. శివరాం అన్నాడు, "ఈశ్వర్, ఎందుకైనా మంచిది, గది ఖాళీ చేసెయ్యండి."

"ప్రమాదంలేదు, నళిని చచ్చాక నేనెవరో ఎవరూ తెలుసుకోలేరు. థాంక్ గాడ్, రాం! ఆ పహిల్వాన్ గాణ్ని కూడా చంపాలి!"

"అవును, అవును" గొణిగాడు శివరాం. చకచక నడిచి కిందికివచ్చి కారెక్కాం. కారు స్టార్ట్ చేసి వేగంగా డ్రైవ్ చేస్తూ అడిగాను.

"ఇప్పుడు తొమ్మిది గంటలైంది. ఈపాటికి పోలీసులు నళినిని కలుసుకుని వుంటారు. ఆమె మన గురించి చెప్పేసి వుంటుంది—ఏమంటారు?"

ఉలిక్కిపడ్డాడతను. "అయితే ఎలా?"

నేనతనికి సమాధానమివ్వలేదు. ఒకవేళ అలా జరిగితే ఏం చేయాలో ఆలోచించలేదు—నళినినీ, ఆమె అను

చరుడ్ని చంపడం ఒక్కటే నా కర్తవ్యం.

కారు నళిని బంగళా ప్రాంతాల చేరుకునేవరకు మేం నిశ్శబ్దంగా వున్నాం. బంగళా యొక్క దీపకాంతి దూరాన వుండగా కారు ఒక ఇరుకు వీధిలో ఆపి కాలినడకన బయలుదేరాం.

నా చేతిలో రైఫిల్ వుంది.

బంగళా వెనక భాగంగుండా ప్రహరీగోడ దూకి లోని కెళ్ళాం.

చడీచప్పుడు లేదు. అయితే ఇంకా పోలీసులు రాలేదన్నమాట. అదృష్టం మా వేపువుంది. నళిని చావు నా చేతిలో వ్రాసివుంది. ఒక్క తూటా చాలు, ఆమె తలలో రంధ్రం చేయడానికి. ఇక ఆ పహిల్వాన్ గాడ్ని దవడలో షూట్ చేస్తాను–వాడొకవేళ బ్రతికినా వక్కలు నమలడానికి పనికిరాడు!

"ఈశ్వర్, మనం బంగాళాలో ప్రవేశించాలా?" శివరాం గుసగుసలాడాడు.

"అవసరం లేదు" అన్నాను.

"మరెలా చంపుతారు?" మళ్ళీ అడిగాడు.

"షూట్ ఎట్ సైట్. కనిపిస్తే కాల్చేస్తాను. ఆ కిటికీదగ్గర నిలబడదాం రండి!"

నావెంట శివరాం వచ్చాడు. వరసగా కిటికీలన్నీ మూసి వున్నాయి. చివరి కిటికీ తెరిచివుంది. లైటు వెలుగు బయటికి పడుతోంది. గబగబ వెళ్ళి అక్కడ ఆగాం. జాగ్రత్తగా తలఎత్తి లోనికి తొంగిచూశాను.

అంతే!

ఎత్తిన తల దించకుండా, పీల్చినగాలి వదలకుండా, నోరు తెరిచిపెట్టేసి, కళ్ళప్పగించి చూస్తున్నాను.

గదిలో యిద్దరు ఇన్‌స్పెక్టర్లు కూర్చుని వున్నారు కుర్చీల్లో. వాళ్ళేదో సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు. గది మధ్యవున్న బెడ్ పక్కన విచారవదనంతో నిలబడి వున్నాడు శంభూ.

బెడ్‌మీద నళిని వెల్లకిలా పడుకుని వుంది. ఆమెలో ఉచ్ఛ్వాస నిశ్వాసలు లేవు. ఆమె గుండెలమీద ముఖం దాచుకుని నిశ్శబ్దంగా విలపిస్తోంది సుమిత్ర.

## 11

తడబడుతున్న అడుగులలో, భుజానికి వేలాడుతోన్న రైఫిల్‌తో ఆ గదిలోకి ప్రవేశించాను.

నా వెనక శివరాం వున్నాడు. శివరాం ముందుగా ఆ దృశ్యం చూడలేదు కాబట్టి ఒక్క క్షణం గాభరాపడి, ఆ తర్వాత పరిగెత్తి సుమిత్ర పక్కన చేరాడు. సుమిత్ర ఇంకా ఏడుస్తోంది.

ఇప్పుడామె పక్కన శివరాంని చూసి ఆ అధికారులు తటాలున వెనక్కి తిరిగారు. నేను కన్పించాను. నా భుజానికి వున్న రైఫిల్ వాళ్ళని అదరగొట్టింది. తటాలున లేచి నిలబడ్డారు.

“హలో అయ్యా?” ఒక అధికారి అర్చాడు.

నేను బలహీనంగా నవ్వి కార్డు అందించాను. అతను చదివి నన్ను అదోలా చూశాడు. “ఇక్కడి కెందు కొచ్చారు?”

“మిసెస్ నళినీదేవి నాకు తెలుసు.”

“ఐసీ!” అతనీసారి అనుమానంగా చూశాడు, “ఆ రైఫిల్ ఏమిటి?”

నేను మరోసారి నవ్వి రైఫిల్ తీసి అతనికి అందించాను.

"తీసుకోండి. నేను మీకు లొంగిపోతున్నాను."

"అంటే?"

"జయదేవ్‌ని చంపింది నేనే."

ఇన్‌స్పెక్టర్ ఉలిక్కిపడ్డాడు, "ఏమిటి మీర నేది, మిస్టర్?"

"జయదేవ్‌ని చంపింది నేనే. శంభూ నా సమక్షంలో వున్నాడు—అతన్ని అడగండి!"

నా మాటలు విని శంభూ బెదిరిపోయాడు. ఇన్‌స్పెక్టర్ అతన్ని సూటిగా చూశాడు, "ఏమిటి?"

ఇన్‌స్పెక్టర్ గర్జన విని శంభూ ఛటుక్కున తలూపాడు.

"ఓ.కే...ఓ.కే...మై డియర్ ఫ్రెండ్స్, లెటజ్ డిస్కస్ ది మాటర్ —"

ఇన్‌స్పెక్టర్ మాటలకి అడ్డు తగిలాను. "సర్ ఆమె ఎలా చనిపోయింది?"

కిటికీలోంచి ఆ దృశ్యం చూసినప్పటినుంచీ నన్ను వేధిస్తున్న ప్రశ్న ఇది.

"దటీజ్ బాడ్‌లక్ మిస్టర్" అన్నాడతను. "నిజంగా జయదేవ్‌ని మీరే షూట్ చేశారా? అయితే యిప్పుడు లొంగిపోవడానికి కారణం ఏమిటి?"

"న్యాయం జరుగుతుందన్న విశ్వాసం."

"ఐసీ! అదెలా జరుగుతుందో వివరించండి!"

"నా ప్రశ్నకి మీరు సమాధానం యివ్వలేదు, ఇన్‌స్పెక్టర్. నళిని ఎలా చనిపోయింది?"

అతను తడబడ్డాడు. "ఆమె...ఆమె..."

"చెప్పండి!"

"ఆమె...ఆమె...ఆమె చావుకి మేం చాలా విచారిస్తున్నాం." ఇన్స్పెక్టర్ గొంతు పూడుకపోయింది. నేను అసహనంగా కాచుకున్నాను అతని మాటలకోసం. "ఆమె హార్ట్ పేషంటని మాకు తెలీదు! మర్డర్ ప్లేస్ నుంచి సుమిత్రతో ఇక్కడికి వచ్చాం. సుమిత్ర ఏమీ చెప్పలేకపోతోంది. ఆమె తల్లిని ఇంటరాగేట్ చేయాలనుకున్నాం, కానీ...కానీ...జయదేవ్ హత్య గురించి ఆమెకి తెలిసి ఎటాక్ వచ్చింది. బాడ్ లక్! క్షణాల్లో చావు సంభవించింది!!

"జయదేవ్ హత్యగురించి మీరే చెప్పారా?"

"అవును" అన్నాడతను. "కానీ...ఇందాక ఫోన్ వచ్చింది. జయదేవ్ని ఆపరేషన్ చేసి బుల్లెట్స్ తీశారట. పరిస్థితి సీరియస్గా ఏమీ లేదట. అతను బ్రతికివున్నాడు."

"థాంక్ గాడ్! జయదేవ్ చనిపోలేదా!"

"లేదు. ఇప్పుడతను స్పృహాలో వున్నాడు."

జయదేవ్ బ్రతికేవున్నాడు! నళిని చనిపోయింది! ఆమె అనుకున్నట్టు శివరాం చావలేదు! నేను అనుకోని విధంగా జయదేవ్ని షూట్ చేశాను—అదే ఆమె ప్రాణాలు తీసింది! తన చావుని చేతులారా తెచ్చిపెట్టుకుంది! శివరాంని చంపించే ఆలోచన ఆమెకి రాకపోతే చావు సంభవించేది కాదు! ......ఇదంతా ఆలోచిస్తుంటే నవ్వాలో, ఏడ్వాలో నా కర్థంగావడం లేదు.

ఆమె చేసిన పథకం ఆమెకే దెబ్బతీసింది. వీలుచిక్కినప్పుడల్లా నేను వేసిన ఎత్తుల్ని తెలివిగా చిత్తుచేసింది. కానీ నేను చేసిన ఒకే ఒక్క పొరపాటువల్ల ఆమె ప్రాణాలు కోల్పోయింది. అది నా తప్పుకాదు. ఆమె హార్ట్ పేషంట్ అని నాకు తెలీదు.

"ఇన్స్పెక్టర్! ఆమె చనిపోయే ముందు ఏదైనా మాట్లాడిందా?"

"అవును. శంభూతో చెప్పింది. పోలీసులకి లొంగి పోయి జరిగిందంతా చెప్పమంది. ఇందులో తానొక్కతే దోషిననీ, మరెవరూ కాదనీ, శిక్షించవద్దని కూడ చెప్పింది."

పాపం, నళిని! కూతురి క్షేమంకోసం కాయశక్తులా పోరాడి శాశ్వతంగా కళ్ళు మూసింది. పోతూ పోతూ సుమిత్ర—శివరాంలని ఏకంచేసి, జయదేవ్‌ని బ్రతికించి (!), నన్ను హంతకుడిగా చేసి, నన్ను దక్కించేందుకు శంభూని వదిలిపోయింది.

ఆమె చావుకి కారకులెవరు? నేనా? స్వయంగా ఆమేనా? లేక సుమిత్రనా?

కానీ, ఆమెచేసుకున్న పథకమే ఆమె చావుకి కారణ మన్పిస్తోంది. అయితే శివరాంమీద నాకు అనుమానంగా వుంది—జయదేవ్ బ్రిడ్జిమీదికి రావడం కాకతాళీయంగా జరిగిందా లేక, ఇందులో శివరాం హస్తముందా? ఈ అను మానం తీర్చుకోవలసి వుంది.

బెడ్ దగ్గరికి నడిచి నళిని ముఖంలోకి చూశాను. ప్రశాంతంగా వుంది. ఆమె చూపుల్నీ, కంఠాన్నీ నేను అసహ్యించుకున్నందుకు ఇప్పుడు నా మీద నాకే అస హ్యంగా వుంది. నెమ్మదిగా ఆమె చెయ్యి అందుకుని మృదువుగా చుంబించాను.

ఆ తర్వాత వెనక్కి తిరిగి చూశాను.

"ఇన్స్పెక్టర్, ఇక మీ పని కానివ్వండి. నన్ను అరెస్ట్ చేయండి."

శివరాం ఛటుక్కున నా దగ్గరికి వచ్చాడు.

"దాని కంతటికీ కొంతవరకు నేను కూడా కారకుడ్ని. నన్ను క్షమించండి" అన్నాడతను.

"బాధ పడకండి. సుమిత్రని ఓదార్చండి" అన్నాను.

శంభూ మౌనంగా తలవంచుకుని ముందుకి నడిచాడు. అతని వెనక నేను నడిచాను. నా వెనక అధికారులు వచ్చారు. అందరం బయట జీపెక్కాం.

జీపు బయలుదేరాక నన్ను జయదేవ్ దగ్గరికి తీసుకెళ్ళమని చెప్పాను.

హాస్పిటల్లో అతన్ని చూసేందుకు డాక్టర్ సులువుగానే అనుమతించాడు.

# 12

జయదేవ్ నెమ్మదిగా కళ్ళు తెరిచి, బలహీనంగానవ్వి, వూరుకున్నాడు. నేనెవరినో చెప్పలేదు. సూటిగా అడిగాను. "మీరు బ్రిడ్జిమీదికి ఎందుకెళ్ళారు?"

"సుమిత్రతో ఒక ముఖ్య విషయం మాట్లాడేందుకు?"

"ఆమె రమ్మందా?"

"లేదు, నేనే తీసికెళ్ళాను."

"ఆమె మిమ్మల్ని ఎక్కడ కలిసింది?"

"సాయంత్రం ఆమె ఇంటికెళ్ళాను. ఆమెతో ఒక విషయం మాట్లాడాలని చెప్పి, ఆమె కార్లో బ్రిడ్జిమీదికి తీసుకొచ్చాను."

"బ్రిడ్జిమీదకి వెళ్ళమని మీ కెవరు చెప్పారు?"

అతను సూటిగా చూశాడు. "ఎందుకు? ఎవరూ చెప్పలేదు!"

"సుమిత్రతో ఏం మాట్లాడారు?"

"అది పర్సనల్ విషయం. ఇంతకీ మీ రెవరు?"

ఈసారి నేను సూటిగా చూశాను. "మిమ్మల్ని షూట్ చేసిన మనిషిని."

అతను కొయ్యబారి పోయాడు. "మీరు...నన్ను... షూట్..."

"యస్. యస్, మిస్టర్ దేవ్. మీ అదృష్టం బావుండక బ్రిడ్జిమీదకి వచ్చారు. అయినా దేవుడి దయవలన బ్రతికి బయటపడ్డారు. నా ప్లానంతా చెడగొట్టారు! నేను షూట్ చేయవల్సింది శివరాంని. కానీ, మిమ్మల్ని షూట్ చేసినట్టు తెలుసుకుని నళిని ప్రాణాలు విడిచింది!"

"ఓ్ హ్ గాడ్! అదెలా జరిగింది...ఆమె—ఆమె చనిపోయిందా! ఎలా?"

"ఆమె చావుకి మీరూ, నేనూ, సుమిత్రా, శివరాం, చివరకు నళిని—ఏదో ఒక రకంగా కారకులం!"

"ఓ్ హ్ గాడ్! ఆమె ఎలా చనిపోయింది?"

"గుండెపోటు వచ్చింది."

అతను గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. ఆ తర్వాత నెమ్మదిగా తెరుస్తూ అస్పష్టంగా గొణిగాడు. "శివరాంని మీ రెందుకు చంపాలనుకున్నారు?"

"సుమిత్ర అతన్ని ప్రేమించడం నళినికి యిష్టం లేదు."

"కానీ నాకు ఇష్టమే" అన్నాడతను. "ఆమె అతన్ని ప్రేమిస్తున్నట్టు నాకు తెలుసుగానీ నళినికి చెప్పలేదు. ఈ రోజు సుమిత్రతో చర్చించి చెప్పాలనుకున్నాను.

"సుమిత్రని చేసుకోడం నా కిష్టంలేదు. నాకావలసింది ఆమె ఆస్తికాదు, ప్రేమ. దాన్ని బలవంతంగా పొందలేను. నేనేదీ బలవంతంగా పొందను. సరే, మీరిక

వెళ్ళండి. నేనేదీ వివరించే స్థితిలో లేను. విశ్రాంతి కావాలి, విశ్రాంతి!''

నేను మాట్లాడకుండా వెనక్కి తిరిగివచ్చి జీపెక్కాను.

వూహాకీ వాస్తవానికీ చాలా దూరం వుంటుంది. మనం వూహించిందంతా వాస్తవంలో ఆచరణలో పెట్టడం కష్టం. నళిని వూహలూ, ఆశయాలూ ఆచరణలో పెట్టేందుకు పనికిరావని తెలిసినా, నేనేమీ చేయలేని పరిస్థితిలో చిక్కుకోవడం వలన అంతా తారుమారైంది.

నళిని మరణించింది. ఆమె ఆశయం నెరవేరలేదు' సుమిత్ర శివరాంలని యిష్టపూర్వకంగా ఏకం చేసింది' జయదేవ్ బ్రతికాడు.

అయినా, నేను జైలుకెళ్ళాలి. శిక్ష అంత తీవ్రమయినది కాకపోయినా స్వల్పంగానైనా అనుభవించాలి. అది నేను బుద్ధిపూర్వకంగా చేసిన హత్యాప్రయత్నం కాదు. తప్పనిసరి పరిస్థితిలో ఒకరి బలవంతం వల్ల చేశాను, అందుకు నాకు సాక్షిగా శంభూ వున్నాడు.

ఏదేమైనా నేను కొంతకాలం ఏ సమస్యలు లేకుండా విశ్రాంతిగా గడపాలి. అందుకు జైలు సరైన స్థానం.

అయితే నేను బయటికి వచ్చేవరకు చిత్రకి బ్రతుకు తెరువు ఏమిటన్నది జవాబు దొరకని ప్రశ్న.

—: ఐపోయింది :—

# నిజం తెలుసుకోకు!

వసుంధర

సుధాకర్ జైల్లో ఉన్నాడన్న మాటే కానీ అతని మనసు ఎప్పుడో చేరవలసిన చోటు చేరుకుంది. చేరుకుని కళ్యాణిని పలకరిస్తోంది. యోగక్షేమాలడుగుతోంది. ఆప్యాయతను ధారగా కురిపిస్తోంది.

కళ్యాణి సుధాకర్‌కు ఒక్కగానొక్క చెల్లెలు. ఆ అన్నాచెల్లెళ్ళకు యింకెవ్వరూ లేరు. ఇద్దరూ ఒకరినొకరు గాఢంగా అభిమానించుకుంటున్నారు.

సుధాకర్ దూరప్రాంతాలలో ఉద్యోగం చేస్తున్నాడు. అతడు ప్రతినెలా కళ్యాణి అవసరాలకు డబ్బు పంపిస్తూంటాడు. ఏడాదికొకసారి వెళ్ళి ఆమెను చూస్తూంటాడు.

ఇప్పుడు సుధాకర్ వయస్సు ఇరవైఏడు సంవత్సరాలు. కళ్యాణి అతనికంటే ఎనిమిదేళ్ళు చిన్న.

ఏడు సంవత్సరాల క్రితం సుధాకర్ తండ్రి చనిపోయాడు. తల్లి కళ్యాణిని కన్న సంవత్సరానికే కన్ను

మూసింది. అందువల్ల చిన్నప్పట్నుంచీ సుధాకర్ కళ్యాణిని కంటికిరెప్పలా సాకాడు. ఆమె ఏడిస్తే అతని ప్రాణం విలవిల్లాడిపోతుంది. ఆమె నవ్వితే అతని మానస వనంలో పూలు వికసిస్తాయి. కళ్యాణికి చిన్న దెబ్బ తగిలినా, రవంత కష్టం కలిగినా అతడు సహించలేడు. అదో విచిత్రమైన అనుబంధం.

సుధాకర్ బియ్యే ప్యాసుకాగానే నాగ్పూర్ రెండియాలో ఉద్యోగం రావడమూ, తండ్రి పోవడమూ ఒక్కసారే జరిగాయి. అప్పటికి కళ్యాణి వయసు పన్నెండేళ్ళు.

సుధాకర్ పెళ్ళి చేసేసుకుని కళ్యాణిని కూడా తీసుకుపోతే బాగుంటుందని కొందరు బంధువులు సూచించారు. కళ్యాణి ఓ యింటి దయ్యేవరకూ పెళ్ళి చేసుకోవడం సుధాకర్కు యిష్టంలేదు. దూరప్రాంతంలో తన ఒక్కడితో ఉండడంవల్ల కళ్యాణి కిబ్బంది అని అతను భావించాడు. అందుకే ఆ ఊళ్ళోని బంధువుల యింట ఆమెను వదిలిపెట్టాడు.

సుబ్బరామయ్యగారు దూరపు వరుసలో కళ్యాణికి పెదనాన్న అవుతాడు. ఆయనకు డబ్బయితే లేదుకానీ హృదయంనిండా మంచితనమే ఉంది. మంచితనం ఆయన్ని మరింత పేదవాణ్ణి చేస్తోంది కూడా.

సుబ్బరామయ్యగారేదో ఆఫీసులో చిన్న గుమాస్తాగా ఉంటున్నాడు. ఆయనకు ముగ్గురాడ పిల్లలు. మగపిల్లలు లేరు. ఆడపిల్లల పెళ్ళి గురించి ఆయనకు బెంగగా ఉంటుంది.

కానీ ఇటీవలే ఆయన ఆలోచనల్లోనూ, ఆర్థిక పరిస్థితిలోనూ కూడా మార్పువచ్చినట్లుంది. ఆఫీసులో లంచాలు పట్టడం మొదలుపెట్టాడో ఏమో, ప్రస్తుతం ఆయనకు

రోజులు బాగానే వెళ్ళిపోతున్నాయి. ఇటీవలే ఆయన మొదటికూతురు పెళ్ళి కూడా చేశాడు.

కళ్యాణి నిమిత్తం సుబ్బరామయ్యగారికి కొంత డబ్బు పంపిస్తూండేవాడు సుధాకర్. అదికాక వేరే కొంత కళ్యాణికి కూడా పంపిస్తూండేవాడు.

పదిహేనో యేట మెట్రిక్ ప్యాసయింది కళ్యాణి. ఆ తర్వాత ఒక సంవత్సరంపాటు టైపూ, షార్టుహేండూ నేర్చుకుని ఓ కంపెనీలో స్టెనోగ్రాఫర్ గా చేరింది.

పదిహేనేళ్ళకే పద్ధెనిమిదేళ్ళ పిల్లలా ఉండేది కళ్యాణి. ఆమెను పొడుగు, పొడుగును తగ్గ అవయవపుష్టి, అన్నిటినీ మించిన కనుముక్కు తీరు, ఆ తీరును సరిపడ శరీర ఛాయ—ఇవన్నీ కలిసి ఆమెను అందగత్తెల లిస్టులో చేర్చాయి. ఆ అందానికి కావలసిన ఇతర హంగులన్నీ కళ్యాణి సమకూర్చుకునేది. ఆమెను చూడగానే దివి నుంచి భువికి దిగివచ్చిన అప్సరస అని చాలామంది అనుకునేవారు.

తలచుకుంటే కళ్యాణి పెళ్ళి పెద్ద కష్టంకాదని సుబ్బరామయ్య, సుధాకర్ కు రాస్తూండేవాడు. అయితే చాలా పెద్ద సంబంధం చేయాలని సుధాకర్ ఆశయం. అందుకవసరమైన డబ్బు పోగు చేయడానికి అతను దూరప్రాంతంలో రాత్రింబవళ్ళు కష్టపడుతున్నాడు. అతనివద్ద యిప్పుడు సుమారు పన్నెండు వేల రొక్కం ఉంది. అవసరమైతే అప్పుచేసి కొద్ది సంవత్సరాలలో తీర్చగల ఆదాయం ఉంది.

ఈ పర్యాయం కళ్యాణి పెళ్ళి కుదిర్చేయాలని సుధాకర్ అనుకుంటున్నాడు. చెల్లెల్ని పెళ్ళికూతురు ముస్తాబులో ఊహిస్తూంటే అతని మనసు చలించిపోతోంది.

మనసుకంటే ఆలస్యంగానే అయినప్పటికీ సుధాకర్ మనిషి కూడా మొత్తంమీద చేరవలసిన ఊరు చేరుకున్నాడు. స్టేషన్లోంచి బయట అడుగుపెట్టి ఓ రిక్షాలో కూర్చుని వెళ్ళవలసిన చోటు చెప్పాడు.

రిక్షా శరవేగంతో దూసుకుపోయి ఓ యింటిముందు ఆగింది. సుధాకర్ రిక్షాదిగి డబ్బులిచ్చి యింటివైపు తిరిగి నిరుత్సాహం పడిపోయాడు. ఇంటికి తాళంపెట్టి ఉంది.

సూట్ కేసు అరుగుమీద పెట్టి దిగాలుగా కూర్చున్నాడు సుధాకర్. తను వస్తున్నట్లు ముందుగానే ఇంటికి ఉత్తరం రాశాడు. అందరికీ తన రాకగురించి తెలిసే ఉండాలి.

అతనింకా ఏదో ఆలోచనల్లో ఉండగానే ఎదురింటి వాళ్ళబ్బాయి పరుగున వచ్చి — "నమస్కారమండీ! ఇదేనా రావడం—" అన్నాడు.

"అవునోయ్-యింటికి తాళంపెట్టి ఉంది..."

"తాళంచెవి నా దగ్గరుందండి. సుబ్బరామయ్యగారూళ్ళో లేరు. కళ్యాణి ఊళ్ళోనే ఉంది. నిన్న సాయంత్రం మా యింట్లో ఈ తాళంచెవి ఇచ్చి వెళ్ళింది. సినిమాకు వెళుతున్నానని చెప్పింది. మళ్ళీ యింతవరకూ రాలేదు..." అన్నాడా అబ్బాయి.

సుధాకర్ తాళంచెవి అందుకుని—"ఎప్పుడూ యిలా జరుగుతూంటుందా?" అన్నాడు.

"లేదండి. కానీ యిలా తాళంచెవి యిచ్చి వెళుతూండడం యింట్లో అందరికీ మామూలే! పదిగంటలయ్యేసరికి ఉదయంపూట ఇంట్లో ఆడా, మగా ఎవ్వరూ ఉండరుకదండీ-అందుకని తాళంచెవి మా ఇంట్లో ఇచ్చి వెడుతూంటారు..." అన్నాడా అబ్బాయి.

ఆ విషయం సుధాకర్‌కూ తెలుసును. దొడ్డమ్మగారేమో కుట్టుపనులు నేర్చుకుంటోంది. కళ్యాణి స్టెనోగ్రాఫర్. ఆడపిల్లలిద్దరూ సేల్సుగరల్సుగా ఏదో షాపులో పని చేస్తున్నారు. సుబ్బరామయ్యకు ఉద్యోగం.

"పెదనాన్నగారెన్నాళ్ళనుంచి ఊళ్ళో లేరు?"

"ఓ వారం రోజులవుతుందండి..."

ఉత్తరం తను ఆఫీసు అడ్రసుకి రాశాడు. సుబ్బరామయ్యగారూళ్ళో లేరు కాబట్టి ఆయనకీ విషయం తెలియదు. ఉత్తరం ఆయన ఆఫీసుకు రాశాడు కాబట్టి కళ్యాణికీ విషయం తెలిసి ఉండదు.

"అయితే కళ్యాణికి నేను వస్తున్నానని తెలిసుండదు..." గొణుక్కుంటున్నట్లుగా అన్నాడతను.

"తెలుసునండి. మీరీవేళ ఈ సమయంలో వస్తారని కళ్యాణి చెప్పింది. నిన్న తాళంచెవి యిచ్చేటప్పుడు ఈ విషయం చెప్పి-ఒకవేళ తను అంతవరకూ ఇంటికి రాలేని పక్షంలో మీకీ తాళంచెవి యివ్వమని తనే చెప్పింది" అన్నాడా అబ్బాయి.

'అంటే కళ్యాణికి ముందుగానే తెలుసునన్నమాట-తను ఎక్కువసేపు బయట వుండబోతున్నానని. అన్నయ్యొస్తున్నాడని తెలిసీ ఆపుకోలేని ఆ రాచకార్యమేమిటో' అనుకున్నాడు సుధాకర్. ఏది ఏమైనప్పటికీ అతను అసంతృప్తిగానే అక్కణ్ణించి కదిలి యింటి తాళం తీశాడు. ఇంకా అక్కడే నుంచున్న ఆ అబ్బాయికి థాంక్స్ చెప్పి-సూట్‌కేసుతో సహా యింట్లో ప్రవేశించాడు.

కళ్యాణిని చూడాలని సుధాకర్ మనసు తహతహలాడిపోతోందని సుధాకర్‌కు తెలుసు. అందుకే కళ్యాణి

ఎక్కడికి వెళ్ళిందో, ఏమయిందోనని అతను ఆదుర్దాపడుతున్నాడు.

ఆ యింట్లో కళ్యాణికి ఓ గది ప్రత్యేకించారు. తనకు తోచిన విధంగా కళ్యాణి ఆ గదిని అలంకరించుకుంటుంది. ఇతరు లెవ్వరూ ఆమె అనుమతి లేనిదే ఆ గదిలో ప్రవేశించకూడదు.

సుధాకర్ మనసులో ఒక కొంటె ఆలోచన వచ్చింది. అతను చెల్లెలికోసం ఒక మంచి బహుమతి తెచ్చాడు. ఆ బహుమతి ఒక అట్టపెట్టెలో ఉంది. ఆ పెట్టెమీద "చెల్లెలికి ప్రేమతో - అన్నయ్య సుధాకర్!" అని రాశాడు. ఆ బహుమతిని చెల్లెలి గదిలోవుంచి తను యింట్లోంచి బయటకు వెళ్ళిపోయి సాయంత్రం వరకూ రాకూడదు. కళ్యాణివచ్చి చూసుకుని ఆశ్చర్యపోతుంది.
ఇలా చేయడానికి సుధాకర్‌కు మరీ ఎక్కువ ఇష్టం లేదు. ఎందుకంటే యింకో అరగంటలోనే చెల్లెలు వచ్చేస్తేనో.. అప్పుడు వెంటనే ఆమెను చూసే అవకాశం పోతుంది.

ఇలా అనుకుని చెల్లెల్ని వెంటనేచూసే ఆనందంనుంచి దూరంకాకుండా ఉండడానికి సుధాకర్ అక్కడే మరో అరగంట సేపు ఎదురుచూశాడు. కానీ ఎక్కడా కళ్యాణి వచ్చే జాడ కనిపించలేదు. నిరుత్సాహం అతనిలో కోపాన్నీ, విసుగునూ ప్రవేశపెట్టింది. తాననుకున్న పని చేయడం మినహా మరేమీ లేదని అతనికి తోచింది.

సుధాకర్ సూట్‌కేసు తెరిచి అందులోని అట్టపెట్టి బయటకు తీశాడు. అందులోని బహుమతి చూసి చెల్లెలిలో కలిగే భావసంచలనాన్ని తలుచుకుని క్షణకాలంపాటు అతను పరవశించాడు తర్వాత ఆ అట్టపెట్టితో నెమ్మదిగా

కళ్యాణి గదిలోకి ప్రవేశించాడు. గదిలో ప్రవేశిస్తూనే అతని కళ్ళబడ్డ దృశ్యం అతన్ని ఆనందపరవశుణ్ణి చేసింది. గదిలో మంచంమీద ఒక యువతి పడుకుని ఉంది. ఆమె కట్టుకున్న చీర సుధాకర్‌కి బాగా గుర్తే! అది అతను కళ్యాణికోసం కొన్నది. ఏ పరిస్థితుల్లోనూ కళ్యాణి గదిలోకి మరొకరు ప్రవేశించరు.

సుధాకర్‌కు కళ్యాణి కొంటెతనం అర్థమైపోయింది. ఈ విధంగా తన నామె ఆశ్చర్యపరచాలనుకుందన్న మాట! అయితే యింటిబయట తాళంపెట్టి యింట్లోకి ఎలా వచ్చింది?

సుధాకర్ ఎక్కువగా ఆలోచించలేదు. అందుకేదో పద్ధతి నవలంబించి ఉంటుంది. లేదా మారుతాళం చెవి ఆమెవద్ద ఉండి వుంటుంది. ముందు తను చెల్లెల్ని చూడాలి.

ఎడంచేత్తో అట్టపెట్టెని పట్టుకుని ఒక్క అంగలో మంచాన సమీపించి కుడిచేత్తో ఆమె నడుంమీద కిత కితలు పెడుతూ — "అమ్మ దొంగా - ఇక్కడ పడు కున్నావా?" అన్న సుధాకర్ ఉలిక్కిపడ్డాడు. అప్రయ త్నంగా అతని చేతిలోని అట్టపెట్టె జారిపడింది.

అతని ఉలికిపాటుకు కారణం ఆ యువతిలో చలనం లేకపోవడం కాదు. ఆమె శరీరం-మంచుకన్న చల్లగా ఉండడం. చటుక్కున అతి నామెను ఇటువైపు తిప్పాడు.

జీవకళలేని ఆ ముఖం నిస్సందేహంగా కళ్యాణిది! ఆమెను అట్నుంచి ఇటు తిప్పడంలో అక్కడే ఉన్న ఒక కాగితం బయల్పడింది.

"నా చావుకు యెవ్వరూ బాధ్యులు కారు. ఇది ఆత్మ హత్య!"

"కళ్యాణీ!" అంటూ సుధాకర్ పెట్టిన గావుకేక ఆ యింటిని దాటి వెళ్ళి వీధి వీధిలో సంచలనాన్ని కలిగించింది.

## 2

"సందేహంలేదు—ఇది ఆత్మహత్య!" అన్నాడు ఇనస్పెక్టర్ శేఖర్.

"నేనూ ఒప్పుకుంటాను. కానీ ఎందుకు? ఏ లోటూ లేని నా చిట్టిచెల్లెలికి ఆత్మహత్య చేసుకోవలసిన కర్మేం పట్టింది?"

"ఆ విషయం ఇంకా తేలలేదు. ఒక పర్యాయం ఆత్మహత్య అని ధృవపరిస్తే కారణాలు వెలికిపట్టుకోవడం ఎంతోసేపు కాదు..." అన్నాడు శేఖర్.

"ఆత్మహత్య అని ఎలా ధృవపరుస్తారు?"

"ఆ ఇంట్లోకి మరొకరు వచ్చే అవకాశం లేదు. అక్కడ మరొకరు మసలిన జాడలేదు. తను ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఆమె కాగితం పెట్టింది. హత్యకు అవకాశాలు లేనిచోట ఆత్మహత్యగా నిర్ణయించక తప్పదు..." అన్నాడు శేఖర్.

"ఆత్మహత్య చేసుకున్నానంటూ రాసివున్న కాగితం మీది దస్తూరీ నా చెల్లెలిది కాదు. అందుకు కారణం వివరించగలరా?"

"దస్తూరీ ఆమెది కాదని మీరంటున్నారు. మాకలా అనిపించడంలేదు..."

"దస్తూరీ నిపుణుల ద్వారా పరీక్షించి చూస్తే మీకే తెలుస్తుంది?"

"చూడండి మిస్టర్ సుధాకర్! మరణించినది మీ చెల్లెలు కాబట్టి మీరింతగా ఆలోచిస్తున్నారు. ఇలాంటి

కేసులు ఎన్నో చూశాన్నేను. ప్రతి చిన్నదానికీ అనుమానం పెట్టుకుంటే ప్రతి ఆత్మహత్యనూ హత్యగా అనుమానించవచ్చు. ఇది హత్య అని అనుమానించవలసిన పరిస్థితులేర్పడితే ఎలాగూ తప్పదు. కేసు సింపుల్‌గా వున్నప్పుడు దాన్ని కాంప్లికేటెడ్ చేయడం నాకిష్టంలేదు" అన్నాడు శేఖర్.

"అయితే కారణాలేం చూపిస్తారు?"

"ప్రత్యేకంగా ఇవి అని చెప్పలేముగానీ—సూచించగలము. ఆమె ఎవరినైనా ప్రేమించి మోసపోయివుండవచ్చు..."

"ఎందుకు మోసపోతుంది? ఆమె ఎవరిని ప్రేమించినా ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా నేను ఎన్నడూ ప్రవర్తించను..."

"అవుననుకోండి. కానీ వివాహితుడామెను మోసం చేస్తే..."

"వాడి రక్తం కళ్ళజూస్తాను..." అన్నాడు సుధాకర్.

"చూడండి మిస్టర్ సుధాకర్, ఇటువంటి ముక్కలు మీరు నాముందు అనకూడదు. నేను బాధ్యతగల పోలీస్ ఇన్‌స్పెక్టర్ని. మీ మాటలు నా రికార్డులోకి ఎక్కితే అవి మిమ్మల్ని నేరస్థుల్ని చేయగలవు..."

"చెయ్యనివ్వండి ఇనస్పెక్టర్! నా ప్రాణానికి ప్రాణమైన చెల్లెలు పోయాక నేను బ్రతికిమాత్రం ఏం ప్రయోజనం? దాన్ని చంపినదెవరో తెలిస్తే..."

"ఆవేశపడకండి మిస్టర్ సుధాకర్— ఇది హత్య కాదు. ఆత్మహత్య. పుట్టిన ప్రతిజీవికీ ఎప్పుడో అప్పుడు

మరణం తప్పదు. అందరూ ఏదోరోజున పోవలసిన వాళ్ళమే. కాస్త ముందూ, వెనకా-అంతే! నాలుగు రోజులుపోతే మీరుకూడా మీ చెల్లెలి మరణంగురించి మరిచిపోగలుగుతారు. మరుపు మనకు దేవుడిచ్చిన వరం. మీవంటి అన్నగారి అభిమానాన్ని కలకాలం అందుకునే భాగ్యం మీ చెల్లెలికి లేదు. మీ ముందింకా చాలా భవిష్యత్తుంది. లేనిపోని ఆలోచనలకు మీ మనస్సులో చోటిచ్చి బంగారులాంటి మీ భవిష్యత్తును పాడుచేసుకో వద్దు. ఒక పోలీసు ఇనస్పెక్టరుగాకాక శ్రేయోభిలాషిగా మీకీ సలహా ఇస్తున్నాను" అన్నాడు శేఖర్.

సుధాకర్ భారంగా నిట్టూర్చి అక్కణ్ణించి బయట పడ్డాడు.

# 3

"అయితే నేనేం చేయాలంటారు?" అన్నాడు డిటెక్టివ్ శాస్త్రి.

"నా చెల్లెలిది ఆత్మహత్య కాదని నా అంతరాత్మ ఘోషిస్తోంది. దాన్ని చంపిందెవరో, ఎందుకు చంపారో తెలుసుకోవాలి..." అన్నాడు సుధాకర్.

"పోలీసులు ఆత్మహత్య అంటున్నారు. ఇంట్లో బంధువులెవ్వరూ లేరు. హత్య చేయవలసిన అవసరమూ, అవకాశమూ ఎవరికీ కనుపించడంలేదు. ఈ పరిస్థితుల్లో మీ చెల్లెలిది ఆత్మహత్య కాదని ఎందుకు అనుకుంటు న్నారు?" అన్నాడు శాస్త్రి.

"దానికి జీవితంమీద అంతులేని మమకారం. ఎటువంటి విపత్కర పరిస్థితుల్లోనైనా జీవితాన్ని కొనసాగించడమే కానీ తుదముట్టించడం దాని ధ్యేయంకాదు. చిన్నప్ప

ట్నించీ దాని మన స్తత్వం నాకు తెలుసు. ఏ పరిస్థితు ల్లోనూ అది ఆత్మహత్యకు తలపెట్టదు. ఇది నా నమ్మకం.''

శాస్త్రి ఆలోచనలో పడ్డాడు. సుధాకర్ చెప్పిన దంతా విన్నాక కళ్యాణి ఆత్మహత్య విడ్డూరంగా అతనికి కూడా తోచింది. చనిపోవడానికి పదిరోజులముందు కళ్యాణి సుధాకర్‌కి రాసిన ఉత్తరం అతను చదివాడు. ఆ ఉత్తరంలో కళ్యాణికి జీవితంపట్ల వున్న మోజు స్పష్టంగా తెలుస్తోంది. ఆ మోజు ఒక్క పదిరోజుల్లో పోయిందంటే అందుకేదో బలవత్తరమైన కారణ ముండాలి!

''ఒకవేళ కళ్యాణి నిజంగానే ఆత్మహత్య చేసు కున్నప్పటికీ అందుకేదో బలవత్తరమైన కారణముండి వుండాలి. అదేమిటో తెలుసుకోవాలి. అన్నయ్యగా నేను అన్నివిధాలా తనకు రక్షణ ఇవ్వగలనన్న నమ్మకం దానికి వుంది. ఆ నమ్మకాన్ని కూడా వదిలిపెట్టి అది ఆత్మ హత్య చేసుకున్నదంటే అందుకు కారణమేమిటో నే నూహించలేకుండా వున్నాను!'' అన్నాడు సుధాకర్.

''ఓ.కే. ఈ కేసు నేను చేపడతాను. మీ మనసు బాధపడుతున్నదని నాకు తెలుసు. నావద్దకు వచ్చే వారంతా అటువంటి స్థితిలోనే వస్తారు. అయినా వ్యాపారమన్నాక వ్యాపారమే! మీరివ్వగల ఫీజు చెబు తారా?'' అన్నాడు శాస్త్రి.

''నా చెల్లెలి పెళ్ళికోసం ఇంతవరకూ పన్నెండువేలు పోగుచేశాను. ఇప్పుడది దాన్ని చంపిన హంతకుణ్ణి

కనుక్కోవడానికి వినియోగిస్తాను'' అన్నాడు సుధాకర్.

''ఓ.కే... నాకు అడ్వాన్స్ అక్కర్లేదు. కేసు జయప్రదం అయినప్పుడే మీదగ్గర డబ్బు తీసుకుంటాను. మిమ్మల్ని నమ్ముతున్నాను. మీరిచ్చిన సమాచారం నాకు చాలు. మీరు వెళ్ళవచ్చు...'' అన్నాడు శాస్త్రి.

సుధాకర్ లేచి అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

డిటెక్టివ్ శాస్త్రి పూర్తి పేరు సోమనాథశాస్త్రి. అతడి వయసు ముప్పై సంవత్సరాలు. గవర్నమెంటు వుద్యోగం చేస్తూండగా అయిదేళ్ళ క్రితం హఠాత్తుగా అతనికి ఏదో వారసత్వపుటాస్తి కలిసివచ్చింది. చిన్నతనంనుంచీ అతనికి నేరాలన్నా, నేరపరిశోధన అన్నా అపరిమితమైన ఇష్టం.

ఆస్తి కలిసిరాగానే అతడు వుద్యోగానికి రాజీనామా ఇచ్చి నేర పరిశోధనను వృత్తిగా స్వీకరించాడు. అతడు పనిచేసే ఆఫీసులోనే టైపిస్టుగా వుండే రమణమూర్తి కూడా ఉద్యోగం వదిలిపెట్టి శాస్త్రివద్ద అసిస్టెంటుగా చేరిపోయాడు.

రామమూర్తి వయసు ఇరవై వుంటుంది. ధైర్యానికి లోటు లేదుకానీ చూసిరమ్మంటే కాల్చివచ్చే రకం. చాల సార్లు అతడు రోళ్ళలో తలదూరిస్తే శాస్త్రి రోకటిపోట్ల బాధనుంచి రక్షించాడు.

శాస్త్రి భార్యపేరు వెంకటరమణ. ఆమెనతడు ముద్దుగా రామూ అని పిల్చుకుంటాడు. ఆమెకు భర్త చేపట్టిన వృత్తి నచ్చలేదు. ఈ విషయంలోతప్ప అన్ని విషయాల్లోనూ భర్త ఆమె మాటలు వింటాడు.

వారికిద్దరు ఆడపిల్లల తర్వాత ఒక మగపిల్లవాడు. మరి పిల్లలు లేకుండా అపరేషన్ చేయించుకున్నాడు శాస్త్రి.

బహుశా వెంకటరమణ అదృష్టంవల్లనే అయ్యుం టుంది-శాస్త్రికింతవరకూ ప్రమాదకరమైన కేసులు తగల్లేదు. డబ్బుమాత్రం సరాసరి నెలకు వెయ్యివరకూ సంపాదిస్తున్నాడు.

రమణమూర్తి రాగానే శాస్త్రి అతడికి కేసు వివరా లన్నీ చెప్పి-"ఏం చేస్తే బాగుంటుందంటావ్!" అన్నాడు.

"సుబ్బరామయ్యగారి పిల్లల్ని ఇంటర్వ్యూ చేస్తే బాగుంటుంది."

శాస్త్రి నవ్వి "నీ బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు. వయసులో వున్న ఆడపిల్లలతోటా కేసు మొదలు పెట్టేది!" అన్నాడు.

రమణమూర్తి గతుక్కుమని "అదికాదు సార్! చని పోయిందికూడా వయసులోని పిల్ల. ఆ పిల్లలూ, ఈ పిల్లా ఒకే ఇంట్లో వుంటున్నారు. వరుసకు అక్కా చెల్లెళ్లు. కళ్యాణిగురించివాళ్లివ్వగలిగిన వివరాలు సుధాకర్ కూడా ఇవ్వలేదేమో!" అన్నాడు.

"బాగుంది. నువ్వు చెప్పింది కరక్టే. అలాగే చేద్దాం" అన్నాడు శాస్త్రి.

"అయితే ఎప్పుడు వెళ్ళమంటారు?"

"ఇప్పుడే... కానీ నువ్వు వెళ్ళవలసిన చోటు వేరు. సుబ్బరామయ్యగారి ఎదురింట్లో నువ్వు కొంత సమాచారం సేకరించాలి..." అన్నాడు శాస్త్రి.

రమణమూర్తి నిరుత్సాహంగా "ఆ ఇంట్లో ఆడపిల్లలున్నారా?" అన్నాడు.

"ఉన్నారో లేరో తెలియదుకానీ నువ్వుమాత్రం పదమూడేళ్ళ కృష్ణశర్మ అనే పుత్రాడిని ఇంటర్వ్యూ చేయాలి" అన్నాడు శాస్త్రి.

"సురి సుబ్బరామయ్యగారి పిల్లలు..."

"వాళ్ళ సంగతి నేను చూసుకుంటాను." అన్నాడు శాస్త్రి.

"అమ్మ గురూ! నా ఐడియాను నువ్వుపయోగించుకుంటున్నావా?" అని మనసులో మాత్రం అనుకున్నాడు రమణమూర్తి.

# 4

"నిజానికిది నూటరెండు రూపాయలు. కానీ యీ రెండ్రోజులూ ఎనభైఎనిమిది రూపాయలు. ఆ తర్వాత మళ్ళీ నూటరెండు రూపాయలైపోతుంది..." అంది గౌరి.

"ఎందుకని?" అన్నాడు శాస్త్రి.

"ఇది మా షాపులో రివాజు. ఒకోవారం ఒకో వెరైటీ కన్సెషన్ రేట్సుకి అమ్ముతాము..." అంది గౌరి.

శాస్త్రి చిన్నగా నవ్వి "ఈ కన్సెషన్ అన్ని విషయాల్లోనూ వుంటుందా?" అన్నాడు.

"అంటే?" అందామె.

శాస్త్రి స్వరం తగ్గించి "అన్నివిషయాల్లోనూ అంటున్నాను..." అన్నాడు.

గౌరి చిత్రంగా శాస్త్రికేసి చూసి అదోలా నవ్వింది.

ఆమె ముఖంలో కోపం కనబడకపోవడంలో శాస్త్రి ధైర్యం పెరిగింది. "అందానికి జోహారు లర్పించడం నా బలహీనత. ఈ చీరను కొని నీకే ప్రజంటు చేద్దామనుకుంటున్నాను..."

"తెలియనివాళ్ళవద్ద ఊరికే బహుమతులు తీసుకోవడం నా కలవాటు లేదు" అంది గౌరి. శాస్త్రి మాటలకు ఆమె ముఖం కాస్త ఎర్రబడింది.

"ఊరికే వద్దు..." అన్నాడు శాస్త్రి.

"అంటే?" అంది గౌరి కాస్త తీవ్రంగా.

"అలా కోపంగా చూడకండి. నాకు డబ్బుంది. సరదాగా ఖర్చుపెడతాను. నా ఇష్టం. మోసాలంటే నాకు మొదటే ఇష్టంలేదు. నాకు పెళ్ళికూడా అయింది. మీకు అభ్యంతరం లేకుంటే నెహ్రూ పార్కులో సాయంత్రం అయిదు గంటలకు నన్ను కలుసుకోండి. మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి..." అన్నాడు శాస్త్రి.

"నేను రాను..." అంది గౌరి.

"నేను చెడ్డవాణ్ని కాను. దుర్మార్గుణ్ని కాను. పెళ్ళి కాని ఆడపిల్లలపై చేయివేసే రకం కాను. మనసులోని మాటను సూటిగా చెబుతాను. ఇష్టంలేనివాళ్ళను వెంటనే వదిలిపెడతాను. పార్కులో నాతో ఓ అరగంటసేపు మాట్లాడితే మీకు వందరూపాయలిస్తాను. ఒకటికాదు, రెండు కాదు...వందరూపాయలు...ఆ అరగంటసేపూ నేను మిమ్మల్ని తాకనైనా తాకను..." అన్నాడు శాస్త్రి.

గౌరి ఓసారి అతని కళ్ళలోకి చూసి తల వంచుకుని—"సరే–వస్తాను" అంది. అన్నమాటమాటను నిలబెట్టుకుంది కూడా.

"అరగంట మాత్రమే టయిముంది కాబట్టి సమయం వృధా చేయను. నే నడిగిన ప్రశ్నలకు సూటిగా జవాబు చెప్పాలి" అన్నాడు శాస్త్రి.

"అడగండి" అంది గౌరి.

"నేనిలా అడుగుతున్నానని ఏమీ అనుకోకూడదు... నాకు మీమీద మనసైంది. ఏమైనా అవకాశముందా?"

నిర్విణ్ణురాలై శాస్త్రివంక చూసింది గౌరి. ఆమెకు నోట మాటరాలేదు.

"మౌనం అంగీకారమనుకుంటాను. అయితే నాకో ఇబ్బంది ఉంది. ఊళ్ళో చాలామందికి నేను తెలుసు. లాడ్జింగుల్లో వ్యవహారం కుదరదు. మా ఇంట్లో అసలే జరగదు. మీ ఇంట్లో సాధ్యపడుతుందా?"

గౌరి దెబ్బతిన్నట్లు అతడివంక చూసి — "నేనలాంటి దాన్నని మీకెవరు చెప్పారు?" అంది.

"నాకు చాలామంది సేల్సుగరల్స్‌తో పరిచయముంది. అందమైనవాళ్ళు కటపడ్డప్పుడు నా ప్రయత్నం నేను చేసుకుంటాను. ఇందులో తప్పుందని అనుకోను. బజార్లో టాక్సీ పోతూంటే కేకేస్తాం. ఇష్టమైతే వస్తాడు. లేకపోతే లేదు" అన్నాడు శాస్త్రి.

"మరి నేను వెళ్ళవచ్చా?" అంది గౌరి.

"మీరు వెళ్ళడం నా అనుమతిమీద ఆధారపడితే నేను మిమ్మల్ని వెళ్ళనివ్వను. ఒక్క రోజుకు అయిదు వందలిస్తాను. ఆలోచించుకోండి..." అన్నాడు శాస్త్రి.

ఆమెనుంచి ఎటువంటి సమాధానం వినాలోనని అతను బెదిరిపోతున్నాడు.

"రేపు మధ్యాహ్నం రెండుగంటలకు — ఈ పార్కు దగ్గరకే రండి!" అంది గౌరి.

శాస్త్రి నిశ్చేష్టుడై ఆమెకంక చూశాడు.

"ఏమిటి విశేషాలు?" అన్నాడు శాస్త్రి.

రమణమూర్తి గొంతు సవరించుకుని__"కేసులో నిజం గానే బలముందని తోస్తోంది. ఒక్క కృష్ణశర్మనే కాక చుట్టుప్రక్కల చాలా వాకబు చేశాను. తెలిసిన వివరాలు చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి. నా దురదృష్టంకొద్దీ ఒక్క ఆడపిల్ల కూడా దొరకలేదు ప్రశ్నలడగడానికి_" అన్నాడు.

"విశేషాలు చెప్పు" అన్నాడు శాస్త్రి.

రమణమూర్తి ప్రారంభించాడు.

"సుబ్బరామయ్య ఇంట్లో ఉదయం పది అయ్యేసరికి ఎవ్వరూ వుండరు. ఆడా, మగా అందరూ తలో పనిమీదా బయటకు పోతారు. ఆఖరున వెళ్ళినవారు తాళంచెవి ఎదురింట్లో ఇచ్చి వెడతారు. ఆ తాళంచెవికి డూప్లికేటు లేదు. సాధారణంగా సుబ్బరామయ్య భార్య శారదమ్మ అందరికంటే ఆలస్యంగా బయటకు వెడుతుంది.

ఆడపిల్లలు సేల్సుగరల్సుగా పనిచేస్తున్నారు. కళ్యాణి స్టెనోగ్రాఫర్. శారదమ్మ కుట్టుపనులు నేర్చుకుంటోంది. సుబ్బరామయ్య గుమస్తా. ఇంతమంది బయటకు వెళ్ళిపోవలసి వున్నప్పటికీ ఆ ఇంటివాళ్ళు డూప్లికేటు తాళంచెవు లెందుకు చేయించుకోవడం లేదో ఆశ్చర్యం. ఎప్పుడూ ఎదురింట్లోనే ఇచ్చివెడతారు.

అయిదారు సంవత్సరాల క్రితంవరకూ సుబ్బరామయ్య ఆర్థిక పరిస్థితి ఘోరంగా వుండేది. ఆ ఇంట్లోని ఆడవాళ్ళెవ్వరూ బయటకు వచ్చేవారు కాదు. అయిదారు సంవత్సరాల నుంచి ఆయన పరిస్థితి మెరుగయింది. ఇంటిల్లపాదీ సంపాదనలో పడ్డారు. పరిస్థితి మెరుగైనాక సంపాదనలో

పడ్డారా, సంపాదనలో పడినాక పరిస్థితి మెరుగయిందా అన్నది ఎవ్వరూ చెప్పలేకపోయారు.

సుబ్బరామయ్య చాలా మంచివాడని ఆ వీధిలో పేరుంది. సుబ్బరామయ్య పిల్లలగురించి చాలామంది వంకరగా మాట్లాడారు. అయితే అవి అనూయకు సంబంధించినవే కానీ సాక్ష్యాలున్న మాటలుకాదు. అందని ఆడపిల్లల ప్రవర్తనమీద అభాండాలు వేసే మగవాళ్ళు చాలామంది వుంటారు.''

రమణమూర్తి చెప్పిందంతా విని — ''నువ్వు చెప్పింది విన్నాక రెండు విషయాలు నాకాశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి'' అన్నాడు శాస్త్రి.

''ఏమిటవి?''

''ఆ ఇంటివాళ్ళు దగ్గర డూప్లికేట్ తాళాలు ఎందుకుంచుకోవడంలేదు? డూప్లికేట్ తాళం దగ్గర లేని పక్షంలో కళ్యాణి తాళం వేసిన ఇంట్లోకి ఎలా వచ్చింది?''

''వాళ్ళ దగ్గర డూప్లికేటు తాళాలు వున్నప్పటికీ లేవని అబద్ధం చెబుతున్నారేమో!'' అన్నాడు రమణమూర్తి.

''అలా అబద్ధం చెప్పాల్సిన అవసరం ఎవరికుంటుంది?'' అన్నాడు శాస్త్రి.

రమణమూర్తి బుర్రకు పదును పెట్టసాగాడు. వున్నట్టుండి—''ఆ ఇంటి వాళ్ళందరూ కలిసి ఏదో గమ్మత్తు చేస్తున్నారు. తమకు పటిష్టమైన ఎలిబీని తయారుచేసుకుంటున్నారు'' అన్నాడు.

''ఎందుకు?'' అన్నాడు శాస్త్రి.

''కళ్యాణిని చంపాలన్న ఆలోచన వారికి చాలా కాలం క్రితమే వచ్చివుండాలి. మాస్టర్ ప్లాన్ వేశారు...'' అన్నాడు రమణమూర్తి.

"కళ్యాణిని చంపవలసిన అవసరం ఆ ఇంటివాళ్ళ కెందుకు కలిగింది?"

రమణమూర్తికి జవాబు తోచలేదు. అతను ఆలోచనలో పడ్డాడు.

శాస్త్రి మళ్ళీ-"అసలు హత్యలు చేయడానికి కారణా లేముంటాయి?" అన్నాడు.

"పగ, ద్వేషం..."

"ఇంకా..."

"మోసం చేసినట్లు గ్రహించడం..."

"ఊఁ..."

"చెప్పిన పనికి ఒప్పుకోకపోవడం..."

"ఇంకా..."

"రహస్యమేమైనా బయటపడడం..."

"ఊఁ .."

"సార్!" అన్నాడు రమణమూర్తి.

శాస్త్రి కళ్ళు మెరుస్తున్నట్లు అతను కనిపెట్టాడు.

"అవును..." అన్నాడు శాస్త్రి. "ఆ ఇంటివాళ్ళకు సంబంధించిన రహస్యమేదో వుంది. అది కళ్యాణికి తెలిసి వుండాలి."

క్షణం ఆగి అన్నాడు శాస్త్రి—"నువ్వు చేయవలసిన పని ఇంకొకటుంది. కళ్యాణి పనిచేస్తున్న ఆఫీసుకు వెళ్ళి ఆమెగురించి వాకబు చేయాలి....

"పోలీసులు కొంతవరకూ ఆ పని చేసినట్లున్నారు..." అన్నాడు రమణమూర్తి.

"వాళ్ళు అధికారపు హోదాలో ఆ పని చేశారు. నువ్వలా కాకుండా ఒక సామాన్యుడిగా వివరాలు సేకరించు. మన పరిశోధనకు పనికివచ్చే వివరాలు దొరుకుతా

యని నేననుకోను. కానీ కళ్యాణిగురించి తెలుసుకోవ డానికా సమాచారం మనకు బాగా సహకరిస్తుంది—"
అన్నాడు శాస్త్రి.
"ఈ ప్రయత్నంలోనైనా నాకు కొంతమంది ఆడ పిల్లలు దొరక్కపోరు" అన్నాడు రమణమూర్తి.
శాస్త్రి నవ్వి—"డోన్ట్ బీ టూ ఆప్టిమిస్టిక్. నేను విన్నదాన్నిబట్టి ఆ ఆఫీసులో ఇద్దరే ఆడవాళ్ళున్నారు. ఒకామె కళ్యాణి. రెండవవారు సుమారు ఇరవై ఏళ్ళుగా పనిచేస్తున్న మామ్మగారు..." అన్నాడు.

రమణమూర్తి ఉక్రోషంగా — "చూసి చూసి నాకిలాంటి బేరాలు తగిలిస్తున్నారు" అన్నాడు.
"నువ్వు కుర్రాడివి. నన్ను నమ్ముకున్నవాడివి. నువ్వు మోసపోతే అందువల్ల నీక్కలిగే నష్టం సంగతి అటుంచి డిటెక్టివ్‌గా నాకు చెడ్డపేరొస్తుంది. ఫలానా డిటెక్టివ్ అసిస్టెంటు మోసపోయాడంటే అది నాకెంత అవమానం!"
అన్నాడు శాస్త్రి.
"నేను సులువుగా మోసపోతానని తెలిసినపుడు నన్ను మీ అసిస్టెంటుగా ఎందుకు వేసుకున్నారు?" అన్నాడు రమణమూర్తి.

"ఒక్క ఆడపిల్లల చేతుల్లోనే నువ్వు సులువుగా మోసపోతావు. నువ్వో పెళ్ళి చేసుకుని నా అనుభవం సంపాదించగలిగితే అప్పుడు నేను నీకు అన్ని ఆడపిల్లల కేసులే అప్పగిస్తాను" అన్నాడు శాస్త్రి.
"అన్నట్లు - మీరు పట్టిన ఆడపిల్లల కేసేమయింది?" అన్నాడు రమణమూర్తి.

"అదా? అదింకా నువ్వడక్కూడదు..." అన్నాడు శాస్త్రి.

# 6

సరిగ్గా మధ్యాహ్నం రెండుగంటలకు గౌరి నెహ్రూ పార్కుకు వచ్చింది. ఆమెకోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్న శాస్త్రి- "చాలా థాంక్స్-అన్నప్రకారం వచ్చేశావు!" అన్నాడు.

"అప్పుడే చనువు పెంచేశారు!" అంది గౌరి.

"ఈ క్షణంనుంచే మన చనువు పెరుగుతుంది. నువ్వు నన్నెలా పిలిచినా నా కభ్యంతరం లేదు-" అన్నాడు శాస్త్రి.

"అలాగే. నీ పేరు..." అంది గౌరి.

"సోమనాథశాస్త్రి" అన్నాడు శాస్త్రి.

గౌరి తనే స్వయంగా రిక్షా మాట్లాడింది. ఇద్దరూ ఓ రిక్షాఎక్కారు. రిక్షా ఆగిన వెంటనే శాస్త్రి రిక్షావాడికి డబ్బులిచ్చాడు. గౌరి అతన్ని రెండు మూడు సందులుతిప్పి ఓ ఇరుకుసందులోకి తీసుకువెళ్ళింది. అక్కడ నిర్మానుష్యంగా ఉంది. ఆ సందులోకి వచ్చిన గోడకు ఓ గుమ్మం. ఆ గుమ్మానికో తలుపు.

"ఇది మా ఇంటి దొడ్డి తలుపు!" అంది గౌరి.

శాస్త్రి ఆశ్చర్యంగా- "మనం దొడ్డిదారిన ప్రవేశిస్తున్నామా?" అన్నాడు.

"మనం పోతున్నది రాజమార్గం కాదుకదా," అంది గౌరి-"ఇంకేం మాట్లాడకండి. మనం లోపలకు వెళ్ళేక మిగతా విశేషాలు మాట్లాడుకోవచ్చు..."

గౌరి తలుపును తోసింది. లోపల గడియవేసిలేదు కాబట్టి వెంటనే తెరుచుకుంది. గౌరి లోపలకు వచ్చి గడియవేసింది. ఇద్దరూ దొడ్డిలోకి ఆ తర్వాత ఇంటిలోకి ప్రవేశించారు. ఇంట్లోకి ప్రవేశించడానికి ఏ విధమైన

అడ్డంకీ లేదు. జారగిల వేసి ఉన్న తలుపులు తోసుకుని ఇంట్లోకి ప్రవేశించా రిద్దరూ.

అప్పుడు గౌరి మళ్ళీ తలుపులు లోపల్నుంచి వేసి చటుక్కున శాస్త్రిని సమీపించి– "డబ్బు ముందుగానే ఇవ్వాలి." అంది.

శాస్త్రి జేబులోంచి అయిదు వంద రూపాయల నోట్లు తీసి ఆమెకు అందించాడు. ఆమె లెక్కపెట్టుకుని లోపల ఎక్కడో దాచివచ్చింది.

"ఇంట్లో ఎవరూ లేరా?" అన్నాడు శాస్త్రి.

"ఇంటికి వీధివైపు తాళం వేసివుంది" అంది గౌరి.

"ఇలా తలుపులు తెరచివుంచుకుంటే ప్రమాదం కాదా?"

"ఇంతవరకూ ఏ ప్రమాదమూ జరుగలేదు. నాలుగైదేళ్ళుగా ఉన్న ఈ ఏర్పాటు ఇకముందుకూడా కొనసాగుతుంది..."

"మీ దగ్గరకు వచ్చిన మొగవాడెవరైనా మిమ్మల్ని మోసంచేస్తే...అంటే ఈ ఏర్పాటుందని తెలిసి ఇంట్లో ఎవరూ లేనప్పుడు వచ్చి..."

గౌరి నవ్వి– "ఆ భయం మాది. మీ కవసరంలేదు. మీరు వచ్చినపని చూసుకువెళ్ళండి..." అంది.

శాస్త్రి ఆమెను దగ్గరగా తీసుకుని చనువుగా ముద్దు పెట్టుకున్నాడు. గౌరి అతడిని మృదువుగా విడిపించుకుని– "గదిలోకి పోదాం" అంది నెమ్మదిగా. ఆమె ఆవేశంగా ఉన్నదని అతడికి తెలుస్తూనే ఉంది.

ఇద్దరూ గదిలోకి వెళ్ళారు. శాస్త్రి అక్కడి అలంకరణల గురించీ ఏర్పాట్ల గురించీ ఏవేవో ప్రశ్నలు వేస్తున్నాడు.

గౌరి విసుగ్గా-"ఇవన్నీ వృధా ప్రశ్నలు. నాలుగుగంట లయ్యేసరికి మనమిక్కణ్నుంచి బయటపడాలి. ఈవిషయం గుర్తుంచుకోండి" అంది.

స్త్రీగా ఆమె ఇస్తున్న ప్రోత్సాహం శాస్త్రిని రెచ్చ గొట్టింది. అతను బలంగా ఆమెను కౌగలించుకుని— "కారణం తెలియదు కానీ నాకంటే నువ్వే ఆవేశంగా ఉన్నావు" అన్నాడు.

గౌరి చిరాగ్గా- "అవును-నిజమే- ఈ ప్రశ్నలన్నింటికీ జవాబు చెప్పడానికి నా ఆవేశం చల్లార్చాలి" అంది.

శాస్త్రి మరింతగా ఆమెను హత్తుకున్నాడు.

పావుగంట తర్వాత ఇద్దరిలో ఆవేశం చల్లారింది.

"ఇప్పుడు చెప్పు. నీ ఆవేశానికి కారణమేమిటి?" అన్నాడు శాస్త్రి.

"మూడు వారాల తర్వాత ఇదే మొదటి బేరం..." అంది గౌరి.

"ఎందుకని?"

"మా ఇంట్లో ఒక ఆత్మహత్య జరిగింది. అందువల్ల పోలీసులు మా ఇంటిమీద కొంతకాలంపాటు నిఘా వేశారు..."

"ఆత్మహత్య చేసుకున్నదెవరు?"

"కళ్యాణి-వరుసకు నాకు చెల్లెలవుతుంది..." అంటూ గౌరి కళ్యాణి వివరాలిచ్చింది.

శాస్త్రి అప్పుడే తెలిసినట్లుగా, "అయ్యో-ఇంతకీ ఆ అమ్మాయి ఆత్మహత్య ఎందుకు చేసుకుంది?" అన్నాడు.

"తెలియదు" అంది గౌరి.

"మీ ఇంట్లో ఉన్న మనిషి గురించి మీకెందుకు తెలియదు. తెలిసే ఉంటుంది!"

"నిజంగా నాకు తెలియదు. దానికి జీవితంమీద ఉన్న మోజు ఇంకెవ్వరికీ ఉండదు. మేము ఊరికి వెళ్ళేముందు కూడా తన భావిజీవితం గురించి కనే కలలు నాకు చెప్పింది..."

"నువ్వూ, కళ్యాణి ఎక్కువగా మాట్లాడుకుంటూరా?"

"దానికి నేనంటే చాలా ఇష్టం..."

శాస్త్రి క్షణం తటపటాయించి- "కళ్యాణి మన స్తత్వం ఎలాంటిది?" అన్నాడు.

గౌరి అతనివంక తేరిపార చూసి- "ఈ ప్రశ్నలన్నీ నువ్వెందుకు అడుగుతున్నావ్?" అంది.

"కుతూహలం కొద్దీ. నువ్వు చెప్పిందాన్నిబట్టి చూస్తే కళ్యాణి ఆత్మహత్య చేసుకోలేదనీ హత్య చేయబడ్డదని తోస్తోంది. కళ్యాణిని హత్యచేస్తే ఈ ఇంట్లోవాళ్ళెవరో చేసివుండాలి. అలాంటి అవసరం ఎవరికి ఉంటుంది?" అన్నాడు శాస్త్రి.

గౌరి భయంగా శాస్త్రివంక చూసి- "ఎవర్నువ్వు? పోలీసుల మనిషివా, లేక ప్రయివేటు డిటెక్టివా?" అంది.

"పోలీసులకూ, డిటెక్టివులకూ నిగ్రహం వుంటుంది. నేనో సామాన్య వ్యభిచారిని. అప్పుడప్పుడు మాత్రం కథలు రాస్తూంటాను. మనుషుల మనస్తత్వాలు పరిశీలించడం నా హాబీ-" అన్నాడు శాస్త్రి.

"అలాంటి హాబీలు నాకు కిట్టవు. నా మీద దయ యుంచి కళ్యాణి గురించి నన్నేమీ అడక్కు. దాని గురించి తల్చుకున్నప్పుడల్లా నా గుండె తరుక్కుపోతోంది..." అంది గౌరి.

"ఒక్కమాట... నువ్వీ వృత్తిలో ఎందుకు ప్రవేశించావ్?" అన్నాడు శాస్త్రి.

"జవాబు నా దగ్గరలేదు" అంది గౌరి.

"పోనీ-నువ్వీ వృత్తిలో ప్రవేశించినట్లు కళ్యాణికి తెలుసా?"

"ప్లీజ్ నన్నేమీ అడగొద్దు."

"కళ్యాణికూడా నీకులాంటిదేనా?"

"ఈ ప్రశ్నలన్నింటికీ నేనెందుకు జవాబు చెప్పాలి?"

"ఎందుకా? కళ్యాణిలాగే నువ్వుకూడా చచ్చే అవకాశముంది కనుక."

గౌరి తడబకుతూ- "అలా ఎందుకు జరుగుతుంది? దాని పద్ధతులు వేరు. నా పద్ధతులు వేరు. నా జీవితవిధానమే నాకు శ్రీరామరక్ష" అంది. అంతకుమించి అతను ఎన్నడిగినా ఆమె జవాబు చెప్పడంలేదు.

తనమీద అనుమానం కలగకుండా ఉండేందుకుగానూ శాస్త్రి ఆమెతో మరి కాసేపు ప్రేమ కబుర్లు చెప్పి, సరదాగా గడిపి, నాలుగుగంటల ప్రాంతంలో అక్కడనుంచి బయటపడ్డాడు.

# 7

ఉలిక్కిపడి- "ఏమిటన్నావ్?" అన్నాడు శాస్త్రి.

"అవును సార్! కళ్యాణిని ఒకతను ప్రేమిస్తున్నాడు" అన్నాడు రమణమూర్తి. అతడి కళ్ళల్లో తను కనుగొన్న అద్భుత రహస్యానికి గర్వం కనబడుతోంది.

"వివరంగా చెప్పు" అన్నాడు శాస్త్రి.

"అతని పేరు కమలాకరం. స్టేట్ బ్యాంక్‌లో ఆఫీసరు. మనిషి అందంగా, హుందాగా ఉంటాడు. కళ్యాణి కోసం ప్రతిరోజూ సాయంత్రం ఆ కంపెనీకి వెళ్ళేవాడు. కళ్యాణిని పెళ్ళిచేసుకోవాలని అతను తపించిపోతున్నాడు. ఆమె పెళ్ళి వాయిదా వేయడానికి కారణం

ఉద్యోగమేనని అతడి అనుమానం. అందుకే ఆమెను ఉద్యోగంలోంచి తీసివేయమని కంపెనీ మానేజర్ని పలు మార్లు రిక్వెస్టు చేశాడు. కానీ కళ్యాణివంటి సమర్థురాలిని ఉద్యోగంలోంచి తీసివేయడానికి ఆ మేనేజరు ఇష్టపడలేదు.''

''ఇంకా ఏం చెప్పాడు మేనేజర్?''

''కళ్యాణిగురించి చాలా మెచ్చుకున్నాడా మేనేజర్. ఆడపిల్లలు-అందులోనూ కళ్యాణి అంత అందంగా ఉండే వాళ్ళు— అంత సమర్థవంతంగా పని చేయడాన్ని అపూర్వంగా అభివర్ణించాడాయన. కళ్యాణి చనిపోయిందంటే ఆయనకెవరో ఆత్మబంధువు పోయినట్లుందిట. జీవితమంటే ఎంతో మోజున్న కళ్యాణి తన జీవితాన్ని విధంగా అంతంచేసుకోవడం ఆశ్చర్యంగా ఉందనికూడా ఆయన అన్నాడు.''

''కమలాకరాన్ని కలిసేవా?''

''లేదు. మగవాళ్ళని కలుసుకుని కలుసుకుని బోరు కొట్టింది. ఈ పర్యాయం ఆ డ్యూటీని మీకు అప్పజెప్పి, నేను ఏమైనా సరే సుబ్బరామయ్యగారమ్మాయిల్ని కలుసుకోవాలనుకుంటున్నాను'' అన్నాడు.

''పెళ్ళయ్యేవరకూ ఆ పనిమాత్రం చేయకు. కమలాకరం వద్దకు మనమిద్దరం కలిసే వెడదాం'' అన్నాడు శాస్త్రి.

శాస్త్రితో కలిసి ఎక్కడకు వెళ్ళాలన్నా రమణ మూర్తికి చాలా సరదా. శాస్త్రి ఎలా ప్రశ్నలడుగుతాడూ, ఎదుటివాళ్ళను ఎలా బోల్తాకొట్టిస్తాడూ అన్నది క్షుణ్ణంగా పరిశీలించి- ఆ ట్రిక్కులన్నీ నేర్చుకోవాలని అతడి ఆశ.

అయితే రమణమూర్తి కూడా వున్నప్పుడు ఎవరినైనా ప్రశ్నలడగాలంటే శాస్త్రికి అంతగా ఇష్టముండదు. తన అసిస్టెంటుపై తనపై ఆరాధనాభావమున్నదని అతనికి తెలుసు. కానీ తను మరీ అంత తెలివైనవాడినికాదని శాస్త్రి నమ్మకం. తన మాటలు విని రమణమూర్తికి తన మీదగల ఆరాధనాభావం తగ్గిపోతుందేమోనని శాస్త్రి భయపడతాడు.

ఏది ఏమైనా ఆ రోజు సాయంత్రం ఇద్దరూ కలిసే కమలాకరం ఇంటికి వెళ్ళారు. వాళ్ళు వెళ్ళేసరికి కమలాకరం ఇంట్లో ఒంటరిగా, దిగులుగా ఏదో ఆలోచిస్తూ కూర్చునివున్నాడు. వీధితలుపులు బార్లా తెరిచివున్నాయి'

"మా బంధువు లమ్మాయుంది. పేరు సీత. చాలా అందంగా వుంటుంది. బియ్యే ప్యాసయింది. మంచి సంబంధాలకోసం చూస్తున్నారు. కట్నం ఎంతకావాలన్నా ఇవ్వగలరు. మీ గురించి తెలిసింది. అన్యధా భావించనంటే" అంటూ తనను తను పరిచయంచేసుకుంటూ అర్థోక్తిలో ఆగిపోయాడు శాస్త్రి.

"సారీసర్! నాకు వైవాహికేచ్ఛ లేదు..." అన్నాడు కమలాకరం.

శాస్త్రి ఎంతో ఆశ్చర్యపోయినట్లు నటించి కారణం తెలుసుకోగోరాడు.

"నేనో అమ్మాయిని ప్రేమించాను," అన్నాడు కమలాకరం.

శాస్త్రి తెల్లబోయినట్లు ముఖంపెట్టి– "ఆ అమ్మాయెవరో తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"అది మీ కనవసరం. ఆ అమ్మాయి చనిపోయింది."

"పోయినవాళ్ళతో మనమూ పోతామా?" అని శాస్త్రి ఏదో అనబోగా...

"ఆమెతో పాటే నాలోని ప్రేమకూడా చచ్చిపోయింది. ఈ జీవితానికింక పెళ్ళిప్రసక్తి లేదు" అన్నాడు కమలాకరం.

అతన్ని చూస్తుంటే నిజంగానే ఒక ఆదర్శ ప్రేమికుడిలా అగుపించాడు శాస్త్రికి. నెమ్మదిగా ప్రశ్నలు ప్రారంభించాడు.

"ఎలా చనిపోయిందామె."

"ఆత్మహత్య చేసుకుని."

"ఆత్మహత్య ఎందుకు చేసుకుంది? ఆమె శీలాన్నెవరైనా అపహరించేరా?"

"కళ్యాణి నిప్పులాంటి మనిషి. ఆమెను ముట్టుకున్నవాళ్ళు కాలిపోతారు." అన్నాడు కమలాకరం. ఆ తర్వాత అతను ఇంకే ప్రశ్నలకు జవాబివ్వదల్చుకోనట్లు చెప్పేశాడు.

అక్కణ్ణించి బయటపడ్డాక– "నేను నిన్నుకూడా ఎందుకు తీసుకొచ్చానో తెలుసా? నేనడిగే ప్రతిప్రశ్నకూ కమలాకరంలో కలిగే భావసంచలనాన్ని శ్రద్ధగా గమనించి తర్వాత నాకు చెబుతావని!" అన్నాడు శాస్త్రి.

"మీరు ముందుగా చెప్పకపోయినా నేనా పని చేశానుసార్! మీరడిగినవన్నీ ఛిలే ప్రశ్నలండీ–ప్రతి ప్రశ్నా అతడిని కదలించింది. ఆమె శీలం గురించి మీరు అడిగినప్పుడు అతడి నరనరాల్లోనూ ప్రత్యేకమైన ఆవేశం కనబడింది" అన్నాడు రమణమూర్తి.

"అయితే నువ్వు గమనించని విశేషం ఇంకొకటుంది" అన్నాడు శాస్త్రి. "కమలాకరం మనకు పూర్తిగా నిజం చెప్పడంలేదు, ఏదో దాస్తున్నాడు."

"అదేమిటయ్యుంటుంది?" అన్నాడు రమణమూర్తి.

"ఏమీ తెలియటంలేదు. నిప్పులాంటి మనిషి కళ్యాణి. నీతిలేని ఇంట నివసిస్తూ ఆత్మహత్య చేసుకుంది. ఇదొక విచిత్రమనుకుంటే కమలాకరం ప్రేమ నన్నింకా ఆశ్చర్య పరుస్తోంది. కళ్యాణి అన్నయ్య సుధాకర్ ఆమె పెళ్ళి కోసం డబ్బు కూడబెడుతున్నాడు. మంచి సంబంధం చేయాలన్నది అతని కోరిక. కమలాకరంలాంటి వరుడు కళ్యాణికి దొరకడం అదృష్టమే! అతను ప్రాణప్రదంగా కళ్యాణిని ప్రేమిస్తున్నాడు కాబట్టి కళ్యాణిని కట్న మక్కర్లేకుండా చేసుకుని ఉండేవాడు. అటువంటప్పుడు ఇంతకాలమూ ఈ పెళ్ళి ఎందుకు జరుగలేదు? ఎప్పుడో జరుగవలసిన పెళ్ళికదా ఇది!" అన్నాడు శాస్త్రి.

"సార్!" అన్నాడు రమణమూర్తి — "కమలాకరం కళ్యాణిని ప్రేమిస్తూండవచ్చు. కాని కళ్యాణి కమలా కరాన్ని ప్రేమిస్తోందన్న రూఢి ఏమిటి?"

శాస్త్రి, రమణమూర్తి భుజం తట్టి మెచ్చుకున్నాడు "రేపు నువ్వు కమలాకరం ఆఫీసుకు వెళ్ళి అతనికి దగ్గర స్నేహితుల్ని విచారించి అతడి ప్రేమకథ పూర్తి వివరాలు తెలుసుకుని రా"

మర్నాడు సాయంత్రానికల్లా రమణమూర్తి చాలా వివ రాలు సేకరించుకుని వచ్చాడు:

కమలాకరం కళ్యాణిని మనసారా ప్రేమిస్తున్నాడు. ఆ విషయాన్ని ఆమెకు చెప్పాడు. ఆమె అతన్ని ప్రేమి స్తున్నట్లు రూఢి లేదు కానీ అతనితో చాలా సరదాగా వుండేది. అభిమానంగా మాట్లాడేది. అతడు ఎన్నోమార్లు పెళ్ళిప్రసక్తి తీసుకుని రాగా ఆ ప్రస్తావన రాకుండా జాగ్రత్తపడేది, లేదా సంభాషణను దారి మళ్ళింపజేసేది.

కమలాకరం ప్రేమను కళ్యాణి భయపడుతూందేది. అతడికి తనకంటే మంచి వధువులు దొరుకుతారనీ అతడి ప్రేమకు తను తగననీ ఆమె అంటూందేది. తన ఇంటికి తీసుకు వెళ్ళడానికి గానీ, తనవారికి పరిచయం చేయడానికి గానీ ఆమె అంగీకరించలేదు.

ఒకపర్యాయం కమలాకరం ఆమెను సూటిగా అడిగే వాడుట—"నువ్వు నన్నెందుకు పెళ్ళిచేసుకోవు?" అని. దానికి సమాధానంగా ఆమె—"కుళ్ళిన శవాలమధ్య నిల బడి పారిజాత సౌరభాన్ని ఆస్వాదించాలనుకుంటున్నావు నువ్వు. ఆ శవాల వాసనలా సౌరభాన్ని మించగలవని గ్రహించలేకపోతున్నావు" అన్నదట కళ్యాణి.

కమలాకరానికి అనుమానం వచ్చి ఆమె మరెవర్నైనా ప్రేమించిందేమోనని విచారించాడు. ఆమె పనిచేస్తున్న ఆఫీసులో అడగ్గా అందరూ ఆమె అందంతోపాటు నడ వడికకు కూడా మంచి సర్టిఫికెట్ ఇచ్చారు. కళ్యాణిని అర్థంచేసుకోలేక కమలాకరం సతమతమవుతూంటే ఇటీ వలే ఆమె ఆత్మహత్య చేసుకుంది. అప్పట్నించీ కమలా కరం మరింత డీలాపడిపోయాడు.

రమణమూర్తి చెప్పినదంతా విని—"కళ్యాణి ఏదో విషవలయంలో ఇరుక్కుంది. ఆ విషయం కమలాకరానికి సూటిగా చెప్పకుండా సూచనమాత్రంగా తెలియ జేసిం దామె. తన బంధువుల నైతిక వర్తనను అసహ్యించుకునే కళ్యాణి ఆ కారణంగా తన కాపురంలో నిప్పులు పడగల వని భయపడింది. అదే కారణంగా ఆమె కమలాకరంతో విపరీతంగా ప్రవర్తించింది" అన్నాడు.

"సుబ్బరామయ్యగారమ్మాయిల ప్రవర్తన మంచిది కాదా..."

"కాదనడానికి ఏమాత్రమూ సందేహం లేదు. అయితే హత్యలుకూడా చేయగలరా? అనిమాత్రం ఆలోచిస్తున్నాను" అన్నాడు శాస్త్రి.

# 8

శాస్త్రి వేషం మార్చుకుంటూంటే అప్పుడే గదిలోకి అడుగుపెట్టిన అతని భార్య వెంకటరమణ—"వేషాలుకూడా వేస్తున్నారా—ఏదో ప్రమాదకరమైన కేసే అయుంటుంది. మీరు ఇల్లు కదలడానికి వీల్లేదు" అంది.

"అలా అంటే ఎలా? ఈ కేసు అవగానే నీకు నాలుగు జతల బంగారు గాజులు చేయించాలనుకుంటున్నాను..." అన్నాడు.

వెంకటరమణ కళ్ళు మెరిశాయి—"నిజంగానండీ!" అంది.

"నిజంగానే" అన్నాడు శాస్త్రి. "బంగారు గాజులంటే ఏమిటనుకున్నావ్? మట్టిగాజులైతే ఇట్టే పగిలిపోతాయి. పసుపుతాడైతే చేత్తో తెంపేయవచ్చు. నీ మెళ్ళో పసుపుతాడుకు బదులు బంగారునాను తాడు వుంది. చేతికూ్కడా బంగారు గాజులు వస్తే అప్పుడు నీ మాంగల్యానికి లభించే పటిష్టమైన రక్షణ ఏ ఆడదానికీ వుండదు."

"నిజమేనంటారా?" అంది అమాయకంగా వెంకటరమణ.

"ముమ్మాటికీ ఇది నిజం. కాబట్టే డబ్బున్న ఆడవాళ్ళ మొగుళ్ళు బ్రతికినంత కాలం పేదవాళ్ళ మొగుళ్లు బ్రతకడం లేదు..." అన్నాడు శాస్త్రి.

వెంకటరమణ మౌనంగా ఊరుకోవడంచూసి—"నీవు నాకంటే బంగారు గాజులే ముఖ్యమనుకుంటాను. బండెడు

నగలొస్తాయంటే నువ్వే స్వయంగా నన్ను చంపేస్తా వేమో!" అన్నాడు శాస్త్రి.

వెంకటరమణ చటుక్కున అతడి నోరుమూసి—"పాపిష్టి మాటలు అనకండి—నిజం చెబుతున్నాను. మీ రిలాటి డిటెక్టివ్ గా వుండడం నాకు నచ్చలేదు. ఈ వృత్తి మానేస్తే అందరికంటే ఎక్కువగా సంతోషించే దాన్ని నేనే" అంది.

"నేను డిటెక్టివ్ నయ్యానుకానీ డిటెక్టివ్ భార్యగా నిన్ను తయారుచేయలేక పోయాను" అన్నాడు శాస్త్రి.

ఆ తర్వాత నెమ్మదిగా అతను దొడ్డిదారిన బయటపడి కాసేపు అటూ ఇటూ తిరిగి ఓ సందులోకి ప్రవేశించాడు. అక్కణ్ణించి నడుచుకుంటూ వెళ్ళి సుబ్బరామయ్య ఇల్లు చేరాడు.

ఆ ఇంటికి తాళంవేసి వుంది. కాసేపు అటూ ఇటూ తచ్చాడి పక్కసందులోంచి ఆ ఇంటి వెనుకభాగంవైపు వచ్చాడు.

అక్కడ నిర్మానుష్యంగావున్న ఇరుకు సందును అతను గుర్తుపట్టాడు. చటుక్కున ఆ సందులోదూరి తనకు తెలిసిన తలుపుదగ్గర నిలబడి ఓ క్షణం తటపటాయించి, నెమ్మదిగా తలుపు తోశాడు. అతను లోపల అడుగుపెట్టబోయేంతలో భుజంమీద బలంగా ఓ చేయిపడింది. శాస్త్రి చటుక్కున వెనక్కు తిరిగి ఆ మనిషిని చూసి-"ఓఁ నువ్వు సుబ్బన్నా!" అన్నాడు.

ఆ మనిషి ఆశ్చర్యంగా-"నా పేరు నీకెలా తెలుసు?" అన్నాడు.

"నన్ను నువ్వనేంత వాడివయ్యావురా-నేనెవర్నను కుంటున్నావ్-డిటెక్టివ్ శాస్త్రిని" అన్నాడు శాస్త్రి.

సుబ్బన్న చటుక్కున రెండు చేతులు జోడించి ''మన్నించాలి బాబూ, గుర్తుపట్టలేదు. ఇక్కడ తమరికేం పని?'' అనడిగాడు.

''నా సంగతి తర్వాత చెబుతాను. ముందు నీ సంగతి చెప్పు. ఇక్కడేం పని నీకు?'' అంటూ గద్దించాడు డిటెక్టివ్ శాస్త్రి.

సుబ్బన్న ఓ క్షణం తటపటాయించి — ''ఈ యింట్లో కెవ్వరూ వెళ్ళకుండా నేనిక్కడ కాపలా వుంటాను. ఈ తలుపు తోసేంతవరకూ నేనెవ్వరికీ కంటపడను...'' అన్నాడు.

''కాపలా ఎందుకు?'' అన్నాడు శాస్త్రి.

''చెబితే ఒక తంటా... చెప్పకపోతే ఇంకో తంటా'' అంటూ సందిగ్ధంలో పడ్డాడు సుబ్బన్న.

సుబ్బన్న ఆ ఊరి గూండాల్లో ఒకడు. ఏదో కేసులో ఇరుక్కుంటే శాస్త్రి వాడిని రక్షించి—ఇంకెప్పుడూ వెధవపనులు చేయొద్దని హెచ్చరించాడు. శాస్త్రి అంటే సుబ్బన్నకు చాలా గౌరవముంది.

''నాతో చెబితే ఏ తంటావుండదు. చెప్పు'' అన్నాడు శాస్త్రి.

ముందు కాసేపు బెట్టుచేసినా చివరకు సుబ్బన్న చెప్పాడు. వాడినిక్కడ కాపలాగా వుంచింది జంబులింగం. జంబులింగం ఊరి పెద్దమనుషుల్లో ఒకడు.

వ్యభిచారం చట్టబద్ధం కాకపోయినా ఇంచుమించు చట్టబద్ధమైనట్లే కొనసాగుతోంది. అందువల్ల సుబ్బన్న వాళ్ళకు ప్రొఫెషనల్సుమీద ఆసక్తి తగ్గిపోతోంది. సంసార స్త్రీలమీదా, సంసారపక్షంగా వుండే మధ్య తరగతి ఆడవాళ్ళమీదా చాలామంది మోజుపడుతున్నారు.

ప్రజల్లో కూడా డబ్బుకు ప్రాధాన్యత హెచ్చి నైతిక విలువల ప్రాముఖ్యత తగ్గిపోతోంది.

ఈ సమయంలో మధ్యతరగతివారి బలహీన మనస్తత్వాన్ని ఆధారంగా చేసుకుని జంబులింగం ఓ కొత్తరకం వ్యాపారం ప్రారంభించాడు. ఆ ప్రకారం అతను కొంత మంది మధ్యతరగతి వాళ్ళను లోబరచుకుని వాళ్ళ ఇంటి ముందు తాళంవేసి దొడ్డి గుమ్మాన తర్వాత వచ్చి—ఆ ఇంట్లోని ఆడవాళ్ళు వ్యభిచారం కొనసాగించే ఏర్పాటు చేశాడు. ఇంట్లో ఎవ్వరూ లేనప్పుడు సుబ్బన్నలాంటి వాళ్ళను దొడ్డి గుమ్మానికి కాపలా పెడుతున్నాడు.

"మధ్యతరగతి వాళ్ళు ఓ పట్టాన లొంగరే — నీతికి వాళ్ళిచ్చే విలువ మరెవ్వరూ ఇవ్వరుగదా" అన్నాడు శాస్త్రి ఆశ్చర్యంగా.

అందుకు జంబులింగం అవలంబించే పద్ధతిని సుబ్బన్న వివరించాడు. ఎలాగో అలా ఆ ఇంటి ఆడపిల్లలను చెడగొడతాడట. ఆ తర్వాత వాళ్ళను తన చెప్పుచేతల్లో వుంచుకోగలుగుతాడు. ఈ విధంగా ఇప్పుడు జంబులింగం చాలా సంపాదిస్తున్నాడు. అమ్మాయి తనకుతానుగానైనా బుకింగ్ చేసుకోవచ్చు లేదా జంబులింగంద్వారా ఏర్పాటు జరగవచ్చు.

శాస్త్రికి ఆ అనుభవంలోని థ్రిల్ గుర్తుకు వచ్చింది. ఆ తర్వాత ఆ థ్రిల్ జంబులింగం వంటి సంఘద్రోహి కారణంగా సృష్టించబడిందని స్ఫురించింది. కారణం వేరైనప్పటికీ తన ప్రవర్తనకు అతను చాలా సిగ్గుపడ్డాడు.

"సుబ్బన్నా! నిన్ను మరికొన్ని ప్రశ్నలడుగుతాను. సమాధానం చెప్పాలి" అన్నాడు శాస్త్రి.

"అడగండి" అన్నాడు సుబ్బన్న.

"ఈ ఇంట్లో కళ్యాణి అనే అమ్మాయుందని తెలుసా?"

"ఆత్మహత్య చేసుకున్న పిల్లే కదండీ__తెలుసు..."

"జంబులింగం ఆమెనుకూడా లొంగదీసుకున్నాడా?"

"లేదండి. ఆ పిల్ల చాలా తెలివైనదిటండి. ఇంట్లో ఇద్దరాడపిల్లలు ఆయన వలలో పడ్డారని తెలిసి చాలా జాగ్రత్తపడిపోయిందిటండి. జంబులింగంగారా అమ్మాయి కోసం ప్రయత్నాలు చేశారండి" అన్నాడు సుబ్బన్న.

"ఆ ప్రయత్నాలకూ ఆత్మహత్యకూ ఏమైనా సంబంధముండవచ్చా?" అన్నాడు శాస్త్రి.

సుబ్బన్న కంగారుగా "అయ్యబాబోయ్ మీరలాంటి ప్రశ్నలు నన్నడక్కూడదు" అన్నాడు. వాడి కంగారు చూస్తూంటే నవ్వొచ్చింది శాస్త్రికి.

"ఒరేయ్ నీకేమీ భయంలేదు. నీకు తెలిసిన వివరాలన్నీ నాకు చెప్పు. నీకేమీ ప్రమాదం లేకుండా నేను చూస్తాను" అన్నాడు.

"ఏం చెప్పమంటారండీ"అన్నాడు భయంగాసుబ్బన్న.

"నువ్వెప్పుడైనా ఈ ఇంటికి రాత్రిళ్ళు కాపలా కాశావా?" అనడిగాడు శాస్త్రి.

"లేదండి" అన్నాడు సుబ్బన్న నసుగుతూ.

"అబద్ధమాడుతున్నావ్ నువ్వు" అన్నాడు శాస్త్రి.

"ఒకే ఒక్కసారి" అన్నాడు సుబ్బన్న ఇంకా నసుగుతూ.

"ఆ రాత్రేగదా కళ్యాణి ఆత్మహత్య చేసుకున్నది!"

"మీకంతా తెలిసిపోయిందన్నమాట!" అన్నాడు సుబ్బన్న కంగారుగా.

శాస్త్రి తనలో తనే నవ్వుకున్నాడు. ఎవరూ లేని సమయంలో ఈ ఇంటి కెటువంటి రక్షణ ఏర్పాట్లున్నాయో

తెలుసుకోవడానికక్కడికొస్తే అదృష్టంకొద్దీ ఈ సుబ్బన్న తటసపడ్డాడు. జంబులింగం వ్యవహారం బయటపడింది.

"కాబట్టి నీ నోటితో నువ్వే చెప్పాలి" అన్నాడు శాస్త్రి.

"కళ్యాణిని చెడగొట్టడానికి ఓ మనిషిని నియోగించాడు జంబులింగం. ఆ మనిషి నేనుండగానే ఇంట్లో ప్రవేశించాడు" అన్నాడు సుబ్బన్న.

"ఎలా ప్రవేశించాడు? సుబ్బరామయ్య కూతుళ్ళల్లో లేరుగదా. దొడ్డితలుపులు తీసివుండే అవకాశంలేదు. కళ్యాణి అన్ని తలుపులూ వేసి బయట తాళంవేసి వుంటుంది" అన్నాడు శాస్త్రి.

"అది నిజమేనండి. ఆ మనిషి గోడదూకి దొడ్లోకీ, బాత్రూమ్‌ద్వారా ఇంట్లోకీ ప్రవేశించాలనుకున్నాడు. వాడు గోడ దూకేక ఓసారి బయటకు వచ్చి-దొడ్డితలుపు తీసే వుందని చెప్పాడు. అనుమానం వచ్చి చూడగా ఇంట్లోకి వెళ్ళడానికికూడా తలుపు తీసే వుంది. ఆశ్చర్య పోతూనే ఆ మనిషి ఇంట్లో ప్రవేశించాడు."

"కళ్యాణి అలా ఎందుకు చేసిందో? అంటే ఆమె కూడా ఏదో ఇలాంటి వ్యవహార ముండివుండాలి..." అన్నాడు శాస్త్రి

"అలాగని నేననుకోలేదు. జంబులింగం చెప్పిందాన్ని బట్టి ఆ అమ్మాయి చాలా తెలివైనది. జంబులింగం ఇలాంటి దేదో చేస్తాడని ఆమె ముందుగానే ఊహించి వుంటుంది. అందుకేదో ఎత్తువేసి వుంటుంది."

"అలా ఎందుకనుకుంటున్నావ్?"

"సుబ్బరామయ్యగారూరువదిలి పెట్టాక ఒక్క రాత్రి కూడా ఆమె ఇంట్లో నిద్రచేసినట్లు లేదు. ఏ స్నేహితురాలింటికో పోయి పడుకునేదనుకుంటాను."

"అంటే — చాలా రాత్రిళ్ళు కాపలా కాశావన్నమాట నువ్వు?"

"అవేం లేవండి! సుబ్బరామయ్య ఊరు వెళ్ళగానే జంబులింగం తన పథకాన్నమల్లో పెట్టాలని చూస్తున్నాడు. ఆ మనిషికి ఒక్క రాత్రికూడా కళ్యాణి దొరక లేదు. ఆఖరురాత్రి మాత్రం తలుపులూ అవీ ముందుగానే తీసి వున్నాయి."

"అన్ని రాత్రులూ వదిలి ఆఖరు రాత్రి మాత్రం నువ్వు కాపలా వున్నావంటే కారణం?"

"అంతా మీకు వివరంగా చెప్పేస్తానుండండి. కళ్యాణికి మంచి డిమాండ్ వుంది. జంబులింగం ఆమెద్వారా చాలా డబ్బు రాబట్టాలని చూస్తున్నాడు. అందుకనే సుబ్బరామయ్యను ఊరు ప్రయాణం కట్టించాడు. కళ్యాణికి సెలవు దొరక్కుండా చేశాడు. ఓ మనిషిని నియోగించి ఆమెను వశపర్చుకుందుకు చూశాడు.

రోజులు గడిచిపోయాయి కానీ వాడామెను వశం చేసుకోలేకపోయాడు. జంబులింగానికి వాడిమీద అనుమానం కలిగింది. ఓసారి బీచ్ వద్ద కళ్యాణిని భంగపర్చాలనుకున్నవాడికి ఆమె శ్రేయోభిలాషి ఒకడు బాగా దేహశుద్ధి చేశాడు. కళ్యాణి వంటిమీద ఈగ వాలినా సహించలేని అభిమానులు కొందరున్నారని పుకారుంది. సినిమా హాలువద్ద ఆమె భుజంమీద చేయివేసిన వాడికొకడికి ఇలాంటి భంగపాటే జరిగింది. అందుకని కొందరికి కళ్యాణి అంటే భయం!

తను నియోగించినవాడుకూడా ఇదేవిధంగా భయపడుతున్నాడేమోనని అనుమానం కలిగింది జంబులింగానికి. అందుకే ఆఖరురోజున ఆ ఇంటికి నన్ను కాపలా పెట్టాడు.

కళ్యాణి వచ్చేవరకూ వాడా ఇంట్లో వున్నట్టు నేను సాక్ష్యం అన్నమాట!" అన్నాడు సుబ్బన్న.

"నువ్వు దొడ్డివైపు కాపలాగదా! కళ్యాణి వీధివైపు నుంచి రావచ్చునుగదా! మరి ఆమె వచ్చినట్లు నీకెలా తెలుస్తుంది?" అన్నాడు శాస్త్రి.

"ఆమె రాగానే ఇంట్లో దీపాలు వెలుగుతాయి. కాబట్టి గుర్తించడం సులువే. అయితే నాకు ఏ శ్రమా లేకపోయింది. కళ్యాణికూడా ఇంటిలోపలికి దొడ్డిదారినే వెళ్ళింది."

శాస్త్రి ఆశ్చర్యంగా "తర్వాత?" అన్నాడు.

"తర్వాత కొద్దిసేపు వున్నాను. ఏ విశేషమూ జరుగలేదు. కళ్యాణి జంబులింగం మనిషికి లొంగిపోయిందనే అనుకుని వెళ్ళిపోయాను."

"ఇంకో రెండు రోజులు చూడకుండా ఆ రాత్రే నిన్నక్కడ కాపలాపెట్టడంలో జంబులింగం ఉద్దేశ్యమేమిటి?"

"మరేం లేదండి...మర్నాడు ఆమె అన్నయ్య వస్తున్నాడట..."

"ఓహో—" అనుకున్నాడు శాస్త్రి "ఆ మనిషెవడో చెప్పగలవా?"

"వాణ్ణి చూస్తే గుర్తుపట్టగలను కానండీ—పేరు చెప్పలేను. అయినా జంబులింగానికిగానీ, ఆ మనిషికిగానీ ఆ అమ్మాయిని చంపే ఉద్దేశ్యం లేదండి. తన ప్రాణాలొడ్డయినా సరే ఆ అమ్మాయి ప్రాణాలు కాపాడతారండి. ఎందుకంటే అలాంటి అమ్మాయి మళ్ళీ దొరకదని జంబులింగం అంటూండేవాడు."

జరిగిందేమిటో ఊహించడానికి ప్రయత్నిస్తున్నాడు

శాస్త్రి. ఆ రాత్రి జంబులింగం మనిషి కళ్యాణిని బలవంతంతంగా అనుభవించి వుంటాడు. ఆ అవమానాన్ని భరించలేక తన ప్రాణాల నంతం చేసుకుని వుంటుంది కళ్యాణి. ఆ మనిషి ఆమె చావును ఆత్మహత్యగా నిరూపించడానికి ప్రయత్నించి వుంటాడు. అందుకే ఓ చీటీ రాసి పెట్టి వుంటాడు. ఆ చీటీలోని దస్తూరీ కళ్యాణిది కాకపోవడానికి కారణమిదే అయుండాలి!

హత్యగానీ, ఆత్మహత్యగానీ_ కళ్యాణి చావుగురించి ఆ మనిషికి తెలిసుండాలి. ఆ మనిషెవరో సుబ్బన్నకు తెలుసు. కానీ వాడు చెప్పడు. ఈ విషయం మాత్రం వాడినుంచి రాబట్టడం కష్టం. ఎందుకంటే సుబ్బన్న నిజం చెబుతున్నాడో అబద్ధం చెబుతున్నాడో తనకూ తెలియదు.

శాస్త్రిని వేధిస్తున్న అనుమాన మింకొకటుంది. కళ్యాణి తెలివైనది. జంబులింగం వలలో పడకుండా తెలివిగా తప్పించుకుంటోంది. అటువంటి మనిషి ఆరోజు దొడ్డి తలుపులు ఎందుకు తెరచి వుంచింది? జంబులింగాన్ని మోసం చేయాలనుకుంటే ఆమె పథకం ఏమిటి?

బహుశా ఇంకో మనిషెవరైనా ఆమెకు తోడువస్తున్నారా? వస్తే ఆ మనిషి ఎవరు? అతడు ఎందుకు కళ్యాణిని రక్షించలేకపోయాడు?

శాస్త్రికి సమాధానాలు దొరకడంలేదు. హఠాత్తుగా అతనికి ఓ ఆలోచన వచ్చింది. సుబ్బన్నకు ధన్యవాదాలు చెప్పి అతనక్కణ్ణించి కదిలాడు.

## 9

“నమస్కారం, కూర్చోండి!” అన్నాడు జంబులింగం.

“కూర్చుంటాను కానీ మీకు చాలా అప్రియమైన

వార్త చెప్పడానికి వచ్చాను" అన్నాడు శాస్త్రి కూర్చుంటూ.

జంబులింగం పెద్దగా చలించలేదు. "చెప్పండి!" అన్నాడు.

"మీరు కళ్యాణిని హత్యచేయించినట్లు ఋజువైంది. విషయం ఇంకా పోలీసులదాకా వెళ్ళలేదు. నాకే తెలుసు" అన్నాడు శాస్త్రి.

"ఏ కళ్యాణి?" అన్నాడు జంబులింగం ఏమీ ఎరుగనట్లుగా.

శాస్త్రి వివరాలన్నీ చెప్పాడు. కానీ తను సుబ్బన్నను కలిసినట్లు చెప్పలేదు. "మీరు కళ్యాణిని చెరచడానికి నియోగించిన మనిషి విధిలేని పరిస్థితుల్లో ఆమెను చంపేశాడు. శవం పక్కనున్న దస్తూరీ అతని దస్తూరీతో సరిపోలింది. ఆ మనిషిని నేను కలుసుకుని మాట్లాడేను. మీరే ఆ హత్య చేయించారని చెప్పాడు. ఇంకా చాలా వివరాలు చెప్పాడు. మీరు సంఘంలో పెద్దమనిషి కాబట్టి పోలీసుల దగ్గరకు వెళ్ళేముందు మీ దగ్గరకోసారి వచ్చాను."

జంబులింగం ముఖం చిన్నబోయింది "శాస్త్రిగారూ! అనవసరంగా పోలీసుల లిస్టులోకి వెళ్ళడం నా కిష్టంలేదు. ఈ హత్య కేసులో నాకేవిధమైన సంబంధమూ లేదు. నన్ను నమ్మండి" అన్నాడు.

"తప్పకుండా నమ్ముతాను. కానీ సాక్ష్యాలు కావాలి."

"నా మనిషి కళ్యాణి ఇంటికి వెళ్ళినమాట నిజం. కానీ కళ్యాణి రాకముందే అక్కడకింకో మనిషి వచ్చాడు."

"ఎవరా మనిషి?"

"మమ్మల్నందర్నీ మించినవాడు. నగరంలోని పోలీసు

లకు సింహస్వప్నం. రామచంద్రం!" అన్నాడు జంబులింగం.

"ఎలా తెలుసు?"

"నా మనిషి చెప్పాడు. అతన్ని చూడగానే నా మనిషికి కాళ్ళూ చేతులూ ఆడలేదు. తన తరఫునా, నా తరఫునా క్షమార్పణలు చెప్పి అక్కణ్ణించి బయట పడ్డాడట..."

"రామచంద్రాన్ని కలుసుకోవడం ఎలా?"

"నాకు తెలియదు."

రామచంద్రం ఎలా వుంటాడో, ఎక్కడ వుంటాడో పోలీసులకు తెలియదు. కానీ గత కొన్ని సంవత్సరాలుగా వారు అతనికోసం వెతుకుతున్నారు. అయితే కళ్యాణికీ, రామచంద్రానికీ సంబంధం ఏమిటి?

రామచంద్రం ఆమెకు ఎలా తెలుసు? అతడు గొప్ప నేరస్థుడని ఆమెకు తెలియదేమో—అతడినామె ప్రేమించిందేమో—ఏదో పొరపాటున అతడు నోరుజారి తన గురించి చెప్పగానే పోలీసులకు పట్టి ఇస్తానని ఆమె బెదిరించిందేమో—అప్పుడు రామచంద్రం...

శాస్త్రి తన ఊహాశక్తిని అభినందించుకున్నాడు' బహుశా ఇలాగే జరిగివుంటుంది. లేకపోతే కళ్యాణి ఎందుకు చనిపోతుంది?

ఒకవేళ రామచంద్రం ఆమెను హత్యచేసి వుండకపోతే, కళ్యాణికి అతడిగురించిన నిజం తెలిసేక జీవితమంటే విరక్తికలిగి ఆత్మహత్య చేసుకున్నదని అనుకోవాలి!

ఏది ఏమైనా తనిప్పుడు అర్జంటుగా రామచంద్రాన్ని కలుసుకోవాలి. ఏళ్ళతరబడి గాలిస్తున్నా పోలీసులకు దొరకని ఆ రామచంద్రం తనకు దొరుకుతాడా?

శాస్త్రి అక్కణ్నించి బయటపడ్డాక బుర్రలో మెరుపులా ఏదో మెరిసింది. కమలాకరానికి కళ్యాణి పరిచయస్తులందరూ తెలిసి వుంటారు. అతన్నా వివరాలడిగితే రామచంద్రం గురించి తెలియవచ్చు.

# 10

తలుపు తట్టాడు కానీ జారగిలవేసుందని గ్రహించి నెమ్మదిగా తోశాడు శాస్త్రి. ఎదురుగా కనబడ్డ దృశ్యం చూసి అతను స్తంభించిపోయాడు.

కమలాకరం నేలమీద పడివున్నాడు. గదిలో కప్పుకు వున్న కొక్కానికి ఒక తాడు వేలాడుతోంది. బాగా పరీక్షించగా అతడికి అర్థమైనదేమిటంటే కమలాకరం ఆత్మహత్యా ప్రయత్నం చేశాడనీ — మధ్యలో తాడు తెగి క్రిందపడి తలకు గాయంతగలగా స్పృహతప్పి పడిపోయాడని.

ఇది కమలాకరం చేసిన ఆత్మహత్యా ప్రయత్నమో, లేక ఎవరైనా అతన్ని హత్యచేయడానికి ప్రయత్నించి ఇలా నిరూపించడానికి ప్రయత్నించారో?

రెండోదే నిజమైతే ఈ పని రామచంద్రం చేసి వుండాలి. జంబులింగానికీ రామచంద్రానికీ పెద్ద సంబంధముండి వుండాలి.

అప్పుడే శాస్త్రి దృష్టిని అక్కడ టీపాయ్‌మీద పేపరువెయిట్ క్రింద వున్న కాగితం ఆకర్షించింది. దాని మీద ఒకే ఒక్క వాక్యం వ్రాసివుంది.

"ఇది ఆత్మహత్య!"

శాస్త్రి ఆ కాగితం చూసి ఉలిక్కిపడ్డాడు. నిస్సందేహంగా ఈ కాగితంమీది అక్షరాలూ, కళ్యాణి శవం పక్కనున్న కాగితంమీది అక్షరాలూ ఒకేవ్యక్తి రాసినవి.

దస్తూరీ గురించి సుధాకర్ పదేపదే చెప్పడంవల్ల అతను ప్రత్యేకంగా పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి ఆ కాగితంమీది అక్షరాలు చూసి గుర్తుపెట్టుకు వచ్చాడు.

ఈ దస్తూరీ ఎవరిది? కమలాకరానిదా, రామచంద్రానిదా లేక జంబులింగానిదా?... ఈ కేసును సాధించడానికిది చాల ముఖ్యమైన క్లూ!

శాస్త్రి వెళ్ళి కమలాకరానికి స్పృహ తెప్పించడానికి ప్రయత్నించాడు. అతని కృషిఫలించి అయిదు నిముషాల్లో కమలాకరానికి స్పృహ వచ్చింది.

"మిమ్మల్ని కొట్టిందెవరు?" అనడిగాడు.

"నన్నెవ్వరూ కొట్టలేదు. నా దురదృష్టంకొద్దీ ఆత్మహత్యా ప్రయత్నం ఫెయిలయింది. నా కళ్యాణి లేని బ్రతుకు శూన్యమనిపిస్తోంది. అందుకే..."

"అబద్ధం..." అన్నాడు శాస్త్రి—"ఈ కాగితంమీది దస్తూరీ మీదికాదు."

"అది నాదేనని ఈ క్షణంలో ఋజువు చేస్తాను..." అంటూ కమలాకరం అదే వాక్యం అప్పటికప్పుడు మళ్ళీ రాశాడు. దస్తూరీ సరిపోయింది.

"రైట్. మీరు ఆత్మహత్య చేసుకున్నారని నమ్ముతున్నాను. అలాగే కళ్యాణిని మీరే హత్యచేశారనికూడా నిరూపించగలను—"

కమలాకరం చటుక్కున లేచి నిలబడి శాస్త్రిని బలంగా కొట్టాడు — "ఈ రహస్యం తెలిసిన నిన్ను బ్రతకనివ్వను" అన్నాడతను.

కమలాకరం దెబ్బకు తమాయించుకోవడమే కాక, అతడిని బలప్రయోగంతో అదుపులోకి తీసుకురావడానికి శాస్త్రికి ఎంతోసేపు పట్టలేదు.

"శాస్త్రి గారూ! మీకు నేను చేతులెత్తి మొక్కుతాను. కళ్యాణి గురించిన ఈ నిజం ఎవ్వరికీ చెప్పవద్దు. కళ్యాణి చనిపోయిన రాత్రి నేనామెను అనుసరిస్తూ కాలం గడిపాను. ఆమెతోపాటు ఆమెకు తెలియకుండా వాళ్ళింటి దొడ్డిదారిన ఇంట్లో ప్రవేశించాను. అక్కడ ఆమె నిజస్వరూపం బయటపడింది.

కళ్యాణి విలాస జీవితానికి బానిస అన్న కఠోరసత్యం అప్పుడే నాకు తెలిసింది.

ఆమె అప్పుడు రామచంద్రంతో వుంది. అతడెవరో నాకు తెలియదు కానీ వాళ్ళ సంభాషణ విన్నాక వివరాలు తెలిశాయి. రామచంద్రంతో ఆమె చాలా విచ్చలవిడిగా ప్రవర్తించింది. అతడితోమాత్రమేకాక అతడిలాంటివాళ్లు చాలామందితో ఆమెకు అక్రమసంబంధ మున్నదని వాళ్ళ సంభాషణ నాకు తెలియజెప్పింది. ఆముఠాలకు స్మగ్లింగ్ వ్యవహారాల్లో ఆమె సాయంచేస్తోంది.

తనను చాలామంది ప్రేమిస్తున్నామంటున్నారనీ, పెళ్ళి చేసుకోవడం తన కిష్టంలేదనీ కళ్యాణి ఆ రామచంద్రంతో అంటూంటే నేను సహించలేకపోయాను.

అప్పటికప్పుడు దొడ్డిదారిన బయటకు వెళ్ళి విషం తీసుకువచ్చాను. రామచంద్రం వెళ్ళిపోయేవరకూ ఆగి కళ్యాణి తాగే మంచినీళ్ళ గ్లాసులో ఆ విషం కలిపాను. కళ్యాణి మంచినీళ్ళు తాగేవరకూ రహస్యంగా వేచి వున్నాను. ఆమె మంచినీళ్ళు త్రాగింది. క్షణంలో ఆమె ప్రాణం పోయింది. ఆమెది ఆత్మహత్య అని ఓ కాగితం రాసిపెట్టి అక్కణ్ణించి వచ్చేశాను.

కళ్యాణి నేననుకున్న విధంగా దేవతకాదనీ, సైతాన్ అనీ తెలియగానే ఆమెను చంపాలనుకున్నాను. కళ్యాణి

పోయాక నాకూ బ్రతకాలని లేదు. కానీ కళ్యాణి కులట అని ఈ ప్రపంచానికి తెలియదు. ప్రేమించినందుకు నేనా మెకు చేయగల ఉపకారమదొక్కటే. అందరూ కళ్యాణి నిప్పులాంటి మనిషి అనుకోవాలి. అందుకే వెంటనే నా ప్రాణాలు తీసుకోలేదు.

మిమ్మల్ని నేను కోరేది ఒక్కటే. కళ్యాణి గురించి మీరు కనుగొన్న వివరాలు ఎవరికీ చెప్పకండి. ఆఖరికి ఆమె అన్న సుధాకర్‌కి కూడా! అతడికి కళ్యాణి తప్ప వేరే లోకం లేదని విన్నాను. మీ కబురువింటే అతడు గుండెపగిలి చస్తాడు. కావాలంటే ఎంత డబ్బయినా మీకు ఫీజుగా ఇచ్చుకుంటాను. కళ్యాణి కులట అని ఈ లోకానికి తెలియనివ్వకండి.''

''మిస్టర్ కమలాకరం! ఈ విషయం నేను పోలీసులకు చెప్పను. కానీ సుధాకర్‌కి చెప్పడం నా విధి. అతని కోరికమీద నే ఈ కేసును చేపట్టాను. నువ్వు హంతకుడివి కాబట్టి ఎన్ని కల్లబొల్లి కబుర్లైనా చెబుతావు. నువ్వే నిజంగా కళ్యాణిని ప్రేమించి వున్నట్లయితే ఆమె తప్పులను క్షమించి వుండేవాడివి. ఆమె శీలంమీద వున్న ప్రేమ ఆమెపై లేదు నీకు. అన్న విషయం అలా కాదు. చెడిపోయినా కడుపులో పెట్టి చూసుకుంటాడు చెల్లెల్ని-నేనీ విషయం సుధాకర్‌కి చెప్తాను'' అంటూ అక్కణ్ణించి కదిలాడు శాస్త్రి.

కమలాకరం హత్య చేశాడని కలలోకూడా ఊహించ లేదు శాస్త్రి. అలాగే కళ్యాణి కులట అని అనుకోలేదు. కేసు ఈ విధంగా కొత్తమలుపు తిరగడం అతనికి చాలా ఆశ్చర్యంగా వుంది.

తర్వాత సుధాకర్‌కి ఓ ఉత్తరం రాసి తన పరిశోధన వివరాలను రిజిస్టర్డు పోస్టులో పంపాడు శాస్త్రి. వారం రోజుల్లో శాస్త్రికి రిజిస్టర్డు పోస్టులో పన్నెండు వేల రూపాయలకు డ్రాఫ్టు వచ్చింది. అందులో ఉత్తరం ఏమీ లేదు.

మరి వారంరోజులకు కమలాకరం హత్యచేయబడ్డాడు. ఇంకో రెండ్రోజులకు సుధాకర్ శవం ఊరి చివర దొరికింది. ఆ మర్నాడు శాస్త్రికి ఉత్తరం వచ్చింది. అది సుధాకర్ దగ్గర్నుంచి.

"నా చిట్టి చెల్లెల్ని చంపిన దుర్మార్గుణ్ణి హత్యచేశాను. నా చిట్టిచెల్లెలు కులట అని తెలిసి మరి బ్రతకలేక ప్రాణం తీసుకుంటున్నాను. దయ వుంచి నా కథనూ పోలీసులకు చెప్పకండి!"

ఉత్తరంలోని సారాంశమిది.

* * *

ఇనస్పెక్టర్ శేఖర్ శాస్త్రివంక చూసి—"కళ్యాణి మరణం గురించి ఇదివరలో మీరు కొంత పరిశోధించినట్లు తెలిసింది. కమలాకరం హత్య, సుధాకర్ ఆత్మహత్యలకు ఆ కేసులో సంబంధముందనుకుంటున్నాను. ఈ పరిశోధనలో మీ సహకారం ఆశిస్తున్నాను" అన్నాడు.

"క్షమించండి ఇనస్పెక్టర్—నేను డిటెక్టివ్ వృత్తి మానుకున్నాను."

శేఖర్ నివ్వెరబోయారు. అతనెంత అడిగినా శాస్త్రి నుంచి వేరే జవాబు రాలేదు. నిరుత్సాహంగా వెళ్ళిపోయాడతను.

శాస్త్రి భార్య వెంకటరమణ భర్త నిర్ణయానికి చాలా ఆనందించింది. అయితే రమణమూర్తి మాత్రం నిరుత్సాహ పడ్డాడు.

"ఒక హత్యకేసు పరిశోధిస్తే ఒక నేరస్తుణ్ణి పట్టుకో వచ్చనుకున్నాను. కానీ నా పరిశోధన ఒక అమాయ కుడిని హంతకుడిగా మార్చడమే కాక అతడి ప్రాణాన్ని బలిగొంది" అన్నాడు శాస్త్రి బాధగా.

రమణమూర్తి, శాస్త్రి ఇప్పుడు ఉద్యోగప్రయత్నాల్లో వున్నారు.

—: అయిపోయింది :—

# రత్న కిరీటం !

## విద్వాన్ వై. సురేంద్రనాథరెడ్డి

చలిగాలి రివ్వున వీస్తోంది.

విపరీతంగా మంచు కురుతోంది.

ఇళ్ళమీదా, మేడలూ మిద్దెలపైనా, చెట్లూ, చేమల మీదా, నేలమీదా తెల్లటి దుప్పటి పరచినట్టుగా మంచు పడి పేరుకుపోతోంది.

కొలంబో సిటీకి వెలుపలగా పెద్ద మైదానంలో విశాల మైన బంగళా అది. చుట్టూ కాంపౌండ్ వాల్, ఎత్తుగా పెరిగిన పైన్ చెట్లు బంగ్లా రూపాన్ని మరుగుపరు స్తున్నాయి.

బంగ్లా లోపల—

ఫైర్ ప్లేస్ ముందు కూర్చొని విస్కీ సిప్ చేస్తున్నాడు విలియం గోపల్లన. అతని కెదురుగా ముగ్గురు వ్యక్తులు... ఇద్దరు పురుషులు, ఒక స్త్రీ కూర్చొనున్నారు.

ఒక ప్రక్కనున్న కిటికీ దగ్గరగా ఫెర్నాండో నిల బడున్నాడు. విండో గ్లాసుగుండా బయట చూస్తున్నా

డతను. విండో గ్లాసుగుండా పల్చగా కన్పిస్తోంది స్నో ఫాల్.

ఫెర్నాండో నడుముకు వెడల్పాటి బెల్టు వుంది. దాని కిరువైపులా కేసుల్లో రివాల్వర్లు వ్రేలాడుతున్నాయి.

ఫెర్నాండో—విలియం గోపల్లవ బాడీగార్డ్.

త్రాగడం ఆపి, ఒకసారి ఎదురుగా కూర్చొన్న వారి వైపు చూశాడు గోపల్లవ.

"మీరొక ఆపరేషన్‌లో పాల్గొనాలి" అన్నాడు చేతిలోని ఖాళీగ్లాసు ఎదురుగా వున్న బల్లపై పెట్టి.

"వివరాలు కావాలి, ఎటువంటి ఆపరేషన్, ఏ దేశంలో"—మగవాళ్ళలో ఒక వ్యక్తి అడిగాడు.

సిగార్ వెలిగించుకున్నాడు గోపల్లవ.

"చాలా ప్రమాదకరమైన పని. ప్రాణాలకు తెగించాల్సి వుంటుంది; అతి పురాతనమైన ఓ రత్న కిరీటం సంపాదించుకురావాలి మీరు. అది ప్రస్తుతం ఇరాన్ దేశంలోని అడవుల్లో నివసించే ఓ ఆటవిక తెగ ఆధీనంలో వుంది."

"కిరీటమా!" అప్రయత్నంగా అన్నారు మిగిలిన శ్రోతలు.

చిన్నగా నవ్వాడు గోపల్లవ.

"అవును రత్న కిరీటం. దాని నెలాగైనా సంపాదించుకు రావాలి మీరు."

'ఆల్ రైట్!" ఆ వ్యక్తి అన్నాడు. "మనం ఆ విషయంగా ఒక ఒప్పందానికొద్దాం. మీకు పని జరగాలి, మాకు డబ్బు కావాలి. ఈ ఆపరేషన్‌కు సంబంధించిన పూర్తి విషయాలు తెల్సుకోవాలనుంది."

"ఫెర్నాండో!" పిలిచాడు గోపల్లవ నెమ్మదిగా.

ఆరున్నర అడుగుల ఎత్తున్న ఫెర్నాండో విండో పక్క నుంచి కదిలాడు. అతను నడుస్తుంటే, నడుము కిరువైపు తోలు కేసుల్లో వున్న రివాల్వర్లు బరువుగా వూగుతున్నాయ్.

గోపల్లవ ప్రక్కకొచ్చి నిల్చున్నాడు ఫెర్నాండో. "యస్ సర్" వినయంగా అన్నాడు.

"ఇరవై రోజులు శ్రమపడి ఈ క్రిమినల్స్‌ని తీసుకొచ్చావు. వీరి వివరాలు తెల్సుకోవాలని వుంది" ఎదురుగా వున్న వ్యక్తులను మార్చి మార్చి చూస్తూ అన్నాడు గోపల్లవ.

చెప్పటం ప్రారంభించాడు ఫెర్నాండో.

"అతని పేరు మిల్కాఖాన్. భారతదేశంలోని మధ్యప్రదేశ్ రాష్ట్రంలో పుట్టి పెరిగాడు. అతని తండ్రి బందిపోటు కావడంతో ఆ లక్షణాలు మిల్కాఖాన్‌కూ వచ్చాయి. గుఱ్ఱపుస్వారి, ముష్టియుద్ధం, రైఫిల్ షూటింగ్ లలో ప్రవీణుడు. ఓ దోపిడీ సమయంలో పోలీస్ కాల్పుల్లో మరణించాడు అతని తండ్రి. పోలీసుల్ని తప్పించుకు బయటపడ్డ ఖాన్ ఎన్నో వేషాలు మార్చాడు. మొదట డబ్బు, తర్వాత స్త్రీ అతని కిష్టమైన వస్తువులు. ఆ రెండింటికోసం ఏమిచేయడానికైనా వెనుదీయని మనిషి!",

వూపిరి పీల్చుకొని మిల్కాఖాన్ ప్రక్కనేవున్న వ్యక్తిమీదకు దృష్టి సారించాడు ఫెర్నాండో.

సిగార్ పీలుస్తూ మౌనంగా వింటున్నాడు గోపల్లవ.

"ఆమె పేరు రీనాజరీనా. రీనా అని పిలుచుకోవడం ఆమెకు ఇష్టం. భయము, పాపము అనే పదాలకు ఆమె కర్థం తెలీదు. ప్రత్యర్థిని నమ్మించి మోసం చేయడంలో ప్రవీణురాలు. ఆమె తండ్రి చర్మ వ్యాపారి.

రీనా విలా సాలకు చాలినంత ధనం లభించకపోవడంతో పది హేడేళ్ళ వయస్సుకే ఖరీదైన మనుషులకు విలాస వస్తువుగా మారింది. తన మానంకంటె ప్రాణం ఎక్కువ ఆమెకు. తన ప్రాణంకోసం ఎందరినైనా బలిచెయ్యడానికి వెనుకాడదు. మొదట డబ్బు, ఆ తర్వాత తనని ప్రేమించే మన సత్వం కలది. గ్రేట్ కన్నింగ్ లేడి"

జరీనా ప్రక్కనున్న వ్యక్తివైపు మారాడు ఫెర్నాండో.

"సన్ ఆఫ్ ఆస్ట్రేలియాను గుర్తుకు తెప్పిస్తున్న ఇతని పేరు శాంసన్. ఒట్టి చేతులతోనే మనిషిని రెండుగా విరిచెయ్యగలడు. ఇతనికి తిండి, ఫైట్స్ తప్ప వేరే విషయాలపై ఆసక్తి తక్కువ.

టెక్సాస్‌లో పుట్టాడు. చదువుకొనే రోజుల్లోనే బాక్సింగ్ పోటీలో ప్రత్యర్థిని చంపేశాడు. కావాలని చంపకపోయినా అతన్ని సంఘం హంతకుణ్ని చేసింది. చదువుమాని స్మగ్లింగ్‌లో దిగాడు. అమెరికా ప్రభుత్వం స్మగ్లర్స్‌కోసం వేట ప్రారంభించగానే మెక్సికో పారిపోయాడు. ప్రస్తుతం అమెరికన్ ప్రభుత్వం ఇతనికోసం అన్వేషిస్తోంది."

ఫెర్నాండో మాటలు ఆపేసరికి ఆరిపోయిన సిగార్‌ను అవతల పారవేసి క్రొత్త సిగార్ వెలిగించుకున్నాడు గోపల్లవ.

"డియర్ క్రూక్స్" మాట్లాడటం మొదలుపెట్టాడు గోపల్లవ.

"మీలో బాటు నేనుకూడా క్రూక్‌నే. ఆ మధ్య భారతదేశంలో జరిగిన దోపిడీ, స్మగ్లింగ్ వ్యవహారాలలో షంషేర్ అనే వ్యక్తి ముఖ్యపాత్ర వహించాడు. ఆ

విషయం మీకు తెలిసే వుంటుంది ఎందుకంటే అందరం ఒకే కోవకు చెందినవాళ్ళం కనుక'' చిన్నగా నవ్వుతూ అన్నాడు గోపల్లవ.

''ఆ మంషేర్ ఎవరో కాదు నేనే! భారతదేశం స్మగ్లర్స్‌ని ఏరివెయ్యడం మొదలుపెట్టగానే నేను సింహళ ద్వీపానికి పారిపోయి వచ్చాను. నా పేరు విలియంగోపల్లవ. ఇకపోతే, ఆపరేషన్‌లో పాల్గొనటానికి మీరు సిద్ధంగా వున్నారో, లేదో నాకు తెలియాలి!''

మాటలు ఆపి, బలంగా సిగార్ పొగ పీల్చి వదిలాడు గోపల్లవ.

చిన్నగా దగ్గింది రీనా జరీనా.

''మా కివ్వబోయే డబ్బు మాటేమిటి?'' అడిగింది.

''ఆ విషయంగా మీరు బాధపడాల్సిన పనిలేదు. ఒక్కొక్కరికి లక్ష అమెరికన్ డాలర్లు ఇవ్వటానికి సిద్ధంగా వున్నాను. అడ్వాన్సుగా పదివేల రూపాయలు ఇవ్వగలను. ఆ రత్నకిరీటం తీసుకొచ్చి నాకప్పగించగానే ఒప్పందం ప్రకారం మిగిలిన పైకం ఇచ్చేస్తాను.''

''అడ్వాన్సు క్రింద మీరు ఇస్తానన్న పైకం చాలా తక్కువ'' మిల్కాఖాన్ అన్నాడు.

''అడ్వాన్సు పైకంతో మీరు పారిపోయినా... పదివేలు నాకు లెక్కలోది కాదు. అంతకంటే ఎక్కువ నష్టం భరించడానికి నాకిష్టంలేదు'' చిన్నగా నవ్వుతూ అన్నాడు గోపల్లవ.

''మిస్టర్ విలియం గోపల్లవా! ఆ కిరీటంకోసం మీరు చాలా శ్రమ తీసుకుంటున్నారు. ఇది నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ఏమిటా రత్నకిరీటంలోని ప్రత్యేకత?'' అడిగాడు కాంసన్.

"ఆ కిరీటంలో చాలా ప్రత్యేకత వుంది. నేను భారత దేశంలో స్మగ్లింగ్ వృత్తిలో అనేక ప్రాంతాలు తిరిగాను. రాజస్థాన్, జైపూర్, ఆగ్రా, బికనీర్, మొదలగు చోట్ల ఎన్నో రోజులు గడిపాను. అప్పుడు తెలిసింది ఆ కిరీటం విషయం."

"ఏమిటా విషయం?" కుతూహలంగా అడిగాడు మిల్క్ ఖాన్.

బయట మంచు నిర్విరామంగా పడుతోంది. ఫైర్ ప్లేస్ లోని కట్టెలు కణకణ మండుతున్నాయి.

చ్రైఫ్ సిగార్ వెలిగించుకున్నాడు గోపల్లవ. గొంతు సవరించుకొని చెప్పడం ప్రారంభించాడు.

"భారతదేశ చరిత్రలో రాజపుత్రులు గొప్ప భక్తి పరులుగాను, మహావీరులుగానూ వర్ణింపబడ్డారు. 1526లో బాబర్ భారతదేశంపై దండయాత్ర జరిపి మొగల్ వంశ స్థాపన చేసినట్లు చరిత్ర చెపుతోంది.

బాబర్ దండయాత్రకు పూర్వము రాజపుత్ర రాజ్యము నకు కేంద్రమైన మేవాడ్ గుహిళ వంశస్థుడైన రాణా సంగ్రామసింహుని నాయకత్వంలో వుండేది. సంగ్రామ సింహునికి నూటనాలుగు మంది రాజపుత్ర నాయకులు సామంతులుగా వుండేవారు. అంగబలంలోను ఆత్మబలం లోనుకూడా సంగ్రామసింహుడు మేటి.

రాణా కాలంలో భారతదేశమున మత కలహాలు ఎక్కువగా వుండేవి. సుల్తానులతోబాటు, రాజపుత్రులు కూడా పరస్పర వైరాలతో తరచూ యుద్ధాలలో మునిగి వుండేవారు. మత భేదాల కారణంగా నైతేనేమి, రాజ్య సంబంధమైన కారణాలవల్ల నైతేనేమి సంగ్రామసింహు నకు ఢిల్లీ సుల్తానులకు వైరమేర్పడింది.

సుల్తానులతో జరిగిన అనేక యుద్ధాలలో సంగ్రామ సింహుడు రాజ్యముతో బాటు ఒక కన్నూ, కాలు, చేయి పోగొట్టుకొని అడవులపాలైనాడు.

గాయపడివున్న సంగ్రామసింహుడు మిగిలిన కొంత మంది అనుచరులతో సుల్తానుల కళ్ళబడకుండా ఎలాగో తప్పించుకోగలిగాడు.

రాజ్యంతో బాటు ఓ రత్న కిరీటంకూడా దొరికింది సుల్తానులకు ఆ ముట్టడిలో.

తర్వాత ఢిల్లీ సుల్తానుల్లో అంతఃకలహాలు పెరగడం వల్ల భారతదేశం బాబరు వశమైంది.

బాబర్ తర్వాత ఎంతోమంది భారతదేశాన్ని పరిపాలించారు. ఆ కిరీటం ఎలా మారిందో, ఎలా చెదిరిందో. ప్రస్తుతం అది ఇరాన్ అడవుల్లో నివసించే ఓ ఆటవికుల స్వాధీనంలో వుందని తెలిసింది'' చెప్పడం ఆపాడు గోపల్లవ.

''అది మామూలు రాజకిరీటమేకదా! మరి దానికోస మెందుకింత శ్రమపడుతున్నారు?'' ప్రశ్నించింది రీనా జరీనా.

''మామూలు కిరీటంకాదది. కింబర్లీ గనుల్లో దొరికే వజ్రాలకన్నా అత్యుత్తమమైన వజ్రాలు, రత్నాలు పొదగ బడి వున్నాయి దానిలో. పైగా సంగ్రాముని ప్రతిమ ఆ కిరీటంలో చెక్కబడి వుంది. చరిత్ర ప్రసిద్ధిపొందిన మహా వీరుడైన రాణా సంగ్రామసింహుడు ధరించిన ఆ రత్న కిరీటం కావాలి నాకు. దాని విలువ అంచనా వెయ్యడం అసంభవమని నా నమ్మకం.''

దీర్ఘంగా గాలి పీల్చి వదిలాడు ఖాన్.

"మీ కోరిక వింటూంటే నాకు జంకు వేస్తోంది. కిరీటం నిజంగా ఆటవికుల స్వాధీనంలో వుందనే అనుకుందాం. కానీ వారు పవిత్రంగా చూసుకొనే వస్తువులు ఎవరైనా కాజెయ్యటానికి ప్రయత్నించి పట్టుబడితే, వారిపట్ల ఆటవికుల ప్రవర్తన ఏవిధంగా వుంటుందో వూహించడానికే ధైర్యం చాలటంలేదు. ఇది సాధారణమైన ఆపరేషన్ కాదు" నెమ్మదిగా అంది రీనా.

"కిరీటం అధీనంలో వుంచుకొన్న ఆటవిక తెగ పేరేమిటి?" ప్రశ్నించాడు శాంసన్.

"ఆ కిరీటాన్ని ప్రాణపదంగా చూసుకుంటున్న ఆటవిక తెగ పేరు బాంగో. సంచార జీవనులైన బాంగోలు ఇప్పుడు ఇరాన్ అడవుల్లో స్థిరనివాస మేర్పరచుకొన్నారు."

"ఆ కిరీటం ఎలాగో కష్టపడి మేం తెచ్చినా, మీరు నకిలీదని చెప్పి మమ్మల్ని మోసం చెయ్యరని ఏమిటి నమ్మకం?" తన సందేహం వెలిబుచ్చింది జరీనా.

"మిమ్మల్ని మోసంచేసే ఉద్దేశ్యం నాకు లేదు. పొరబాటునకూడా మీకు ద్రోహం జరుగనివ్వను. నా బాడీ గార్డ్ ఫెర్నాండో మంచి ఫైటర్. కుంగ్ ఫూ, కరాటే, జూడో ఫైట్స్‌లో ప్రవీణుడు. షూటింగ్ ఎక్స్‌పర్ట్. అతనుకూడా మీ వెంట వస్తాడు. ఆ కిరీటం నకిలీదో, కాదో ఫెర్నాండో అక్కడే చెప్పగలడు. పైగా దాని పైన సంగ్రామసింహుని ప్రతిమ చెక్కబడి వుందన్న విషయం మర్చిపోవద్దు" చెప్పడం ఆపి, అందరినీ కలియజూశాడు గోపల్లవ.

"ఇప్పుడు చెప్పండి, ఆపరేషన్‌లో పాల్గొనడానికి మీరు సిద్ధంగా వున్నారా!" అడిగాడు తిరిగి.

ఎవరూ పెదవి విప్పలేదు. ఆపరేషన్ కష్టతరమైందని, ప్రాణాంతకమైందని తెలుస్తూనే వుంది. ఆపరేషన్‌లో పాల్గొనడం తమ కిష్టంలేదంటే, దానికి సంబంధించిన అన్ని విషయాలు వెల్లడించిన తర్వాత గోపల్లవ తమను ప్రాణాలతో వదలడని తెలియని మూర్ఖులేమీ గాదు క్రూక్స్ ముగ్గురూ.

"మిస్టర్ గోపల్లవా, ఆపరేషన్‌లో పాల్గొని ఎలాగైనా ఆ కిరీటం తీసుకురావటానికే ప్రయత్నిస్తాం" తమ అంగీకారాన్ని తెల్పారు క్రూక్స్.

"వెల్, కిరీటం తీసుకురాగలిగితే మూడు... ఇంకొక లక్ష మొత్తం నాలుగులక్షల డాలర్లు మీ పరమవుతాయ్" ఆశచూపాడు గోపల్లవ.

"ఇరాన్ అడవులగురించి మాకు తెలిసింది తక్కువ. గైడ్ లేకుండా క్రొత్త అరణ్యాల్లోకి ప్రవేశించడం తెలివితక్కువ. ఆ ఏర్పాట్లు మీరు చెయ్యగలరా" అడిగింది రీనా.

"డోంట్‌వర్రీ. గైడ్ ఏర్పాట్లు, మిగిలిన విషయాలు ఫెర్నాండో చూసుకుంటాడు. వేరే యేదైనా సందేహాలుంటే అడగండి."

"కిరీటం తీసుకొని రాగలిగితే మిమ్మల్ని ఎక్కడ కలుసుకోవాలి. పోలీసులను తప్పించుకు తిరుగుతున్న మీరు ఒకేచోట స్థిరంగా వుండగలరని నేననుకోను" అడిగాడు జాంసన్.

"నాగురించి మీరు వర్రీకానవసరంలేదు. సరిగ్గా ఇరవై రోజుల తర్వాత నేను టెహరాన్‌లో వుంటాను. నేనే అప్పటి పరిస్థితుల కనుగుణంగా మిమ్మల్ని కలుసుకోనేందుకు ప్రయత్నిస్తాను."

"ఓ. కే. ఇక మా ప్రయాణంలో మేముంటాను."

# 2

టెహరాన్ విమానాశ్రయం నుండి కస్టమ్స్ గొడవ వదిలించుకొని బయటకొచ్చారు ట్రూక్స్ నలుగురూ.

అందరికంటె వెనుక ఎయిర్‌పోర్టునుండి బయటపడిన ట్రూక్ శాంసన్. భుజాన ఎయిర్ బాగ్‌తో బరువుగా అడుగులేస్తున్నాడు.

మిగిలిన వాళ్ళు మిల్కాఖాన్, ఫెర్నాండో, జరీనా టాక్సీలో నగరం మధ్యనవున్న హోటల్ ఇషారా చేరుకున్నారు.

టూరిస్టుల సౌకర్యార్థం నిర్మింపబడిన ఇషారా ఫైవ్ స్టార్ హోటల్. సకల సౌకర్యాలు వున్నాయ్.

రూంలోకి ప్రవేశించిన రీనా బద్ధకంగా వొళ్ళు విరచుకొంది. గదంతా ఓమారు కలియజూసింది.

నేలంతా మెత్తని తివాచీ పరచివుంది. ఒక ప్రక్క రోజ్‌వుడ్ డబుల్‌కాట్. పైన ఫోంబెడ్. ఖరీదైన సోఫాసెట్. మరోవైపు మహాగని చెక్కలతో చేయబడ్డ పెద్ద టేబుల్. దాని వెనుకగా రివాల్వింగ్ చైర్. గోడలకు ఇరాన్ సుందరీమణుల అర్ధనగ్న చిత్రాలు. గది ప్రతి అంగుళమూ రిచ్‌నెస్ వుట్టిపడుతోంది.

కారిడార్‌వైపున్న డోర్ లాక్‌చేసి, ఎయిర్‌బాగ్‌ను మంచం మీదకు విసిరి బాత్రూంవైపు నడచింది రీనా.

పదిహేను నిముషాల్లో స్నానం ముగించుకొచ్చింది. డ్రస్ చేసుకొని పైన మోకాళ్ళదాటే కోటు ధరించింది. కోటులోపలి జేబులో జపాన్ మోడల్ ఆటోమాటిక్ దాచుకుంది.

మగాడిని మత్తెక్కించే అందం జరీనా సొత్తు. ముఖానికి క్రీం రాసుకొని టాయ్‌లెట్ స్టాండు ముందునుంచి వెనుదిరిగింది.

ఇంతలో కాలింగ్ బజ్జర్ మ్రోగింది.

గుమ్మంవైపు అడుగులేసింది రీనా. లాక్ తీసి తలుపు తెరిచింది.

తలుపు తోసుకుంటూ లోనకొచ్చాడు మిల్కాఖాన్.

తలుపు మూసి, తిరిగి లాక్ చేసింది రీనా.

"నా రాక నీకేమైనా అంతరాయం కలిగించిందా!" సోఫాలో కూర్చుంటూ అన్నాడు మిల్కాఖాన్.

"ఫెర్నాండో యేమి చేస్తున్నాడు?" ఎదురు ప్రశ్నించింది రీనా జరీనా.

"ఇపుడా వెధవ ప్రస్తావన ఎందుకు?" విసుగ్గా అన్నాడు ఖాన్.

"వ్వాట్?"

"లేకపోతే యేమిటి! వాణ్ణి మొదట్నుంచి గమనిస్తున్నాను, నిన్ను తినేసేలా చూస్తున్నాడు వెధవ, ఎప్పుడూ ఆడదాన్ని చూడనట్టు" రీనా తన సొంతమైనట్టు మాట్లాడుతున్నాడు ఖాన్.

ఆడదాని ఎదురుగా తనేం మాట్లాడతాడో తనకే తెలియదు ఖాన్‌కు.

"రీనా నిన్ను వేరే మగాడు ఆ దృష్టితో చూడ్డం నేను సహించలేని విషయాలలో ఒకటి. నీ అందం నా సొంతం కావాలి. ఐ లవ్ యూ" ఆవేశంగా అన్నాడు ఖాన్.

మందహాసం చేసింది రీనా. తన జీవితంలో ఖాన్‌వంటి వ్యక్తుల్ని ఇంకా ఆడదాన్ని చూస్తే కుక్కలకంటే

హీనంగా ప్రవర్తించే వాళ్ళని ఎంతోమందిని చూసివుంది. ప్రేమపాఠాలు వల్లించేవారంటే తన కసహ్యం.

"మిస్టర్ ఖాన్ కంట్రోల్ యువర్ సెల్ఫ్. నీతో ప్రేమపాఠాలు వల్లించే ఓపిక నాకిప్పుడు లేదు. గెటవుట్ ఫ్రండి రూం" కఠినంగా వుంది రీనా స్వరం.

ఖాన్ ముఖంలో రంగులు మారాయి. "రీనా నువ్వు నాతో సహకరిస్తే నాలుగు లక్షల డాలర్లు మన స్వంత మవుతాయి ఆలోచించు" రీనాపై నుండి దృష్టి మరల్చ కుండా అన్నాడు.

"అంటే నాలుగు లక్షల డాలర్లు మనకు ఇరువురికే దక్కాలంటావ్" సాలోచనగా అంది ఖాన్ వైపు చూస్తూ.

"యస్, వాడ్డుయూ సే" ఆమె ముఖంలో కన్పిస్తూన్న మార్పులను చూస్తూ అన్నాడు ఖాన్.

ఆలోచనలో పడింది రీనా. తనేమీ పతివ్రత కాదు. ఖాన్‌తో కలిస్తే నాలుగు లక్షల డాలర్లు తమ స్వంత మౌతాయి ఆ తర్వాత ఖాన్‌నుకూడా... ఇక ఆలోచించ లేదామె.

"ఆల్ రైట్, అయినా నీ పథకం అమలుపర్చడానికి ఇంకా చాలా వ్యవధి వుంది. ఇప్పట్నుంచి దాన్నిగూర్చి తల బద్దలు కొట్టుకోవటం అవివేకం" అంది రీనా ఖాన్ ప్రక్కనే సోఫాలో కూర్చొంటూ.

"ఫెర్నాండో గైడ్‌ని కల్సుకొని, మనకు అవసర మయ్యే ఆర్మ్స్, అమ్యూనిషన్ తీసుకురావటానికి వెళ్ళాడు. ఇక శాంసన్. విచిత్రమైన వ్యక్తి అతను. తిండివుంటే మరో విషయంగూర్చి ఆలోచించడు. సుష్టుగా తిని గుఱ్ఱు పెడ్తున్నాడు" చెప్పాడు ఖాన్ చేతి వాచీకేసి చూస్తూ.

ఆరుగంటల అయిదు నిముషాలు చూపిస్తోంది వాచి.

"ఫెర్నాండో తిరిగి రావడానికి మరో రెండు గంటలు పట్టవచ్చు. ఆయుధాలు మొత్తం బ్లాకులో సంపాదించాలి. ఒకవేళ అతను తొందరగా తిరిగి వచ్చినా మన ప్రయాణం ఈ రోజుకు సాధ్యంకాదు."

"అంటే మనం రేపు ఉదయం బయలుదేరాల్సి వుంటుందా?" అతని మాటలు పూర్తికాకముందే అడిగింది రీనా.

అవునన్నట్లు తలాడించాడు ఖాన్. "నాకు కంపెనీ ఇవ్వగలవని వచ్చాను."

"నో అబ్జక్షన్, కానీ ఈ సంగతి తక్కినవాళ్ళకు తెలియడం నా కిష్టంలేదు."

"ఆడదాన్ని గూర్చి నాకు తెలియదన్నట్లు మాట్లాడకు. ఈ ఆపరేషన్ వల్ల నాల్గురోజులనుంచి ఆడదాని సహాచర్యం లేక పిచ్చెక్కినట్లుంది. కాకుంటే నీ అందం, చలాకీతనం నన్ను బాగా ఆకర్షించాయి. ఈ గదిలో జరిగేదంతా గుమ్మం దాటితే మర్చిపోగలను. డోంట్ వర్రీ."

"థాంక్స్!"

లేచి గదిలో ఓ మూలగానున్న ఫ్రిజ్ వైపు నడచి, విస్కీ సీసా, నాలుగు బీరుబుడ్లు తెచ్చి టేబుల్ పై పెట్టింది రీనా.

ఐస్ కలుపుకొని రెండు రౌండ్లు పూర్తి చేశారు.

విస్కీ నిషాలో ఖాన్, రీనా తాత్కాలికంగా అన్నీ మరచిపోయారు.

# 3

ఉదయం ఆరుగంటలకు 'టెహరాన్' నుండి బయలు దేరిన బ్రిటీష్ మేడ్—ఫోర్ వీలర్ జీపు నిర్విరామంగా ప్రయాణించి, మధ్యాహ్నం పన్నెండు గంటలకు 'బస్రా' అనే వూరును సమీపించింది.

జీప్ వెనుకవున్న ట్రెయిలర్‌లో రకరకాల సామానులు వున్నాయ్. సూట్‌కేసులు, హోల్డాల్స్ ఎక్కువగా కన్పిస్తున్నాయ్. డ్రింక్స్ ఓ చెక్కపెట్టెలో వుండడంతో అవి బయటకు కన్పించడం లేదు. దాని ప్రక్కనే వున్న మరో చెక్కపెట్టెలో మారణాయుధాలు మందుగుండు సామగ్రి వున్నాయ్. ఆహార పదార్థాలున్న టిన్స్ ఓ అట్టపెట్టెనిండా పేర్చబడున్నాయి.

అయిదుగురికి నెలరోజులకు సరిపడే ఆహారపదార్థాలు తీసుకెళ్తున్నారు. నీళ్ళకు బదులు విస్కీ, బీర్‌లు వాడినా ఇరవై రోజుల వరకు భయం వుండదు.

జీప్‌లో బంచ్ ఆఫ్ క్రూక్స్‌తోపాటు మరో వ్యక్తి కూడా వున్నాడు. జీప్ డ్రైవ్ చేస్తున్నది అతనే. పేరు జోమా. ఎక్స్‌పర్ట్ జంగిల్ గైడ్. ఇరాన్ అడవులగూర్చి క్షుణ్ణంగా తెల్సిన వ్యక్తి. జీప్ సొంతదారుడుకూడా అతనే.

బస్రా వూరిలోకి ప్రవేశించింది జీపు.

చెప్పుకోదగ్గ పెద్ద వూరేమీ కాదు బస్రా. మెయిన్ రోడ్స్‌మాత్రం విశాలంగా వున్నాయ్. అక్కడక్కడా ఒంటెలు దర్శనమిస్తున్నాయ్. రోడ్లప్రక్కగా లారీలు, రిక్షాలు పార్కు చేయబడి వున్నాయి.

"తక్కువ జనాభాతో వున్న విశాలమైన దేశం ఇరాన్. దేశంలో ఎక్కువ భాగం ఎడారులు, అరణ్యాలతో నిండిన పర్వతాలు, పీఠభూములే. తక్కువ జనాభాకి కారణం వ్యవసాయ యోగ్యమైన భూములు లేకపోవడమే. చమురు ఎక్కువగా లభించడంవల్ల, ఇరాన్ భాగ్యవంతమైన దేశంగా పేరుపొందింది" తనకు తెలిసిన ఇరాన్ సంగ్రహ స్వరూపం వివరించాడు జోమా.

జీప్ తిన్నగా వెళ్ళి ట్రావెలర్స్ బంగళాముందు ఆగింది. అందరూ అక్కడ లంచ్ ముగించుకున్నారు.

గంట విశ్రాంతి తర్వాత తిరిగి ప్రారంభమైంది ప్రయాణం. అర గంటలో హైవేని వదలి కంకరరోడ్డు మీదకు తిరిగింది జీప్.

"హైవే ఎక్కడికి వెడుతుంది?" అడిగింది రీనా.

"దక్షిణ ఇరాన్. విపరీతంగా చమురుగనులున్న ప్రాంతం. ఈ హైవే కొన్ని ముఖ్యపట్టణాలగుండా చమురుగనులున్న ప్రాంతానికి వెడుతుంది" చెప్పాడు జోమా.

చిన్న చిన్న కుదుపులతో సాగిపోతోంది జీపు. బుద్ధిగా జీపు నడుపుతున్నట్లు కన్పిస్తున్నా జోమా ఆలోచనలన్నీ రీనా చుట్టూనే వున్నాయి. "స్టన్నింగ్ బ్యూటీ" అనుకున్నాడు మనసులో.

మరో గంట సాగింది ప్రయాణం.

"బిజారా గ్రామం ఇంకెంత దూరంలో వుంది?" జోమా నుద్దేశించి అడిగాడు మిల్కా ఖాన్.

"ఇరవై మైళ్ళు వుండవచ్చు"

"ఆ గ్రామం కటువైపునుంచి అరణ్యం ప్రారంభమౌతుందిగదూ!"

"అవును. మామూలు అరణ్యం కాదు. ఆ అడవిగూర్చి విపులంగా తెలిసిన గైడ్స్ ఇరాన్‌లో ఎక్కువమందిలేరు. వున్నవారిలో నేను ఒకడ్ని."

"ఆ అరణ్యాలకేమైనా పేరుందా?" కల్పించుకుంటూ అడిగింది రీనా.

"బిజారా అరణ్యాలంటారు. నాకు తెలిసినంతవరకూ వేరే పేరేదీ లేదు. భయంకరమైన అటవిమలతో బాటు, గోరిల్లాలు, పండాజాతి మనుష్యుల్ని తినే కోతులు ఆ అరణ్యాల్లో విచ్చలవిడిగా తిరుగుతుంటాయి.

అప్పుడప్పుడు ఎవరో ఒకరు మీలాగే జంతువులకోసం బిజారా అడవుల్లోకి వెళ్తుంటారు. వాళ్లైనా మరీ అరణ్యం మధ్యకు వెళ్ళరు. వెళ్ళినా వాళ్ళు తిరిగివచ్చేవరకు నమ్మకం వుండదు. ఈ ఏడాదిలో అటువైపు వెళ్ళడం నాకు ఇది రెండవసారి."

బిజారా అరణ్యాల్లోకి బ్రూక్స్ ఎందుకు వెళుతున్నది జోమాకు తెలియదు. అతనికి తెల్సిందల్లా జంతువులకోసం వాళ్ళు వేటకు బయల్దేరారని. ఫెర్నాండో చెప్పిన కారణాలు అతనికి సంతృప్తి నివ్వకపోయినా తనకు కావాల్సిన డబ్బు అందుతుంది కనుక గైడ్‌గా రావటానికి అంగీకరించాడు.

జరీనాను చూసిన తర్వాత జోమా అభిప్రాయం మారింది. వారి వెంట వెళ్ళడం తన అదృష్టంగా భావించాడు. ఆ విషయం బ్రూక్స్‌కి తెలియదు.

సాయంత్రం మూడు గంటలకు బిజారా గ్రామం చేరుకుంది జీపు.

నేరుగా తీసుకువెళ్ళి ఒక రేకుల షెడ్ ముందు ఆపాడు జోమా. జీప్ ను చూడగానే షెడ్ ప్రక్కనున్న గది లోంచి ఓ వ్యక్తి పరుగెత్తుకు వచ్చాడు.

అతనితో యేదో మాట్లాడి కొంత ఇరాన్ కరెన్సీ అతనికిచ్చాడు జోమా. అతను మాట్లాడకుండా ఖాళీ జీపును షెడ్ లోకి తీసుకెళ్ళాడు.

## 4

ఆహార పదార్థాలున్న అట్టపెట్టెను మోసుకుంటూ చక చకా అడుగులేస్తున్నాడు జోమా.

మిగిలినవాళ్ళుకూడా బరువులు మోస్తూ అతని వెనుకనే నడుస్తున్నారు.

అపుడపుడు కుందేళ్ళు, జింకలు ప్రక్కగా కన్పిస్తున్నాయి.

క్రమంగా సూర్యుడు పడమరదిశకు ఒరిగిపోతున్నాడు. చెట్లపైన రకరకాల పక్షులు గోలగోలగా అరుస్తున్నాయి. ఎటుచూసినా పచ్చగా చాలా అందంగా ఆహ్లాదంగా కనిపిస్తోంది ప్రకృతి.

దారి కిరుప్రక్కలా ఎత్తుగా పెరిగిన చెట్లు, తీగలతో అల్లుకుపోయిన పొదలు, సూర్యకాంతిని మరుగుపరుస్తున్నాయి. ముళ్ళకంపలు, గులకరాళ్ళు బాధించకుండా అందరూ జంగిల్ బూట్స్ ధరించారు. ప్రతి ఒక్కరివద్దా ఆయుధాలు వున్నాయ్.

ప్రకృతి ఆహ్లాదకరంగా వున్నా పరిసరాల్ని జాగ్రత్తగా గమనిస్తూ జోమా వెనుకే అడుగులేస్తున్నారు నలుగురూ.

చీకటిపడేవరకూ ప్రయాణం సుఖంగా సాగింది.

"ఫ్రెండ్స్! రాత్రిపూట ప్రయాణం సాగించటం మంచిదికాదు" నడవటం ఆపి అన్నాడు జోమో.

అందరూ అతని చుట్టూ చేరారు.

"జోమో, ఈ ప్రాంతంలో మనం విశ్రాంతి తీసుకుంటే ఏదైనా ప్రమాదం వుందా?" అడిగాడు ఫెర్నాండో.

"ఇటుప్రక్కల పెద్దగా క్రూరమృగ సంచారం వుండదు. అలాగని అజాగ్రత్తగా వుండకూడదు. అడవుల్లో ఏవైపునుంచీ ప్రమాదం ముంచుకొస్తుందో చెప్పలేం! మన జాగ్రత్తలో మనం వుండాలి—"

"దట్స్ ఆల్ రైట్! ఈ రాత్రి గడపడానికి అనువైన ప్రదేశం వెదకండి," అంది రీనా చుట్టూ చూస్తూ.

అందరూ బరువులు దించారు.

అక్కడికి సమీపంలోనే కాలిబాటకు ప్రక్కనే శాఖోపశాఖలుగా విస్తరించి వుంది ఓ పెద్ద జర్రావృక్షం. చీకట్లో జడల దయ్యంలా కన్పిస్తోందది.

ఫెర్నాండో, రీనా జర్రా వృక్షంవైపు కదిలారు.

"ఈ రాత్రికి అందరూ ఈ చెట్టుక్రిందే విశ్రాంతి తీసుకుందాం" తన అభిప్రాయం చెప్పింది రీనా.

## 5

నెగడు ధగధగా వెలుగుతోంది.

కొరివి దయ్యంలా జర్రా వృక్షపు కొమ్మలు గాలికి కదిలి వింతశబ్దాన్ని సృష్టిస్తున్నాయ్.

సన్నగా ఈదురుగాలి వీస్తోంది.

వెలుగుతున్న నెగడు చుట్టూ కూర్చొని, ఆహారం తీసుకుంటున్నారు అయిదుగురూ.

"ఇంకో రెండు, మూడు మైళ్ళు అడవిలోకి వెళితే కావలసిన జంతువులను వేటాడవచ్చు. మరీ అడవిమధ్యకు వెళ్ళనవసరం లేదు" బీర్ సిప్ చేస్తూ అన్నాడు జోమో.

చిన్నగా నవ్వాడు ఫెర్నాండో "జోమో! మాకు జంతువులు అవసరంలేదు. మనం బాంగో తెగ ఆటవికులు నివసించే ప్రాంతానికి వెళ్తున్నాం ప్రస్తుతం. వివరాలు అడగడానికి ప్రయత్నించకు. మా వెంట రావటానికి నిరాకరించినా, పారిపోవాలని ప్రయత్నించినా నీ ప్రాణాలకు గ్యారంటీ వుండదు. నీ శవం అడవి జంతువులకు ఆహారమౌతుంది."

ఆశ్చర్యపోయాడు జోమో. అతని ముఖంలో చావు భయం ప్రత్యక్షమైంది.

"మైగాడ్! బాంగోలు నరమాంస భక్షకులు" అన్నాడు నోరు పెకలించి.

ఫెర్నాండోతోబాటు తక్కిన ముగ్గురూ వులిక్కిపడ్డారు.

ఈ విషయం తమకు చెప్పలేదు గోపల్లన్. బహుశా, అతనికికూడా ఈ విషయం తెలియదేమో. లేక తెలిసికూడా చెప్పలేదో!

"ఏమైనా ఇంతదూరం వచ్చి వెనక్కుపోవడమన్న ప్రశ్నే లేదు" స్థిరంగా అన్నాడు ఫెర్నాండో.

"బాంగో ఆటవికుల గూర్చి నీకు తెలిసింది చెప్పు" అడిగాడు తిరిగి.

తల అడ్డంగా వూపాడు జోమో.

"బాంగోల గూర్చి నాకు తెలిసింది చాలా తక్కువ. బొరస్ పర్వత లోయలు వారి నివాస స్థానమని విన్నాను. వాళ్ళు వేటప్రియులు. అడవిలో రోజుకు యాభై, అరవై

మైళ్ళు సులువుగా తిరిగి వేటాడగల సమర్థులు. నాగరికులు కనిపిస్తే, ఎముకలు కూడా మిగల్చకుండా తినడం వారి కలవాటట. అతి క్రూరులైన వారి గూడేల దగ్గరికి వెళ్ళడం కోరి మృత్యువును వరించడమే!"

"కౌరస్ పర్వత లోయలు చేరడానికింకా ఎంతదూరం ప్రయాణం చేయాలి" అడిగాడు శాంసన్.

"నాకంతగా తెలియదు. ఇంతకు ముందెపుడు వచ్చినా అరణ్యంలో పదిమైళ్ళకంటే దూరం వెళ్ళలేదు. బహుశా నలభై మైళ్ళు దూరం వుండవచ్చు" ఏడుపు ముఖంతో జవాబు చెప్పాడు జోమా.

"బాంగోలు కాక మరేవైనా ఆటవిక తెగలు నివశిస్తున్నాయా ఈ అడవుల్లో—" అడిగింది రీనాజరీనా.

"పిగ్మీలు, తోడాలు, బోబో జాతీయులు, కిమోయి తెగ ఆటవికులు నివశిస్తున్నారని విన్నాను. కానీ వారి గురించి నాకేమీ తెలీదు."

"ఆల్ రైట్ జోమా! పారిపోవడానికి మాత్రం ప్రయత్నించక. అటువంటి పిచ్చి ప్రయత్నం నీ ఆరోగ్యానికి మంచిది కాదు. మనం పని పూర్తి చేసుకొని టెహరాన్ చేరుకోగలిగితే, ఇరవై రోజుల కూలి నీకు బోనస్ క్రింద ఇవ్వబడుతుంది" కటువుగా హెచ్చరించాడు ఫెర్నాండో.

మరో పావుగంట భారంగా గడచిపోయింది.

అందరికీ ప్రక్కలు సిద్ధమయ్యాయి.

రీనాను వదిలేసి మగవాళ్ళు వంతులవారిగా ఒక్కొక్కరు రెండేసి గంటల చొప్పున కాపలా వుండాలని నిర్ణయించుకున్నారు.

మొదటివంతు తనే పుచ్చుకొన్నాడు శాంసన్.

బాగా అలసిపోయి వుండటంతో తొందరగా నిద్ర లోకి జారిపోయారు అందరూ.

సెగడు ముందు కూర్చొని చలి కాగుతున్నాడు శాంసన్. నడుము కిరువైపులా రివాల్వర్లు, భుజానికి రైఫిలు వ్రేలాడుతున్నాయి.

రెండు గంటలు దొర్లిపోయాయి.

ఫెర్నాండోను నిద్రలేపి తను పడుకున్నాడు శాంసన్. వెంటనే నిద్రలోకి జారిపోయాడు.

# 6

సెగడు మందంగా వెలుగుతోంది. ఆకాశంలో చంద్రుణ్ని మేఘాలు కప్పేశాయ్.

మసక వెలుగు అడవి అంతా పరచుకొంది. కీచురాళ్ళ గోద చెవుల్ని బ్రద్దలు కొడుతోంది. దూరంగా ఎక్కడో నక్క ఊళ వేస్తోంది. జయ్‌మని వీస్తున్న ఈదురుగాలికి చెట్టు కొమ్మలు కదులూ శబ్దం చేస్తున్నాయ్. రాత్రి సమయంలో అడవుల్లో చలి ఎక్కువ.

చలికి ఓర్చుకోలేక పోతున్నాడు ఫెర్నాండో.

సెగడు ముందు కూచున్న వాడల్లా లేచి తన ప్రక్క దగ్గరకెళ్ళి బాగ్‌లోంచి విస్కీ సీసా అందుకొన్నాడు. అడుగు ముందుకు వేయబోయి వున్నచోటే ఆగిపోయాడు.

జర్రా వృక్షం ప్రక్కగావున్న పొదల్లోంచి రెండు మిణుగురులు తననే చూస్తున్నట్లనిపించింది. ఒకదాని కొకటి దగ్గరగా దీపాల్లా కన్పిస్తున్న ఆ వెలుగును చూడ గానే ఫెర్నాండో మెడ వెంట్రుకలు నిక్కబొడుచు కున్నాయి.

''పులి'' అప్రయత్నంగా వెలువడిందతని నోటినుంచి మాట. భుజాన వ్రేలాడుతున్న రైఫిల్ అందుకోబోయాడు,

మెరుపులా కదిలింది పులి. తోకతో నేలను బాది గాల్లో కెగిరి ఫెర్నాండో పై దుమికింది. రైఫిల్ తీసే అవకాశం లేకపోయిందతనికి.

పులితో బాటు వెల్లకిలా నేలమీద పడిపోయాడు ఫెర్నాండో. అతని పీక కొరకాలని ప్రయత్నిస్తుందా జంతువు.

నిద్రపోతున్న వాళ్ళంతా మేల్కొన్నారు. ఏం జరుగుతోందో ఎవరికీ అర్థంకాలేదు నిద్రమత్తులో.

నెగడు దాదాపు ఆరిపోయి వుంది.

మిల్కా ఖాన్ టార్చి వెలిగించి ఫోకస్ చేశాడు. క్షణాలమీద రీనా చేతిలో రివాల్వర్ ప్రత్యక్షమైంది.

పీక అందుకోబోతున్న పులినోటికి తన ఎడమచేతిని అందించాడు ఫెర్నాండో. కసి, కసిగా ఆ చేతిని కొరికేస్తోంది పులి.

ఫెర్నాండో కుడిచేయి పిడికిలి బిగుసుకొని పైకిలేచింది. ఫట్ మన్న శబ్దంతో బాటు పులి తల పగిలిపోయింది. వెంటనే మరో దెబ్బ పడింది దాని తలపైన. పగిలిన తల నుంచి మెదడు బయటకు చిమ్మింది. రీనా రివాల్వర్ నుంచి వెలువడిన రెండు బుల్లెట్లు పులి డొక్కలో దూరాయి.

నిర్జీవంగా ప్రక్కకు వాలిపోయింది దాని శరీరం.

తిరిగి నెగడు వెలిగించారు.

నెగడు వెలుగులో ఫెర్నాండో గాయాలకు మందురాసి బాండేజ్ చేశాడు మిల్కాఖాన్.

"ఇక్కడ క్రూరమృగాలు సంచరించవని చెప్పావు" సోమాను చూస్తూ కోపంగా అంది రీనా.

ఏదో చెప్పబోయాడు జోమా.

"అడవన్న తర్వాత క్రూరమృగాలు లేకుండా వుండవు. వాదనలు అనవసరం. అతన్ని రెస్టు తీసుకోనివ్వండి" అన్నాడు శాంసన్.

బాగ్ లోంచి విస్కీ బాటిల్ తీసుకొని మూతతీసి ఫెర్నాండోకి కందించింది రీనా. త్రాగేసి పడుకున్నాడు. తక్కిన వాళ్లెవరూ నిద్రపోలేదు. సెగడు వెలుగులో పులి శవం తల పగిలి భీకరంగా కన్పిస్తోంది.

తర్వాత ఎటువంటి ప్రమాదమూ లేకుండా రాత్రి గడచిపోయింది.

# 7

తూర్పున సూర్యుడు పైకెగబ్రాకుతున్నాడు.

ఉదయపు ఎండలో అడవి పచ్చగా మెరసిపోతూంది.

పక్షుల కిలకిలారావాలు విపరీతంగా విన్పిస్తున్నాయ్.

కాలిబాట కిరువైపులా ఎక్కడ చూసినా పిచ్చి, పిచ్చిగా పెరిగిన పొదలు, అల్లుకుపోయిన తీగలు, ఘుంయ్ మని శబ్దంచేసే వెదురు పొదలు, ఏవో పేరు తెలియని చెట్లు పూసిన రంగు రంగుల పూలు. ప్రకృతిని చూసి మైమరచిపోతోంది రీనా.

మగవాళ్ళు ప్రక్కలకు చూసుకుంటూ అడుగులేస్తున్నారు. అక్కడక్కడా దారికడ్డంగా అల్లుకుపోయిన తీగలను, చిన్న, చిన్న కొమ్మలను వెంట తెచ్చిన బాయ్ నట్స్, గొడ్డళ్ళతో నరికి దారి చేసుకుంటూ ప్రయాణిస్తున్నారు.

మూడున్నర గంటలసేపు ఎక్కడా ఆగకుండా సాగింది ప్రయాణం.

దాదాపు పది మైళ్ళు క్షణమైనా విశ్రాంతి తీసుకోకుండా నడిచారు.

దట్టంగా పెరిగిన చెట్లక్రింద ఒక్కోచోట సూర్యుడు కన్పించటంలేదు. అటువంటిచోట చల్లగావున్నా ఏదో తెలియని భయంతో అందరూ వాడలిపోతున్నారు.

"ఫెర్నాండో కాసేపు విశ్రాంతి తీసుకొందాం. కనీసం అరగంటైనా విశ్రాంతి తీసుకోకుంటే ఇహపై నేను నడవలేను." అంది రీనా అలసటగా.

నడచి, నడచి, ఆమె కాళ్లు పీకుతున్నాయ్. ఎంతైనా ఆడది. పైగా అలవాటులేని ప్రయాణం.

ఫెర్నాండోకి కూడా అలసటగానేవుంది. పులి నమిలి వేసిన చేయి సలుపుతోంది. పంజా దెబ్బలు తగిలి ఇంకా శరీరంమీద అక్కడక్కడా గాయాలైనాయ్. రేగిన గాయాలు మంట పుడుతున్నాయ్. అతడు ఒకసూట్ కేస్ మాత్రం తీసుకొని నడుస్తున్నాడు. లంచ్ వేళకు ఇంకో పదిమైళ్ళైనా ప్రయాణం చేయాలని అతని అభిప్రాయం. రీనా మాటలతో మౌనంగా వెళ్ళి కాలిబాట ప్రక్కనే వున్న ఓ చెట్టు మొదట ఆనుకొని కూర్చొన్నాడు ఫెర్నాండో.

అందరూ చెట్టు క్రిందకు చేరి సామాన్లు దించారు.

అది పెద్ద చింతచెట్టు. శాఖోపశాఖలుగా విస్తరించి వుంది. చెట్టుకు జార్లబడి అలసటగా క్షణంసేపు కళ్ళు మూసుకొన్నాడు ఫెర్నాండో. గాయపడిన చేయి విపరీతంగా సలుపుతోంది.

ఏదో తాటి చుట్ట పైన బడినట్లయి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. ఆ చుట్ట యేమిటో గుర్తించగానే అతని వొళ్ళు జలదరించింది. ఓగ్గరగా అరవబోయాడు. కానీ

సమయం మించిపోయింది. దబ్బున ప్రక్కకు పడి పోయాడు.

ఆ శబ్దానికి ముందు కూర్చొనున్న ఫెర్నాండో అను చరులు తిరిగి చూశారు. వారి గుండెలు దడదడలాడాయ్.

ఫెర్నాండో శరీరాన్ని ఓ కొండ చిలువ చుట్టేసింది. కాళ్ళనుండి గొంతువరకూ తీగలా అల్లుకుపోయిందది.

ఫెర్నాండో ముఖంలో కన్పిస్తున్న ప్రాణభయం తాలూకూ ఛాయలు రాక్షసుని హృదయాన్ని సైతం కరిగించేలా వున్నాయ్.

రివాల్వర్ అందుకొన్నాడు మిల్కాఖాన్. కానీ దాన్ని ఎలా ప్రయోగించాలో అతనికి అర్థం కావడం లేదు. కాల్చితే బుల్లెట్ ఫెర్నాండోకు తగలడం ఖాయం. తగలకుండా కాల్చడం అసంభవం.

దాదాపు ముప్పై అడుగుల పొడవున్న "గింఫూ" జాతి భయంకరమైన కొండ చిలువ అది. ఆకుల సందు నుండిపడుతున్న ఎండలో దాని శరీరంపైనున్న తెలుపు, నల్లని మచ్చలు వికృతంగా మెరుస్తున్నాయి. దాని కళ్ళు టెన్నిస్ బంతుల సైజులోవుండి అటు ఇటూ కదుల్తున్నాయ్.

ఆఫ్రికాలోని కాంగో అరణ్యాలు గింఫూ జాతి కొండ చిలువలకు ప్రసిద్ధి. ఆ కొండ చిలువ వాతబడిన మనిషి గాని జంతువుగాని బ్రతికి బయటపడటం అసంభవం.

తల అటు ఇటూ వూపుతున్నాడు ఫెర్నాండో. అతని శరీరంలో కదులుతున్న భాగం తల ఒక్కటే. కంఠం చుట్టూ కొండచిలువ తన శరీరాన్ని చుట్టేసింది. గంగాళం లాంటి నోరు తెరచి ఫెర్నాండో తలపట్టుకోవాలని చూస్తోందది. .

ఇక ఫెర్నాండోను రక్షించడం అసంభవ మన్పించింది ఖాన్‌కు. ఏమైతే అయిందని కొండ చిలువ తలకు గురిచూసి రివ్వాలర్ ప్రేల్చాడు, గురి తప్పి ఫెర్నాండోకు తగిలినా చేసేదేమీ లేదు.

'ధన్'మన్న చప్పుడుతో పాటు కొండ చిలువ తలలో దూరింది బుల్లెట్. దాని తల రెండుగా చీలిపోయింది.

శాంసన్ బాయ్ నట్‌తో ఖాన్ దగ్గరగా వచ్చాడు. క్షణాలమీద కొండ చిలువ శరీరం ముక్కలు, ముక్కలుగా నరికేశాడు. చిలువ శరీర భాగాలు నేలమీద ఎగిరెగిరి పడుతున్నాయి.

మిల్కా ఖాన్ శాంసన్‌ల శ్రమకు ఫలితం దక్కలేదు. ఊపిరి అందక ఫెర్నాండో అప్పటికే ప్రాణాలు వదిలేశాడు. అతని తల ప్రక్కకు వాలిపోయింది. ముఖంలో భయం తాలూకు ఛాయలు నిశ్చలంగా నిల్చిపోయివున్నాయ్.

"ఇప్పటికైనా ఈ ప్రయత్నం విరమించుకొని వెనుదిరిగి పోదాం" జోమా భయంగా అన్నాడు.

"జోమా! ఇంతదూరంవచ్చి ఇపుడు వెనక్కు వెళ్ళాలన్నా అడవి దాటి సురక్షితంగా బయట పడతామన్న నమ్మకంలేదు. కాబట్టి ఆ ఆలోచన విరమించుకో!" అన్నాడు శాంసన్.

ఫెర్నాండో శరీరాన్ని దహనంచేసి బరువెక్కిన హృదయాలతో ముందుకు కదిలారు.

పావుగంట ప్రయాణం తర్వాత దారిప్రక్కనే చిన్న నీటిగుంట కన్పించింది. అందరూ దాహం తీర్చుకున్నారు.

తిరిగి సాగింది ప్రయాణం.

ఫెర్నాండో మరణంతో అందరిలో నిస్పృహ యేర్ప డింది.

తనెన్నోమార్లు ఈ అడవికి వచ్చాడు. మరీ మధ్యకు వెళ్ళకపోవడంవల్ల ఇటువంటి సంఘటన లేవీ తను చూడ లేదు. ఫెర్నాండో చావు కళ్ళారా చూసిన తర్వాత ముందుకు వెళ్ళడానికే మాత్రం ఇష్టంలేదు కాని వెళ్ళక పోతే తనకు చావు ఖాయం.

వాళ్ళతోబాటే చావో బ్రతుకో తేల్చుకోవాలి.

# 8

సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. ఎండ మండుతోంది.

పోను పోనూ దారి చాలా ఇరుగ్గావుంది ఒక్కోచోట అసలు కాలిబాటే కన్పించడంలేదు.

ముందుకు వేస్తున్న ప్రతి అడుగు మృత్యుముఖానికి దగ్గరౌతున్నట్లు ఫీలౌతున్నాడు జోమా.

ప్రతి ఒక్కరిలోనూ అవే భావాలున్నాయ్. కానీ ఎవరూ బయటపడటంలేదు.

సూర్యుడు పడమటి కొండల చాటుకు చేరుకోవడా నికి వేగంగా పరుగులు తీస్తున్నాడు.

ఎండ తీవ్రత క్రమక్రమంగా తగ్గిపోతోంది. అడవుల్లో సూర్యాస్తమయానికి ముందే ఈదురు గాలి ప్రారంభ మౌతుంది.

సాయంత్ర మయేసరికి మరో ఎనిమిది మైళ్ళ ప్రయా ణించారు ట్రూక్స్.

"టౌరస్ పర్వతలోయలు చేరడానికింకా ఎంత దూరం ప్రయాణం చేయాలి" అలసటగా అడిగింది రీనా.

"ఇంకా పదిహేను మైళ్ళకు పైగా వెళ్ళవలసి వుంటుంది" అయిష్టంగానే జవాబిచ్చాడు జోమా.

టౌరస్ పర్వతాల ప్రసక్తి వింటేనే అతనికి శరీరం జలదరిస్తోంది.

"ఇక ప్రయాణం ఆపి, రాత్రి వుండడానికి అనువైన చోటు చూసుకోవడం మంచిది." ఒకచోట నిలబడుతూ అన్నాడు శాంసన్.

దారి ప్రక్కగా కన్పిస్తున్న ఓ చెట్టుకేసి వెళ్లాడు జోమా. అందరూ అతన్ననుసరించారు.

దగ్గరికి వెళ్ళగానే చెట్టుపై భాగాన్నంతా నిశితంగా పరిశీలించారు కొండ చిలువలు, ఎలుగు బంట్లు లాంటి వేవైనా వున్నాయేమోనని. అటువంటి వేమీ కన్పించ లేదు.

కొమ్మలు ఆకులతో చాలా భాగం ఆక్రమించుకొని వున్న పెద్ద మఱ్ఱి వృక్షమది. సన్నగా వీస్తోన్న ఈదురు గాలికి మఱ్ఱి ఆకులు కదులుతూ శబ్దం చేస్తున్నాయ్.

అరణ్యమంతా చీకటి ముసురుకుంది. సెగడులోని కట్టెలు కణ కణ మండుతున్నాయ్. నక్కల ఊళలు, జంతువుల అరుపులు ఆగి, ఆగి విన్పిస్తున్నాయ్.

క్రమంగా రాత్రి గడుస్తోంది.

శాంసన్ వంతు పూర్తయి, ఖాన్ మేల్కొనివున్నాడు. సిగరెట్ పీలుస్తూ సెగడు ముందు కూర్చొనివున్నాడతడు. అతని మెదడులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

అందరూ గాఢ నిద్రలో వున్నారు.

ఖాన్ దృష్టి జరీనాపై నిలిచింది. రీనా ధరించిన బట్టలు ముల్లు గీరుకుపోయిఅక్కడక్కడా చిరిగివున్నాయి. శ్వాస పీల్చడంలో బరువైన ఆమె రొమ్ములు లయబద్ధంగా వూగుతున్నాయి.

నిద్రలో వీనస్‌లా కన్పిస్తోందామె ఖాన్ కళ్ళకు.

ఒక నిశ్చయానికివచ్చినట్లు మెల్లగా లేచి రీనాను మిాపించాడు. నడుంపై చేయి వేసి కుదిపాడు. త్రుళ్ళిపడిన కళ్ళు తెరిచింది రీనా. 'కవ్వు'న అరవబోయి తమాయించు కుంది.

చేయిపట్టి లాగి, సెగడుకు దూరంగా పొదల వెనుకకు తీసుకుపోయాడు. ఖాన్.

"యూ బ్రూటస్! నీకు సమయం, సందర్భం తెలియదా" కసిరింది రీనా. ఖాన్‌ను నమిలి మింగెయ్యాలన్నంత కోపం వస్తోందామెకు.

అవసరం తీరేవరకూ అలాంటి మాటల్ని ఎన్నయినా భరించగలడు ఖాన్.

"ఉష్, గట్టిగా అరవకు, వాళ్ళు లేవగలరు!"

"ఇడియట్! నిన్ను......" ఆ పైన ఆమెను మాట్లాడ నివ్వలేదతడు.

ఆ తర్వాత రీనాకూడా పెదవి విప్పలేదు. మౌనంగా ఖాన్‌కు సహకరిస్తోంది.

రీనా శరీరంనుండి వేరుపడి అలసటగా లేచినిలబడ్డాడు మిల్కా ఖాన్. ప్రక్కనేవున్న రైఫిల్ తీసి భుజానికి తగిలించుకొని వెనుదిరగ బోయేంతలో, భుజంపైన దూలం లాంటి చేయి పడింది.

అదిరిపడి మెడ వెనక్కు తిప్పాడు.

ఏడున్నరడుగుల ఎత్తున్న గొరిల్లా నిలబడివుంది. వెస కగా. అరవబోయాడు. అప్పటికే గొరిల్లాచేయి ఖాన్ కంఠం చుట్టూ బిగుసుకు పోయింది. రైఫిల్ తీసే అవకాశం లేదు. ఊపిరాడక మూలుగుతున్నాడు ఖాన్. గింజుకుంటు న్నాడు.

గొరిల్లా నోటినుండి భరించలేని వాసన. ఖాన్ ముక్కు పుటాలు పగిలిపోతున్నాయి.

మరుక్షణంలో ఖాన్ పీక కొరికేసింది గొరిల్లా. వెచ్చటి నెత్తురు అత్రంగా తాగుతోంది.

దుస్తులు సర్దుకొని తలపైకెత్తిన రీనా ఎదురుగా పర్వతాకారంలోవున్న గొరిల్లాను చూడగానే కెవ్వున కేక వేసి, స్పృహ తప్పిపోయింది.

రీనా కేకను అదిరిపడి లేచాడు శాంసన్.

నెగడు సుడ్డిగా వెలుగుతోంది. టార్చి తీసుకొని జోమోను లేపాడు. నెగడు ముందుండవలసిన మిల్కాఖాన్ లేడు. రీనా పక్క ఖాళీగావుంది.

టార్చి వెలుగును చుట్టూవున్న పొదలమీదకు ప్రసరింపజేస్తూ, అరుపు విన్పించిన వైపు నడిచాడు శాంసన్. రైఫిల్‌తో వెనుకే వస్తున్నాడు జోమో.

ఓ పొద వెనుకగా స్పృహతప్పి పడివున్న రీనా కన్పించింది. ఆమె శరీరంమీద గుడ్డలు సరిగాలేవు. ఖాన్ జాడ తెలియలేదు. రీనాను ఎత్తి భుజాన వేసుకున్నాడు శాంసన్.

నెగడు దగ్గరికివచ్చి పక్కమీద పడుకోబెట్టాడు.

బేగ్‌లోంచి వాటర్ బాటిల్ తీసి, రీనా ముఖంపై నీళ్లు చిలకరించాడు జోమో.

భారంగా తల అటు, ఇటు కదలించి నెమ్మదిగా కళ్లు తెరిచింది రీనా.

ఎదురుగా శాంసన్ జోమో కన్పించారు.

"మిల్కాఖాన్ ఏమయ్యాడు?" అడిగాడు శాంసన్.

నక్కకంటె తెలివైనఆడది జరీనా. ఇష్టపడే ఖాన్‌తో

సుఖం కోసం వెళ్ళింది. ఖాన్ గొరిల్లాకు ఆహారమై పోయాడు.

తను ఖాన్‌తో వెళ్ళిన విషయం వాళ్ళకు తెలియడం ఆమె కిష్టంలేదు.

“ఆ ఇడియట్ నన్ను రేప్ చేయబోయాడు. నిద్ర పోతుండగా నోరుమూసి పొదలచాటుకు తీసుకెళ్ళి తన ఆకలి తీర్చుకోబోయాడు. ఎదురు తిరిగి నన్ను హింసించి బట్టలు చింపబోయాడు. నేను పెనుగులాడుతున్నాను.

ఇంతలో అతని వెనుగ్గా వచ్చిన గొరిల్లా ఖాన్ మెడ కొరికేసింది. ఆ దృశ్యం చూసి అరచి పడిపోయాను. ఆ తర్వాతేమైంది నాకు తెలియదు” అంది గీనా. వెక్కి వెక్కి ఏడుస్తోందామె.

నమ్మలేనట్లు ముఖం పెట్టిన జోమో, వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆమెను చూసి, తన నమ్మకం మార్చుకొన్నాడు.

గీనా ఎంతకైనా తెగించిన ఆడది అని జోమోకు తెలియదు. అతను ఇచ్చిన విస్కీ బాటిల్ అందుకొని గడగడా తాగేసింది. మర్చిపోవాలనుకున్నా మరుపు రాకుండా గొరిల్లా రూపం కళ్ళముందు మెదుల్తోంది.

ఆపాదమస్తకం నల్లని బొచ్చు, దూలాలవంటి కాళ్ళు చేతులు, చిన్నతల అగ్నిగోళాల్లాంటి చిన్న కళ్ళు బంపాల వంటి పళ్ళు. అబ్బ ఘోరమైన రూపం. ఆపైన ఆలోచించలేక పోయిందామె మస్తిష్కం.

విస్కీ మత్తులో గాఢంగా నిద్రలోకి జారుకుంది.

“ఖాన్ శరీరంకూడా అవుపించలేదే, ఏమైనట్టు?” అడిగాడు జోమో.

“బహుశా, గొరిల్లా ఈడ్చుకుపోయి వుంటుంది.” చెప్పాడు శాంసన్. అతని కంఠం విచారంగా వుంది.

"రీనా చెప్పిన విషయాలు నమ్మదగ్గవి గాలేవు. ఖాన్ మరణానికి రీనా కారణంకాదు కదా!"

"నమ్మినా నమ్మకపోయినా, ఖాన్ లేదు ప్రస్తుతం. అతడు తిరిగి వస్తాడనీ నమ్మకంలేదు. పోయిన ఖాన్ కోసం బ్రతికివున్న రీనాను బాధపెట్టడం, అనుమానించడం నా కిష్టంలేదు" చెప్పాడు శాంసన్.

# 9

క్రమంగా రాత్రి గడచిపోయి తెల్లవారింది. పక్షుల శబ్దాలతో ప్రకృతి మేల్కొంది. సూర్యుడు పైకెగ బ్రాకుతున్నాడు, అలసట తెలియని వాడిలా.

తిరిగి ఒకసారి రాత్రి రీనా పడివున్న ప్రాంతమంతా వెదికారు ఖాన్ కోసం. వారి ప్రయత్నం వ్యర్థమైంది.

బరువుగా ముందుకు వెళ్తున్నారు శాంసన్ బృందం. ప్రస్తుతం వున్నది ముగ్గురే. శాంసన్, జోమా, రీనాజరీనా.

టౌరస్ పర్వతలోయలు చేరేవరకైనా తాము ప్రాణాలతో వుంటామన్న నమ్మకం లేదు వాళ్ళకు.

మధ్యాహ్నం వేళకు మరో ఎనిమిది మైళ్ళు ప్రయాణం చేశారు. లంచ్ తీసుకొన్న చోటనే అరగంట విశ్రాంతి తీసుకొని తిరిగి బయల్దేరారు.

బరువులతో జోమా ముందు నడుస్తున్నాడు. ఆలోచనలతో అతని మెదడు వేగిపోతోంది.

రాత్రి జరిగిన సంఘటన తర్వాత రీనా పొందుకోసం పరితపించి పోతోందతని మనసు. ఎలా ఆమెను పొందడం? శాంసన్ లేకుంటే తామిద్దరే!

అంటే శాంసన్ను అడ్డు తొలగించుకోవాలి. శాంసన్ అడ్డుతొలిగితే, ఎలాగో రీనాని ఒప్పించి తిరుగుప్రయాణం పట్టించవచ్చు.

తన భావా లేమాత్రం గమనించినా శాంసన్ తనను పుల్లవిరిచినట్లు విరిచేస్తాడు!

తన పైన రీనా రెస్పాన్స్ ఎలావుంటుందో? ఈ మూడ్రోజుల్లో ఆమె తనకేసి పరిశీలనగా చూడనుకూడా లేదు.

తను శాంసన్‌ను షూట్ చేస్తే, రీనా తనను చంపవచ్చు.

ఆమె భావాలెలా వున్నాయో? మొదట ఆమె మనసు తెలుసుకొని తర్వాత శాంసన్ విషయం చూడాలి.

జోమా ఆలోచనలు ఒక దారికి రాకముందే ఫెళ, ఫెళమని ఎండు పుల్లలు విరుగుతున్న చప్పుడు అతని చెవులకు తాకింది.

చటుక్కున ఉన్నచోటే ఆగిపోయాడు జోమా.

ఎదురుగా వున్న పొదలను చీల్చుకుంటూ సుడిగాలిలా ముందుకు దూసుకువచ్చింది ఓ అడవిదున్న. విపరీతంగా బలిసిపోయిన శరీరంతో ఏనుగులా వుందది.

కత్తుల్లా వాడిగావున్న కొమ్ములు వంపులు తిరిగి ముందుకు పొడుచుకువచ్చాయి. ఈగ వాలినా జారిపోయేట్లు నున్నగా నల్లని బొగ్గులా మెరుస్తోంది దాని చర్మం.

చేతిలోవున్న సూట్‌కేస్‌లను జారవిడిచి రైఫిల్ అందుకోబోయాడు జోమా.

అప్పటికే సమయం మించిపోయింది.

భీకరంగా అంకెవేసి తలవంచి బాణంలా ముందుకు దూసుకొచ్చిన దున్న రెండు కొమ్ములు జోమా కడుపులో దూరిపోయాయి.

అరవడానికి కూడా అవకాశం లేకపోయిందతనికి. రక్తంతోపాటు ప్రేవులుకూడ దున్న ముఖంమీదికి జారాయి. ఒక్కసారి విసురుగా తల విదిలించిందా

జంతువు. కొమ్ములను కేలాడుతున్న జోమా శరీరం బంతిలా వెళ్ళి ఎక్కడో పొదల్లోపడి అదృశ్యమైంది. అతని శరీరం నుండి కారిన రక్తంతో దున్న మొహం, కళ్ళు ఎఱ్ఱగా మారిపోయాయి.

రెప్పపాటులో జరిగిన సంఘటనకు నిశ్చేష్టులైపోయారు కాంసన్, రీనాలు.

తేరుకుని మెరుపులా గన్ తీసాడు కాంసన్.

ధన్ మన్న శబ్దంతోపాటు గుండు దున్న ముహంలో జొరబడింది.

అడవి దద్దరిల్లేట్టు అరచిందది. గాయం బాధతో మరింత రెచ్చిపోయి తలవంచి కాంసన్ పైకి దుమికింది.

తిరిగి షూట్ చేయడాని కవకాశం లేకపోయింది కాంసన్ కు. గన్ వదిలేసి రెండు చేతులూ ముందుకుచాచి తనమీదకు దూసుకొస్తున్న దున్న కొమ్ముల్ని పట్టు కొన్నాడు.

పట్టునుంచి విడిపించుకు పోవడానికి విశ్వప్రయత్నం చేస్తోంది దున్న. ఎగిరెగిరి పడుతోంది.

కాంసన్ జబ్బలు పొంగాయి. శరీరం ఉక్కులా మారింది. జీవన్మరణ సమస్య. దున్న తనకంటె పదిరెట్లు బలమైన జంతువని అతనికి తెలుసు.

కానీ కాంసన్ విల్ పవర్ అంతకంటే బలమైంది. సన్ ఆఫ్ ఆస్ట్రేలియాను, కింగ్ కాంగ్ నూ గుర్తుకు తెప్పిస్తోంది ప్రస్తుత మతని రూపం.

కాంసన్ బలాన్నిమించి ఒక్కడుగుకూడా ముందుకు వేయలేకపోతోంది దున్న. పట్టు మరింత బిగించి బలమంతా ఉపయోగించి చేతుల్ని ప్రక్కకు వంచాడు కాంసన్.

దున్న కొమ్ములు రెండూ పట, పటమని ఎందుకట్టెల్లా

విరిగి అతని చేతుల్లోకి వచ్చాయ్. కొమ్ములు విరగడంతో ఒక్కసారిగా రక్తం పైకి చిమ్మి దాని ముఖమంతా అలుముకొంది.

దున్న భీకరంగా అరుస్తూ వెనక్కు వెళ్ళి ఒక్కసారిగా ముందుకు దూకింది.

భయపడలేదు శాంసన్.

పిడికిలి బిగించి దున్నకంటే భీకరంగా అరిచాడు. అరుస్తూ చేతిని ముందుకు విసిరాడు.

విసురుగా ముందుకు వచ్చిన దున్న ముఖం తాకింది శాంసన్ చేయి.

బండరాళ్ళు పగిలేట్లు చెవులు దిబ్బలుపడిపోయేట్లు కర్ణకఠోరంగా అరచింది దున్న.

కొండరాళ్ళను పిండిచేయగల బ్రహ్మాండమైన మంగోలియన్ బాక్స్ ప్రొడ్యూస్ చేశాడు శాంసన్. దున్నతల బ్రద్దలై రక్తం బుస్సున చిమ్మింది. క్రిందపడి విలవిలా తన్నుకుంటోందది. రక్తం వరదగా కారి నేలంతా తడుపుతోంది. కొంచెం సేపట్లో దానిలో కదలిక ఆగిపోయింది. దాని జీవాత్మ భౌతికదేహం నుండి విడివడి గాల్లో కలిసిపోయింది.

రక్తంతో తడిసి చిరిగిన షర్టుతీసి చేతికంటిన రక్తం తుడుచుకొని ప్రక్కనున్న పొదలోకి విసిరేశాడు శాంసన్.

తాను చూస్తున్నదంతా కలగా వుంది రీనాకు.

శాంసన్ మనిషేనా అన్న అనుమానం వస్తోందామెకు. గబ, గబా వెళ్ళి శాంసన్‌ను తీగలా చుట్టుకుపోయింది.

“రీనా, వాటీజ్ దిస్!”

ఆమెనుండి విడుపించుకునేందుకు ప్రయత్నిస్తూ అన్నాడు శాంసన్.

ఆడదాని విలువ తెలియనివాడు శాంసన్. కాబట్టే ఏనుగులాంటి అడవిదున్నను విరిచెయ్యగలిగాడు.

రీనా స్పర్శతో అతని శరీరంలో తెలియని మార్పులు కల్గుతున్నాయ్.

రీనాను విడదీయబోతున్న వాడల్లా బలంగా కౌగిలించుకొని ఆమె పెదవులు అందుకొన్నాడు.

రెండు నిముషాల తర్వాత అతన్నుంచి విడివడింది రీనా!

"శాంసన్ నేమో చచ్చిపోయాను గదా! మనమెలా ముందుకు వెళ్ళడం?" అడిగింది.

"టౌరస్ పర్వతాలు ఇంక పదిమైళ్ళ కంటే దూరం వుండవనుకొంటాను. మనం వేగంగా ప్రయాణం చేయగలిగితే రాత్రి వేళకు బాంగోలగూడెం ప్రవేశించవచ్చు. పర్వతలోయలు చేరినతర్వాత అప్పటి సందర్భాన్ననుసరించి మసలుకోవచ్చు" చెప్పాడు శాంసన్.

# 10

ఇద్దరికీ సరిపడా ఆహారపదార్థాలు, గ్రెనేడ్స్' రైఫిల్స్ తీసుకొని, తక్కిన బరువులన్నింటిని అక్కడే వదిలేశారు.

దూరంగా ఆకాశాన్నంటేట్లు కన్పిస్తున్నాయి టౌరస్ పర్వతాలు. ఎత్తైన చెట్లమధ్యనించి నల్లని మబ్బుల్లా కన్పిస్తున్నాయి పర్వతచరియలు.

ఒక కొండ గుట్టపైన వున్న చిన్నగుహలో కూర్చొని వున్నారు శాంసన్, రీనా. సన్నగా మండుతున్న చితుకల మంట వెలుగులో ఆహారం ముగించారు.

"శాంసన్! మనం గూడెంలో ఎలా ప్రవేశించడం?" అడిగింది రీనా.

"అర్ధరాత్రి దాటిన తర్వాత గాని అటవికుల గూడెం చేరడం మంచిది కాదు. అటు చూడు! సన్నగా మిణుగురు పురుగుల్లా కన్పిస్తున్న ఆ వెలుగు ఆటవికులు చలికాగడం కోసం వేసుకున్న సెగల్లు అయివుండవచ్చు" అన్నాడు శాంసన్ గుహాబయటికి తొంగి చూస్తూ.

రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది సమయం.

అడవి అంతా కారుచీకటి ముసురుకుంది. ఉండి ఉండి ఈదురుగాలి ప్రచండంగా వీస్తోంది.

ఎత్తైన కొండ గుట్టమీదికి ప్రక్కనేవున్న లోయ లోంచి సెగడు వెలుతురు అస్పష్టంగా కన్పిస్తోంది.

శాంసన్ మనసులో ఆలోచనలు గూడెం పరిస్థితులు ఆకళించుకోనడానికి ప్రయత్నిస్తున్నాయ్.

"మనం గూడెం ప్రవేశించడానికి ఎలా లేదన్నా మరో రెండుమూడు గంటలు ఆగాల్సివుంటుంది కదూ!" అడిగింది రీనా.

తలూపాడు శాంసన్.

"అంతవరకూ కాలం వృధాచేయడం నాకేమాత్రమూ ఇష్టంలేదు" గోముగా అంది రీనా.

అర్థంకానట్లు చూశాడు శాంసన్.

"మనం గూడెం ప్రవేశించి ప్రాణాలతో తిరిగి బయట పడతామో, లేదో! వున్న ఈ కొద్ది సమయం నీతో సుఖంగా గడపాలని వుంది" అంటూ లేచి శాంసన్ ప్రక్కగా కూర్చుంది రీనా.

సిగ్గు, లజ్జ అనే పదాలు ఆమె నిఘంటువులోనే లేవు. ఆ మాటలకర్థం తెలియని ఆడది రీనా.

శాంసన్ నోరు విప్పకుండానే అతన్ని తనమీదకు లాక్కుంది.

రుచి మరిగిన పులిలా విజృంభించాడు శాంసన్.

వారి ఆనందంతో సంబంధం లేనట్లు రాత్రి గడచి పోతోంది.

# 11

గ్రినేడ్స్ వున్న బాగ్‌ను మోసుకొని చకచకా అడుగులేస్తున్నాడు శాంసన్. భుజానికి మెషిన్‌గన్ వ్రేలాడుతోంది. నడుం కిరువైపులా రివాల్వర్లున్నాయి.

వెనకనే నడుస్తోంది రీనా. ఆమె వద్ద కూడా ఆయుధాలున్నాయి.

బాంగో తెగ గూడెం సమీపానికి వచ్చి ఆగిపోయారు. కనుచూపు కందేంత దూరంలో వుంది గూడెం.

ఓ పెద్దచెట్టు వెనకగా నిలబడివున్నారు శాంసన్, రీనాలు.

మండుతున్న నెగడు స్పష్టంగా కన్పిస్తోంది. నెగడు ముందు కూర్చొనివున్న ఆటవికుల రూపాలు నీడల్లా అస్పష్టంగావున్నాయి.

"రీనా ఇంతవరకూ మన ప్రయాణంలో ఏ జాతి ఆటవికులుగాని ఎదురుపడకపోవడం మన అదృష్టం. ఆటవికుల కంట పడివుంటే ఇంతవరకైనా మనం ప్రాణాలతో వుండేవాళ్ళం కాదు. అవునా" అన్నాడు శాంసన్.

తలూపింది అవునన్నట్లు.

"చీమ చిటుక్కుమన్నా, ఎండుపుల్ల విరిగినంత చిన్న శబ్దమైనా పసికట్టగల శక్తి ఆటవికులకుంది.

వాళ్ళవి పాముచెవులు. మనం ఏ మాత్రమూ శబ్దం కాకుండా నెగడుముందు కూర్చొనివున్న వాళ్ళను చేరుకోవాలి. ఇందులో ఏమైనా పొరపాటు జరిగితే అప్పుడే

మనకు సమాధికట్టబడుతుంది. జాగ్రత్తగా నన్ను అనుస రించు'' ముందుకు అడుగువేస్తూ అన్నాడు శాంసన్.

మౌనంగా అతన్ని అనుసరించింది రీనా.

అర్ధరాత్రి కావస్తోంది. ప్రశాంతంగా నిద్రపోతున్న ట్లుంది గూడెం.

నెగడుముందు కూర్చొని నలుగురు వ్యక్తులు ఏదో మాట్లాడుకుంటున్నారు. పిచ్చుకలు శబ్దం చేస్తున్నట్లు న్నాయి వారి మాటలు.

మందంగా వెలుగుతోంది నెగడు.

అడుగులో అడుగు వేస్తూ నెగడును సమీపించారు శాంసన్, రీనా.

వెనుక ఏదో అలికిడి విన్పించి ఓ అటవికుడు మెడ వెనక్కి త్రిప్పి చూడబోయాడు.

అతనికి ఆ అవకాశం యివ్వలేదు శాంసన్.

అతనితోబాటు ప్రక్కనేవున్న మరో వ్యక్తి మెడను కూడా రెండుచేతుల్తో చుట్టేశాడు.

క్షణంసేపు గిజగిజ తన్నుకున్నారు అటవికులిద్దరూ.

దొంగ మెడను విరిచినంత సులభంగా వాళ్ళ మెడలను విరిచేశాడు శాంసన్.

మెడలు విరిగి ఎముకలు పైకి పొడుచుకొచ్చాయి. పీక తెగిన కోళ్ళలా తన్నుకొని ప్రాణాలు వదిలారు వాళ్ళు.

తక్కిన ఇద్దరూ ప్రమాదం గుర్తించి ప్రక్కనేవున్న విల్లుబాణాలు అందుకోబోయారు.

తాత్సారం చేయలేదు రీనా.

సైలెన్సర్ అమర్చిన ఆమెచేతిలోని రివాల్వర్ టుప్, టుప్ మని రెండుసార్లు శబ్దం చేసింది. ఆమె గురి తప్ప లేదు.

ఒకరి కణతలోనూ, మరో ఆటవికుని నోటిలోనూ దూరి ఆ వైపుకు వచ్చాయి బుల్లెట్లు.

కిక్కురు మనకుండా కూలిపోయారిద్దరూ.

కళ్ళతోనే ఆమెను అభినందించాడు శాంసన్.

రివాల్వర్ చేతిలో పట్టుకొని, గూడెంలోకి అడుగు వేశాడు.

అతన్ని అనుసరిస్తోంది రీనా.

చలి విపరీతంగా వుండడంవల్ల ఆటవికులందరూ గుడిసెల్లో నిద్రిస్తున్నట్లున్నారు. బయట ఎవరూ లేక పోవడంవల్ల నిర్భయంగా అడుగులేస్తున్నారు, శాంసన్ రీనాలు.

అయినా ఏవైపునుంచి ప్రమాదం ముంచుకొస్తుందోనని జాగ్రత్తగా నలువైపులా చూస్తున్నారు.

జర్రావృక్షపు ఆకులతో కప్పబడివున్న గుడిసెలవి. వెదురుదుబ్బలతో చేసిన తడికెలు, గుడిసెలకు తలుపులుగా అమర్చబడి వున్నాయి. చీమచిటుక్కుమన్నా విన్పించేంత నిశ్శబ్దంగా వుంది గూడెం.

గుడిసెకు కొంచెం దూరంగా కాపలావాళ్ళు వుండడం వల్ల, సైలెన్సర్ అమర్చిన రివాల్వర్ శబ్దం పెద్దగా చప్పుడు కానందువల్ల, గాఢనిద్రలోవున్న ఆటవికులెవరూ మేల్కొ లేదు.

ఇది ఒకరకంగా శాంసన్ రీనాల అదృష్టం!

ముందుకు నడుస్తున్న వాడల్లా చటుక్కున ఆగి పోయాడు శాంసన్. అన్నిటికంటే ప్రత్యేకంగా వుంది ఆ గుడిసె.

మిగతా గుడిసెలకు కొంచెం ఎడంగా ఎత్తైన మట్టి దిమ్మమీద నిర్మించబడివుంది.

గుడిసెలోనికి ప్రవేశించడానికి అనువుగా రెండు మెట్టికలు వున్నాయి. గుడిసెకు అమర్చిన వెదురు తడికెలో నుండి సన్నగా వెలుతురు బయటికి ప్రసరిస్తోంది.

రీనాను ఆగమన్నట్లు సైగచేసి, శాంసన్ ఆ గుడిసె కమర్చిన వెదురు తడికెలోనికి తొంగి చూశాడు.

అతని కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"రీనా మనకు కావల్సిన గుడిసె యిదే. మనం దానిలోకి ప్రవేశించాలి" నెమ్మదిగా వంగి ఆమె చెవిలో చెప్పాడు.

తలూపింది రీనా సంతోషంగా.

గుడిసెలోకి వెళ్ళడానికి ఎక్కడైనా మార్గం వుందేమోనని, ఒకసారి చుట్టుతిరిగి వచ్చాడు శాంసన్.

అటువంటి మార్గమేమీ కన్పించలేదతనికి.

చివరికి ద్వారంగుండానే లోపలికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు.

ద్వారానికమర్చివున్న వెదురు తడిక పెద్ద ఆటంకంగా కన్పించలేదతనికి.

గ్రైనేడ్స్‌వున్న సంచిని రీనాకిచ్చి రెండు చేతులతో తడికెనుపట్టి తోశాడు శాంసన్.

సన్నగా చప్పుడుచేస్తూ వెదురుతడిక తొలగి లోపలికి వెళ్ళడానికి మార్గమేర్పడింది.

చటుక్కున ఇద్దరూ లోపలికి వెళ్ళి, తడిక తిరిగి మూసేశారు యథాప్రకారంగా.

# 12

గుడిసె లోపల ఒక ఎత్తయిన మట్టి అరుగుమీద ఏదో క్షుద్రదేవతా విగ్రహముంది.

ఆ విగ్రహానికి ఎదురుగా నాలుగడుగుల మేర నేల అలికి శుభ్రపరచబడివుంది. దానిమీద ముగ్గులు వేసినట్లు

అల్లిబిల్లిగా ఏవో గీతలు గీయబడివున్నాయి. ఆ ముగ్గుల మీద రకరకాల అడవిపూలు వొత్తుగా చల్లబడివున్నాయి. ఆ పూలమధ్యలో ఓ చెక్కపీటపై వెలుగులు విరజిమ్ముతూ వుంది ఓ రత్నకిరీటం.

ఆ కిరీటంలో పొదగబడ్డ మణులు, వజ్రాల నుండి వెలువడే కాంతితో గుడిసె అంతా పట్టపగల్లావుంది. ఆ వెలుతురే తనకు వెదురుతడిక గుండా బయటికి కన్పించిందని గ్రహించాడు శాంసన్.

కిరీటం ఉపరిభాగంలో దివ్యకాంతులతో మెరిసిపోతోంది రాణా సంగ్రామసింహుని ప్రతిమ.

తలకు శిరస్త్రాణంతో,ఆపాదమస్తకం యుద్ధదుస్తులతో ఒక చేతిలో శూలంతో, రసపుత్రవీరుల ప్రతిరూపమైన రాణాసంగ్రామసింహుని సజీవరూపాన్ని గుర్తుకుతెప్పిస్తోంద్రా ప్రతిమ.

తమకు కావాల్సిన కిరీటం అదేనని దృఢపర్చుకొన్నాడు శాంసన్. ఆనందంతో అతని మనస్సు ఉరకలు వేస్తోంది.

రీనా సంగతి సరేసరి. కళ్లు ఆర్పకుండా తదేకంగా కిరీటాన్ని చూస్తోంది.

కిరీటాన్ని చూస్తూ క్షణంసేపు పరిసరాలు మరిచిపోయారిద్దరూ.

'జుయ్' మన్న శబ్దంతో శరవేగంగా వచ్చిన బరిసె ఒకటి రివాల్వర్ పట్టుకున్న రీనా చేతిలో దిగబడింది.

'కవ్వ్'న కేకవేసి బాధతో అలాగే కూలబడిపోయిందామె.

అదిరిపడి వెనక్కి తిరిగాడు శాంసన్.

ఎదురుగా దాదాపు ఆరున్నర అడుగులకు పైగా ఎత్తుతో కాలయముడిలా నిలబడివున్నాడు బాంగో తెగ అటవిక నాయకుడు గొంబాసా.

అటవిక దేవత కట్టుపొవుగా గుడిసె మధ్యలో అడవి తీగలతో అల్లిన సన్నటి తడిక వుంది. అది గుడిసెను రెండుభాగాలుగా చేస్తోంది. ఆ రెండవభాగంలో పడు కొనివున్నాడు గొంబాసా. ఆ సంగతిని రీనాగాని, శాంసన్ గాని పసిగట్టలేకపోయారు.

గుడిసె ద్వారానికి బిగించబడివున్న వెదురుతడిక సన్నగా శబ్దం చేయగానే మేల్కొన్నాడతను.

తన అనుచరులెవరైనా వచ్చారేమోనని కొంతసేపు అలాగే వుండిపోయాడు. వచ్చినవారెవరో మౌనం వహించేసరికి అనుమానం వచ్చి లేచాడు. ఇద్దరు అపరిచిత వ్యక్తులు కనిపించారు. వెంటనే బరిసె గురిచూసి విసిరాడు. నిత్రమత్తులో అది గురితప్పి రీనా చేతిలో దిగబడింది.

శాంగో తెగ అటవికులలో ఒక విచిత్రమైన ఆచారం వుంది. ప్రతియేడూ నాయకత్వం కోసం ఆ తెగలో పోటీలు జరుగుతాయి. గురిగా బరిసె విసరడం, కుస్తీలు, ఉత్తిచేతులతోనే పులి, ఎలుగు మొదలగు క్రూరజంతువులతో పోరాడడం నాయకత్వం కోసం జరిగే పోటీలలో ప్రధానమైనవి.

నాయకుడైన వాడు వివాహం చేసుకోకూడదు వారి తెగలో. కానీ ఎంతమంది కన్యలనైనా అనుభవించవచ్చు.

నాయకుని కోసం ప్రత్యేకమైన గుడిసె ఏర్పాటు చేయబడి వుంటుంది. తెగ వారికందరికీ ప్రాణప్రదమైన వస్తువులన్నీ అతని ఆధీనంలోనే వుంటాయి.

ఒక విధంగా చెప్పాలంటే నాయకుడన్నవాడు ఆ వస్తువులకు కాపలాదారుతో సమానం.

అందువల్లనే కిరీటంవున్న గుడిసెలో గొంబాసా తప్ప మరెవ్వరూ లేరు.

మెరుపులా రివాల్వర్ ప్రేల్చాడు శాంసన్. అంతకంటే వేగంగా కదిలాడు గొంబాసా. ఎడంచేతిలోని గండ్ర గొడ్డలిని కుడిచేతిలోకి మార్చుకొంటూ శాంసన్ పైకి దుమికాడు.

బుల్లెట్ గురితప్పి గోడలో దూరింది.

తనమీదికి వచ్చిన గొడ్డలి వేటును నేర్పుగా తప్పించుకొన్నాడు శాంసన్. అదిరిపాటులో రివాల్వర్ నేలపై పడిపోయింది.

క్రింద పడివున్న రీనా విపరీతంగా ఏడుస్తోంది. చేతిలో దూరిన ఈటెను లాగడానికి ప్రయత్నిస్తోంది. ఆమె ప్రయత్నం ఫలించకపోగా బాధ ఎక్కువైంది.

ఒకవైపు రీనా ఏడ్పు, మరోవైపు శాంసన్, గొంబాసాల పోరాటం. అజకికి గూడెం అంతా మేల్కొంది.

గుడిసెబయట, అరుపులు శబ్దాలు ఎక్కువౌతున్నాయి. మొదట వేటు తప్పగానే ఆవేశంతో తిరిగి గొడ్డలి విసిరాడు గొంబాసా.

గొంబాసా చేయి క్రిందకు దిగకముందే, ఆ చేతిని పట్టుకొన్నాడు శాంసన్.

క్షణంసేపు బలాబలాలు పరీక్షించుకొన్నారు.

సుమారు నాలుగువందల పౌన్ల శరీరంతో ఎనుబోతులా వున్నాడు గొంబాసా. ముళ్ళపందిని గుర్తుకుతెప్పించే పీచు రేగిన తల, ఎఱ్ఱటి మిడిగ్రుడ్లు, భీకరమైన రూపం.

గొంబాసా మణికట్టు పట్టుకొని, ఆఫ్రికన్ వూడే పద్ధతిలో పైకి విసిరాడు శాంసన్. నాలుగడుగులు గాల్లో పైకి లేచి గుడిసెలకప్పు తన్నుకొని క్రిందపడ్డాడు వాడు. గొడ్డలి ఎగిరి ప్రక్కగా పడిపోయింది.

బంతిలా పైకిలేచి తిరిగి శాంసన్ మీదకు లంఘించాడు వాడు. ఇక ఆలోచించలేదు శాంసన్.

పిడికిలి బిగించి బలంగా గొంబాసా కడుపుపై గుద్దాడు. గుడిసె కప్పుగోడలు దద్దరిల్లేట్లు అరిచేడు గొంబాసా.

శాంసన్ పిడికిలి గొంబాసా కడుపులోదూరి ప్రేవుల్ని బయటకు లాగింది. దబ్బున క్రిందపడ్డాడు వాడు.

భీకరంగా తన్నుకొంటూ తల అటు ఇటూ వూపుతూ నరకాన్ని అనుభవిస్తున్నాడు గొంబాసా. గదంతా రక్తం పారుతోంది, ప్రేవులు నేలజీరాడుతూ భయం పుట్టిస్తున్నాయ్.

బయట కేకలు ఎక్కువై 'కిర్' మన్న శబ్దంతో వాకురు తడిక లోపలికి పడింది.

బరిసెలు, విల్లు బాణాలు, గొడ్డళ్ళు ధరించిన అటవికులు ప్రవాహంలా వస్తున్నారు గుడిసెలోకి. లోపల జరిగిన భీభత్సం చూడగానే రెచ్చిపోయారు అటవికులు.

క్రింద పడివున్న రీనా భీకరంగా అరచింది.

ఆమె చేయిని చెరుకు నమిలినట్లు నములుతున్నాడు పదేళ్ళ పిల్లవాడొకడు. చూస్తుండగానే మరి నలుగురు ఆమెపైకి దూకారు. ఆమె రొమ్ము కనికున్న కొరికాడు ఒకడు.

మరోసారి అరవబోయింది రీనా.

ఆమెకా అవకాశం రాలేదు. ఆమె పీక కొరికి రక్తం జుర్రుకుంటున్నాడు మరొక అటవికుడు.

అందమైన జరీనా రూపంనుండి ప్రాణం వేరయి పోయింది. తృప్తిగా ఆమె చుట్టూ చేరిపోయారు అటవికులు.

గొంబాసా చావగానే ఒక్క అంగలో కిరీటం చేజిక్కించుకొన్నాడు శాంసన్. సంచిలోంచి నాలుగు హైండ్రనేడ్స్ తీసుకొని, మెషిన్‌గన్‌తో, రత్న కిరీటంతో

గుడిసె మట్టిగోడను గుద్దుకొని బయటపడ్డాడు. ఒకవైపు గుడిసె కూలిపోయింది.

పిచ్చిగా అరుస్తూ అతని వెంట పడ్డారు కొంతమంది ఆటవికులు.

ప్రాణంపై ఆశ వదులుకొని పరుగెడుతున్నాడు శాంసన్. కొంతదూరం వెళ్ళి, ఓ గుడిసెచాటున నిలబడి నోటితో పిన్ లాగేసి నాయకుని గుడిసెవైపు గ్రెనేడ్‌ను విసిరాడు బలంగా.

నాయకుని గుడిసె, గుడిసెలోని ఆటవికులు శవాలు గాల్లో కెగిరాయ్.

అక్కడ గుర్తుపట్ట లేనంతగా పెద్ద గొయ్యి ఏర్పడింది. ఇంక కొంత దూరం వెళ్ళి మరో గ్రెనేడ్ విసిరాడు.

గుడిసెల మధ్య పడి బ్రహ్మాండమైన శబ్దంతో ప్రేలిందది.

మరికొన్ని గుడిసెలు, ఆటవికుల శరీరాలు గాల్లోకి లేచాయి.

ఇంకా మిగిలిన ఆటవికులు కేకలు వేస్తూ శాంసన్ వేపు పరుగెత్తుకొస్తున్నారు.

జిగ్ జాగ్ గా పరుగెడుతున్నాడు శాంసన్. ఆయాసం వల్ల రొప్పుతున్నాడు.

బరువైన అతని శరీరం వేగంగా పరుగెత్తడానికి సహకరించడం లేదు. అడ్డువచ్చే పొదలు, చిన్నచిన్న చెట్లను దాటుకొంటూ వెళ్తున్నాడు. ఎటువెళ్ళాలో, ఎటువైపు వెళ్తున్నాడో ఆలోచించడంలేదు.

బొంగోలనుంచి తప్పించుకు బైటపడాలి. వెనక నుంచి కేకలు, అరుపులు విన్పిస్తోనే వున్నాయ్. వాళ్ళకు చిక్క

కూడదు. చిక్కితే తనకూ రీనా గతే పడుతుంది. ఆలోచి స్తూనే పరుగెడుతున్నాడు. అటవికుల అరుపులు కేకలు క్రమంగా దగ్గరౌతున్నాయ్.

పరుగెడుతున్నవాడల్లా దబ్బుమని ఓ బురద గుంటలో పడిపోయాడు. తనెక్కడో పాతాళానికి దిగిపోతున్న ట్లనిపించింది శాంసన్‌కు. కాళ్ళు రెండు కూరుకుపోతు న్నాయి.

చేతులు రెండు పైకెత్తాడు అప్రయత్నంగా. చేతిలో వున్న రత్నకిరీటం ఎక్కడో పడిపోయింది.

చేతులతో ఇరువైపులా వెతుకుతున్నాడు. చేతులకు చిక్కగా నాచుకంపు కొట్టూ తగిలింది బురద. అంటే! తను...తను...ఊబిలో దిగబడిపోయాడా? అప్పటికే నడుంవరకూ కూరుకుపోయాడు.

బరువైన శరీరం, దానికి తోడూ, బయటపడాలని కాళ్ళు చేతులు కదిలించడంతో మరింతగా దిగబడిపోతుం దతని శరీరం.

భయంకరమైన ఊబిగుంట తనను మింగేస్తోందని అప్ప టికిగాని అర్థం కాలేదతనికి.

ఇక ఎవ్వరూ తనని రక్షించలేరు.

ఎంత భయంకరమైన చావు?

ఎక్కడి టెక్సాస్? ఎక్కడి బిజారా అరణ్యాలు?

సైకోగా మారిపోయాడు శాంసన్. తన సహచరు లందరూ ఒకసారిగా అతని కళ్ళముందు మెదిలారు.

జరీనా! ఆడదంటే తెలియని తనకు ఆ సుఖం ఏమిటో నేర్పింది.అటువంటి రీనా బాంగోలకు ఆహారంగా మారింది. ఏడుపు వస్తోందతనికి.

అడవి దున్నను రెండుగా విరిచెయ్యగలిగిన శాంసన్

తన్ను తాను కాపాడుకోలేక ఏడుస్తున్నాడు. ఫెర్నాండో, జోమా, మిల్కా ఖాన్, జరీనా అతని కళ్ళ ముందు మెదిలారు.

అప్పటికే గొంతువరకూ దిగబడిపోయాడు ఊబిలో. ఇంకొన్ని క్షణాల్లో తనకు సమాధి.

సజీవ సమాధి.

దీనికంతటూ కారకుడు విలియం గోపల్లవ.

డక్టే క్రూక్స్ లస్టీ బార్బేరియన్. వాడు...వాడే దీనికంతా కారకుడు.

వాణ్ణి...వాణ్ణి...పిచ్చిగా నవ్వాడు శాంసన్. తెరలు తెరలుగా నవ్వాడు.

అంతే నవ్వుతున్న అతని నోరు బురదతో నిండి పోయింది. మరికొన్ని క్షణాల్లో శాంసన్‌ను మింగేసిన ఊబి నిర్మలంగా వుండిపోయింది.

పొదల్లోపడివున్న కిరీటం ఏమీ తెలీయని నంగనాచిలా కాంతులు విరజిమ్ముతూ తన విలువను చాటులోంది.

శాంసన్ నవ్వువిని అటుగా వచ్చిన ఆటవికులకు పరిస్థితి అర్థమై తృప్తిగా నిట్టూర్చారు.

తమకు ఆరాధ్య దేవతలాంటి కిరీటం వారిని ఆశీర్వదిస్తో న్నట్లుంది.

—:అయిపోయింది:—

# అసమర్థుడి పరిశోధన!

ఏ. వీ. మోహన్రావ్

ఆఫీసురూంలో కూర్చుని హాయిగా సిగరెట్ పొగ పీలుస్తూ, క్రైమ్ మాగజైన్ చదువుతున్నాను.

ప్రొద్దుట్నించి విడవకుండా పడుతుంది వర్షం.

దూరంగా టక్కు టక్కుమంటూ మెల్లిగా ఒకదాని వెంటపడుతున్న అడుగులశబ్దం వినవచ్చింది. మరో నిముషానికి ఆ శబ్దం నా గదిముందుదాకా వచ్చి ఆగింది. మరుక్షణం తలుపుమీద వ్రేలితో తట్టిన శబ్దమైంది.

"తలుపు తీసేవుంది. తోసుకొని రండి!" అన్నాను.

మరుక్షణం తలుపు తెరుచుకుంది. గుమ్మంలో ఫ్లవర్ ప్రింట్స్‌తోవున్న రెయిన్‌కోట్ తొడుక్కున్న స్త్రీ కనిపించింది.

"నమస్తే!" అందామె.

"ఆ కోటు విప్పి, వెలుపల పెట్టి రండి" అన్నాను.

ఆమె గుమ్మంలో నిలుచుని కోటు తీసింది. దాన్ని ఉండగచుట్టి, గది వెలుపలున్న స్టూలుపైన పెట్టి వచ్చింది.

ఆమె పచ్చరంగు పిస్తాను చీర, అదేరంగు పాలిస్టర్ జాకెట్ వేసుకుంది. మెళ్ళో సన్నటి బంగారు గొలుసు వుంది. సన్నటి శంఖంలాంటి పొడవుపాటి మెడ, సూటిగా వున్న ముక్కు, పల్చటి పెదాలు, విశాలమైన కళ్ళు, వెడల్పాటి నుదురు, అన్నీ కలసి, వెరసి ఆమెను అందగత్తెగా తీర్చిదిద్దినట్లనిపించింది.

"కూర్చోండి!" అన్నాను.

ఆమె చీరకుచ్చెళ్ళు సవరించుకుని కూర్చుంది.

"డిటెక్టివ్ సుధాకర్ మీరే కదూ!" అడిగింది ఆమె.

నవ్వుతూ తలూపాను.

"నాకో చిన్నపని చేసిపెట్టడానికి ఒక డిటెక్టివ్ కావలసి వచ్చింది. కొంతమంది ఫ్రెండ్స్‌ను కన్సల్ట్ చేశాను. మీ పేరు చెప్పారు. నాకు తెలివితేటలున్న మనిషికన్నా, నిజాయితీగల మనిషి కావాలి" అంది.

"మీ ఫ్రెండ్స్ అది నాకుందని చెప్పారా?"

"ఊఁ!"

"అంటే తెలివితేటలులేవని వాళ్ళ అభిప్రాయమా?"

"నేనడగలేదు. అయినా వాటితో నాకు పనిలేదు."

"ఇంతకు అసలు విషయం చెప్పలేదు" అంటూ గుర్తు చేసాను.

"నా పేరు లీల. మా వారిపేరు రాజాచంద్ర. ఈ వూళ్ళోవున్న వ్యాపారాల్లో మూడొంతులు మా కుటుంబానివే" అందామె.

"తెలుసు. మీవారి గురించి విన్నాను. కానీ పరిచయం లేదు నాకు."

"అతను చాలా హైసర్కిల్ మనిషి. మామూలుగా

మీలాంటి వాళ్ళకు పరిచయంకాదు" నన్నో అనామకుడి క్రింద లెఖగట్టి మాట్లాడే ఆమె తీరు మొదట్నుంచీ నాకు కాస్త అసహ్యంగానే వుంది.

"అతని పరిచయం నాకు తిండిపెట్టదు. పోనీండి. ఇంతకూ మీరొచ్చిన విషయం చెప్పండి" అన్నాను.

"మావారు ఎవరో ఒక స్త్రీ మైకంలో పడిపోయారు. అది ఎన్నాళ్ళనాడు మొదలయిందో నాకు తెలీదు. నా దృష్టికివాళే వచ్చింది. ఆమె ఏదో రహస్యం చేతిలో పెట్టుకొని మావార్ని బెదిరించి డబ్బు గుంజుతున్నట్లుంది. ఆమె ఎవరు? ఆమె మావార్ని ఏ సాకుతో బ్లాక్ మెయిల్ చేస్తోంది కనుక్కోవాలి. అంతే!" అందామె.

"ఈ విషయం మీవార్ని అడిగితే చెప్పరా?"

"చెప్పడు. పైగా అలాటిదేమీ లేదని బుకాయిస్తాడు."

"ఆమెతో మీరు మాట్లాడలేక పోయారా?"

"ఆమె ఎవరో నాకు తెలీదు. పైగా తెలుసుకుని మాట్లాడినా, తనకేం తెలీదనో, నా భర్తను తను బ్లాక్ మెయిల్ చెయ్యడంలేదనో బుకాయించవచ్చు. అందువల్ల అది లాభంలేదు" అందామె.

"అసలు ఎవరో మీవార్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నట్లు ఎలా తెలిసింది?" అడిగాను నేను.

"చాలా విచిత్రంగా జరిగింది. ఇవాళ ఉదయం నా ఫ్రెండుకు టెలిఫోన్ చేద్దామని హాల్లోకి వచ్చాను. రిసీవరు తీసుకొని చెవిదగ్గర పెట్టుకున్నాను. ఇయర్ఫోన్లో మాటలు వినిపించసాగాయి. దాని ఎక్స్టెన్షన్ మేడ మీద మావారి గదిలో వుంది. అలాగే ఓపిగ్గా విన్నాను. రెండు నిముషాలు జరిగింది సంభాషణ. అవతలవేపు మాట్లాడుతున్నది స్త్రీ అన్న విషయం గొంతునుబట్టి అర్థ

మైంది. ఆమె పేరు లావణ్యనికూడా తెలుసుకున్నాను. లక్షరూపాయలిస్తే, ఇక డబ్బు ఇవ్వవలసిన అవసరం వుండదని చెప్పింది. అంత డబ్బు తనదగ్గర లేదంటూ మా వారు చెప్పారు. ఎందుకైనా రేపు మధ్యాహ్నం నాలుగు గంటలకు ఈగల్ బార్‌లో కలుసుకోమని కోరింది. మా వారు సరేనన్నారు. ఆయన ఫోన్ పెట్టేశాక నేనూ ఫోన్ పెట్టేసాను" అంది లీల.

"బాగుంది. అయితే నన్నేం చెయ్యమంటారు?"

"మీరు రేపు ఈగల్ బార్‌కు వెళ్ళండి. వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకునేది తెలుసుకోండి. ఆ తర్వాత ఆమెను వెంబడించి, అడ్రసు సంపాదించండి. వీలైతే ఆమె పుట్టు పూర్వోత్తరాలుకూడా సేకరించండి. ఆ వివరాలు నాకు చెప్పండి చాలు" అంది లీల.

"అంటే మీవార్ని బ్లాక్ మెయిల్ నుంచి తప్పించే ప్రయత్నంగానీ, ఆమెను బెదిరించి పంపివేసే పనిగానీ చెయ్యనవసరం లేదంటారు?" అన్నాను.

"అది తర్వాత ఆలోచించి చెపుతాను. ఈ పని చేసినందుకు మీ ఫీజు ఎంతో చెప్పండి. ఇస్తాను."

"పని పూర్తయ్యాక మీకు తోచింది ఇవ్వండి చాలు" అన్నాను.

"అలాకాదు!" అంటూ పర్సు తెరిచి వెయ్యి రూపాయలు తీసి ఇచ్చింది. అందుకున్నాను.

"నేను శెలవు తీసుకుంటాను" అంటూ లేచింది.

"మీ యింటి నెంబరు ఇవ్వండి. పని అయ్యాక మీకు వివరాలు చెప్పాలిగదా?" అన్నాను.

"అవసరం లేదు. నేనే వస్తాను. మీరు ఫోన్ చేసినా, మా యింటికొచ్చినా ఆయనకు తెలుస్తుంది. అనుమాన

పడతారు. దాంతో నా పథకం చెడిపోతుంది'' అంది లీల.

''సరే! మీకోసం వెయిట్ చేస్తాను. కానీ మీవారి ఫోటో ఏదైనా కావాలి. ఆయన్ను నేను గుర్తుపట్టాలిగా''

''నా దగ్గర ఫోటో లేదు. ఆయన బయలుదేరేముందు ఎలాంటి కోటు పాంటు వేసుకున్నదీ, టై కట్టుకున్నదీ మీకు ఫోన్లో చెపుతాను. దాన్నిబట్టి ఆయన్ను సులభంగా గుర్తుపట్టవచ్చు'' అంది లీల.

''అలాంటి డ్రెస్ మరొకరు వేసుకుంటే...'' నా అనుమానం వ్యక్తంచేసాను.

''అదంత సులభంగాదు. మీరు వార్ని సులభంగా గుర్తించగలిగే విధంగా డ్రెస్ చేసి పంపుతాను. ఓ.కే.'' అంది లీల.

''ఓ.కే!'' అన్నాను.

ఆమె లేచింది...హాల్లోకి వెళ్ళి రెయిన్కోటు తొడుక్కుంది. అడుగులు చకచక వేసుకొంటూ వెళ్ళిపోయింది లీల.

రాజాచంద్ర ఏదో సెక్స్ గొడవల్లో ఇరుక్కుని బ్లాక్మెయిల్ చెయ్యబడుతూ వుండాలనిపించింది.

నేను చెయ్యవలసిందేమీ కనుపించలేదు. లీల ఫోన్ చేసి ఆమె భర్త గురించి వివరాలు చెప్పాకగానీ, నేనీ కేసులో పని ప్రారంభించవలసిన అవసరంలేదు. అలో చిస్తూ కూర్చున్నాను సిగరెట్ ముట్టించుకొని.

## 2

రాత్రి ఏడయింది.

ఆఫీసులోనే కూర్చుని వున్నాను. ఉన్నట్టుండి టెలిఫోన్ మ్రోగింది. రిసీవరు పైకెత్తాను.

అవతలివేపునుండి "హల్లో!" అన్న శబ్దం వినిపించింది.

నేను కూడా "హల్లో" అన్నాను.

"డిటెక్టివ్ సుధాకర్ గారేనా మాట్లాడుతూంట."

"అవును."

"నా పేరు లావణ్య" అందామె.

"ఏం కావాలి?"

"నా గురించి మీకు రాజాచంద్ర భార్య లీల ఏమన్నా చెప్పిందా?" అడిగింది లావణ.

"అలా చెప్పి వుంటుందని మీకెందు కనుమానం వచ్చింది."

"ఇవాళ ఆమె మీ ఆఫీసుకు రావడం చూసాను. ఆమె భర్తను వల్లో వేసుకుని, నేను అతని డబ్బంతా లాక్కుంటున్నాని ఆమె నాపైన అభియోగం చేసి వుండాలి" అందామె.

"ఏమో?" అన్నాను.

"అదేమిటి అలా తెలియనట్లడుగుతున్నారు. ఆమె ఏం చెప్పింది?" అడిగింది లావణ్య.

"ఆమె ఏం చెప్పినా, అది నాకూ ఆమెకూ మధ్య వున్న విషయం. పైగా రహస్యం. మరొకమనిషికి చెప్పవల సిన అవసరం నాకు కనుపించడం లేదు. ఇంతకూ మీ రెందుకు ఫోన్ చేసినట్లు?"

"ఆమె మాటలు అన్నీ అబద్ధాలు. నాకూ రాజా చంద్రకు సంబంధం లేదు. అతనితో నాకు డబ్బు పరమైన లావాదేవీలు అసలు లేవు. ఈ విషయం మీరు తెలుసు కోవడం మంచిదని చెప్పేందుకు ఫోన్ చేసాను" అంది లావణ్య.

"థాంక్స్! ఇంతకూ మీ రెక్కడనుంచి మాట్లాడు తున్నారు?"

"అది మీ కనవసరం!"

"పోనీ అడ్రసేమిటి?"

"అదీ మీకు అవసరం లేదు."

"అయితే మీతో మాట్లాడే అవసరంగానీ, మీరు చెప్పిన విషయాలు నమ్మవలసిన అగత్యంగానీ నాకు లేదు" అంటూ తక్కున ఫోన్ రిసీవర్ క్రేడిల్ పైన పడే శాను.

లీల ప్రొద్దున్న వానలో నా ఆఫీసుకు వచ్చింది. ఈ రూమ్లో నాతోపాటు పది పన్నెండుమంది డిటెక్టివ్ లు వున్నారు. లీల నా దగ్గరకే వస్తుందని లావణ్య ఎలా వూహించిందో అర్థంకాలేదు. లీలను చూడకుంటే, చూచి నట్లు ఎలా ఫోన్లో చెప్పగలుగుతుంది?

లీల చెప్పిందాన్ని బట్టి లావణ్య ఎవరో, ఏమిటో, ఎలావుంటుందో, ఎక్కడుంటుందో, తనకు తెలీదు. అలాం టప్పుడు లావణ్యకు మాత్రం లీలను ఎలా తెలిసివుంటుంది. రాజాచంద్ర భార్య కాబట్టి, ఆమెను దూరంనుండి చూసి వుండవచ్చేమో ననుకున్నాను.

లీల చెప్పినమాటలు నిజంకావని చెప్పడానికి లావణ్య ఫోన్ చెయ్యవలసిన అవసరం ఏమొచ్చిందో నాకు తెలీ లేదు. నేనెటూ పరిశోధిస్తాను. ఆ తర్వాత అసల్లు విషయం బైటపడుతుంది. లావణ్య అంతదాకా ఆగి వుంటే బాగుండేదనిపించింది.

నిజంగానే లావణ్యకీ గొడవతో సంబంధంలేదేమో! ఆ విషయం నాకు చెప్తే, అనవసరంగా ఆమెను వెంబ డించడంగానీ, లేదా ఆమె గురించి వాకబు చెయ్యడం గానీ, చెయ్యకుండా వుంటానన్న ఉద్దేశ్యంతో ఆమె నాకు ఫోన్ చేసి వుండవచ్చు.

ఏమైనా కార్యరంగంలోకి దిగితేకప్ప, నా అనుమా నాలు నివృత్తి కావడం జరగదనిపించింది.

సిగరెట్ తీసి వెలిగించుకున్నాను. గట్టిగా దమ్ములాగి, ముక్కులగుండా పొగ వదిలాను. మెదడు భారంతగ్గి, కాస్త తేలికపడినట్లనిపించింది.

కుర్చీలోంచి లేచి గదంతా పచార్లు చెయ్యసాగాను.

ఇలాంటి సమయాల్లో నా అసిస్టెంటు వసంత లేని లోటు కొట్టొచ్చినట్లు కనుపించింది. ఆమెతో నా అను మానాలు చర్చిస్తే, కొన్ని కొన్ని క్రొత్త విషయాలు బయటపడుతుంటాయి. ఆమె వారం క్రితమే స్నేహితు రాలి పెళ్ళికని, సెలవు తీసుకొని వెళ్ళింది.

బల్లపైనున్న ఫోన్ మ్రోగింది మళ్ళా.

వెళ్ళి క్రేడిల్ తీసుకున్నాను. చెవిదగ్గర పెట్టుకొని "హల్లో!" అన్నాను మెల్లిగా.

"ఎవరు మాట్లాడేది?" అడిగింది అవతలివేపు కంఠం.

"మీ రెవరు?" ఎదురుప్రశ్న వేశాను.

"నా పేరు రాజాచంద్ర. ఒకమారు డిటెక్టివ్ సుధా కర్ గారితో మాట్లాడాలి. చాలా అర్జంటు. వా రున్నారా?" అడిగా డవతలి వ్యక్తి ఆతృతగా.

"ఆఁ! నేనే సుధాకర్‌ను. ఏం కావాలి?"

"ఏం లేదు! నా భార్య లీల ఈదినం మిమ్మల్ని కలుసు కుందటగదూ. ఆమెకు నాపైన పెద్ద అనుమానం. నాకు చాలామంది స్త్రీలతో పరిచయంవుందనీ, వాళ్ళకోసం డబ్బు ఖర్చు పెడుతున్నాననీ, అనుకుంటూ వుంటుంది" అంటూ ఆగాడు అతను.

"అయితే...?" అన్నాను నేను.

"కానీ ఆమె అనుమానానికి అర్థంలేదు. నే నలాంటి వాణ్ణిగాను."

"అయినా నాకెందుకు చెప్పడం? అవి మీ స్వంత విషయాలు."

"అనే అనుకున్నాను. కానీ ఇంతకుముందు నాకు లావణ్య అనే ఆమె ఫోన్ చేసింది. నా భార్య మీ ఆఫీసులోంచి రావడం చూసిందట. మీతో కూడా మాట్లాడిందట. నాకూ ఆమెకూ ఏ విధమైన సంబంధం లేదు. ఈ విషయం చెప్తామని ఫోన్ చేశాను" అన్నాడు రాజాచంద్ర.

"మీ భార్యను లావణ్య ఎలా అనుమానించి వుంటుందో నాకు అర్థం కావడంలేదు" అన్నాను.

"ఆమెను సెక్రెటరీగా తీసుకుందామనుకుని రెండు మూడుసార్లు ఆఫీసుకు పిలిపించాను. ఒక పార్టీకూడా తీసుకెళ్ళాను. అది నా భార్య చూసింది. అప్పట్నుంచి నన్ను అనుమానిస్తోంది. ఆమె మాయలోపడి తనకు విడాకులిస్తానేమోనని భయం. లీల ఉత్త పిచ్చిది. ఆమె మాటలు సీరియస్‌గా తీసుకోకండి!"

"అవుననుకోండి! కానీ ఆమెదగ్గర ఫీజు తీసుకున్నాను" అన్నాను నవ్వుతూ.

"అది వుంచుకోండి. అంతకు రెట్టింపు నేనిస్తాను. అనవసరంగా మా వెంటపడి, మమ్మల్ని అల్లరిపాలు చెయ్యకండి" ప్రాధేయపడుతున్నట్లు అడిగాడు రాజాచంద్ర.

అతనికే విధమైన హామీ యివ్వడం నాకిష్టంలేక పోయింది. అందుకే "చూద్దాంలెండి. మిమ్మల్ని అల్లరి పెట్టడం మాత్రం నా ఉద్దేశ్యం కాదు!" అన్నాను.

ఆ తరువాత, అతని మాటలు వినే అవసరంలేకుండా ఫోన్ కట్ చేశాను.

నా కంతా అయోమయంగా వుంది. లీల వచ్చి వెళ్ళిన తర్వాత, లావణ్య, రాజాచంద్ర యిద్దరూ నాకు ఫోన్ చెయ్యడం అసంగతంగానూ, వింతగానూ అనిపించింది.

ఏది ఏమైనా, లీలకు యిచ్చిన మాట నిలబెట్టుకోవడానికే నిర్ణయించుకున్నాను.

## 3

మధ్యాహ్నం మూడు కావస్తూంది.

అంతకుముందే వెళ్ళి కారు టాంక్ నిండా పెట్రోలు పోయించుకొచ్చాను. అక్కడే టైర్ల గాలికూడా చెక్ చేయించాను. అవసరమైతే రెండొందల మైళ్ళు ఏ విధమైన ట్రబుల్ లేకుండా వెళ్ళగలుగుతుందని నిర్ణయించుకున్నాను.

ఫోన్ దగ్గరే కూర్చున్నాను.

అప్పుడప్పుడు వాచీకేసి చూసుకోసాగాను.

సరిగ్గా మూడు గంటలా నలభైఅయిదు నిముషాలయింది.

ఫోన్ గణగణమని మ్రోగింది.

ఠక్కున చెయ్యిచాచి క్రేడిల్ పైనున్న రిసీవరు అందుకున్నాను.

"సుధాకర్ స్పీకింగ్!" అన్నాను.

"నేను లీలను. ఆయన మరో ఐదునిముషాల్లో బయలుదేరుతారు. స్నఫ్ కలర్ సూట్ వేసుకున్నారు. ఎర్రటి టై కట్టుకున్నారు. టైపైన స్వస్తిక్ మార్కున్న గోల్డ్ పిన్ వుంది. అదే రంగు ఫెల్ట్ హాట్ పెట్టుకున్నారు.

గచ్చకాయ రంగు ప్రీమియర్ పద్మినీ ఫియట్ ఏ. పీ. ఎక్స్. ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది కారులో బయలుదేరుతున్నారు. ఆయన్ను ఈగిల్ బార్‌లో గుర్తుపట్టడానికి మీకీ గుర్తులు చాలనుకుంటాను." అంది లీల.

"చాలు! ఆ లావణ్య మళ్ళీ మీ వారికి ఫోన్ చేసిందా?"

"లేదు!" అంది లీల.

"థాంక్స్! మీరు నిశ్చింతగా వుండండి. నేను నా పనిలోకి దిగుతాను" అన్నాను.

"చెప్పింది గుర్తుందిగా. నాక్కావలసింది వాళ్ళ రహస్యమేమిటి? ఆ లావణ్య ఉండేదెక్కడ? అంతే. అంతకుమించి మీ రిందులో తెలుసుకోవలసిందేమీ లేదు" అంది లీల.

"అలాగే! గుర్తుంచుకుంటాను" అంటూ ఫోన్ పెట్టేసి, చకచక ఆఫీసు మూసి, తాళం వేసుకొని, వెలుపలికొచ్చి కారెక్కాను. సున్నటి తారురోడ్డును చీల్చుకుంటూ ముందుకు దూసుకుపోసాగింది కారు.

సరిగ్గా ఇరవై ఆరు నిముషాలకు ఈగల్ బార్ ముందు వెళ్ళి ఆగింది కారు. దిగి, లాక్ చేసి లోనికి వెళ్ళాను.

అంతకు ముందెప్పుడూ నేను అందులోకి వెళ్ళలేదు. చాలా విశాలమైన హాలు. సన్నగావుంది వెలుతురు. చీకటి క్రమ్మినట్లుంది నా కళ్ళకు. లోపలున్న టేబుల్స్, చెయిర్స్, మనుషులు లీలగా కనుపించసాగారు. సుమ్మాని కెదురుగా వుంది బార్. దానిముందు ఐదారు గుండ్రటి స్టూల్సు వున్నాయి.

అడుగులో అడుగు వేసుకుంటూ, అటూ ఇటూ ఆసీను లైన జంటల్ని చూచుకుంటూ బార్ వేపు వెళ్ళాను. నాకు కావలసిన జంట కనుపించలేదు. అక్కడున్న వాళ్ళెవరూ ఆ సూట్లో లేరు.

తిన్నగా వెళ్ళి బార్ ముందున్న స్టూల్ పైన కూర్చు న్నాను.

ప్లాస్టిక్ కవరు వేసిన కార్డొకటి నా ముందుకు జరి పాడు బార్‌లోవున్న యూనిఫాం బట్లర్. అందుకుని, కళ్ళకు దగ్గరగా పెట్టుకొని చదివాను. రేట్లు ఆకాశా న్నంటుతున్నాయి. అన్నింటిలోకి బీర్ కొంత చీప్‌గా వుంది. ఆర్డరు చేద్దామనుకున్నాను. నాకు త్రాగడం అలవాటు లేదు.

"కోక్ వుందా?" అడిగాను.

"లేదు. థమ్స్ అప్ కావాలా?" అడిగాడతను.

"ఇవ్వు" అన్నాను.

అతను బాటిల్ ఓపెన్ చేసి పెట్టాడు. అందులోకి స్ట్రా యిచ్చాడు. దాన్ని నోట్లో పెట్టుకుని సిప్ చెయ్య సాగాను.

"ఇది త్రాగేందు కింత దూరంవచ్చారా?" అడిగాడు నమ్మలేనట్లు.

"కాదు! నా ఫ్రెండు రావాలి! అతనొచ్చాక తీసు కుంటాం డ్రింక్స్. అంతదాకా కాలక్షేపంకోసం ఇది ఆర్డరు చేశాను" అన్నాను బాటిల్ చూపిస్తూ.

బార్‌లోకి వంగి ఏవో బాటిల్స్ సర్దుకుంటూ కను పించాడు బట్లరు.

కార్పెట్ పైన బూట్లుచప్పుడు చేస్తున్నట్లు కరకర మనిపించింది.

ఫుల్‌సూట్‌లో వున్న వ్యక్తి, అతని ప్రక్క అంద మైన ఒక అమ్మాయి రావటం క్రీగంట చూశాను. ఆమె బెల్‌బాటమ్ వేసుకొని, బనీను వేసుకుంది. కళ్ళకు గాగుల్సు వున్నాయి. కాళ్ళకున్న బూట్ల ఎత్తు అరంగు శాల దాకా వుంది. అతను ఫెల్ట్‌హాట్ పెట్టుకుని వున్నాడు.

వాళ్ళిద్దరూ వచ్చి నాకు కొద్దిదూరంగా స్టూల్స్‌పైన కూర్చున్నారు.

"స్కాచ్‌విస్కీ టూ లార్జ్ పెగ్స్!" అంటూ ఆర్డరు చేశాడు.

"ఫ్రైడ్‌పీస్ అండ్ కాజూ!" అందామె.

బార్‌లోవున్న వ్యక్తి చకచక గ్లాసులునింపి టేబుల్ పైన పెట్టాడు. ఆ తర్వాత రెండు ప్లేటల్లో కాజూ, బటానీలు వుంచారు. ఇద్దరూ మెల్లిగా, రహస్యంగా మాట్లాడుకోసాగారు.

వాళ్ళిద్దర్నీ బాగా చూడాలని ఎంతో ప్రయత్నం చేశాను. అతను కూర్చున్న ఫోజు ఆమెను పూర్తిగా కనుపించకుండా చేసింది. అతను హాట్ పెట్టుకోవడంతో ముఖం కనుపించలేదు. టై మాత్రం కనుపించింది. కొద్దిగా ముందుకు వంగిచూశాను. స్వస్తిక్ మార్కు గోల్డ్ పిన్ కనుపించింది. నా కొవలసిన జంట అదేనని నిర్ధారించుకున్నాను.

అతను ఆదేపనిగా, ఆబగా, కాజూ, బటానీలు తిన సాగాడు. గ్లాసులో మందుమాత్రం కదలడంలేదు. ఆమె గ్లాసు ఖాళీచేసింది. జేబులోంచి యాభై రూపాయల నోటు తీసి కౌంటర్‌లో పడేసి, ఠక్కున లేచాడు. ఆమె కూడా లేచింది. ఇద్దరూ చకచక వెలుపలికి వెళ్ళి పోయారు.

నేను కూడా ఐదు రూపాయలనోటు తీసి ఇచ్చారు.

"మీ ఫ్రెండు రాకుండానే వెళ్తారా?" అడిగాడు.

"వస్తుంది. మళ్ళీవస్తాను" అంటూ చిల్లరకోసం కూడా ఎదురుచూడకుండా వీధినపడ్డాను.

నేను గుమ్మంలోకి రాకముందే గచ్చకాయ రంగు ఫియట్ కారు స్టార్టయి ముందుకు దూకింది.

నేను పరుగెత్తుకుంటూ వెళ్ళి నా కారెక్కి స్టార్టు చేశాను. ఆక్సిలేటరు బలంగా నొక్కాను.

నా క్కావలసిన కారు కనుపించింది. కానీ దానికీ, నా కారుకూ మధ్య దాదాపు ఐదు ఆటోలు, రెండు కార్లు వున్నాయి.

4

దాదాపు మూడునాలుగు మైళ్ళు అలా వెళ్ళాం ఒకరి వెంట ఒకరం. మా మధ్యవున్న వాహనాల సంఖ్యతగ్గింది.

ఒక ట్రాఫిక్ సిగ్నల్ వద్ద ఆరంజి రంగు సిగ్నల్ కనుపించింది. నేను కారు స్పీడు తగ్గించాను. కానీ ఆ సిగ్నల్ లైటు ఎరుపు తిరగకముందే రాజాచంద్ర, లావణ్య వెళుతున్న కారు దాటిపోయింది.

నా ముందున్న వాహనాలన్నీ ఆగిపోవడంతో నేనేమీ చెయ్యలేక ఆగిపోయాను.

రెండు నిముషాల తర్వాత గ్రీన్ సిగ్నల్ వచ్చింది.

ఆ రోడ్ పైనే రెండు మైళ్ళు వెళ్ళాను. నా క్కావలసిన కారు కనిపించలేదు. మళ్ళీ వెనక్కివచ్చి, ప్రక్కనున్న రోడ్లన్నీ గాలించాను. ఎక్కడా ఆ కారు జాడ లేదు.

నాపైనే నాకు కోపంవచ్చింది. కళ్ళముందే వాళ్ళు నానుంచి తప్పించుకోవడం నాకే అవమానంవేసింది. చేసే దేమీ లేదు గాబట్టి ఓడిపోయిన మొహం వేసుకుని ఇంటికి తిరిగొచ్చాను.

కారు గారేజిలో పెట్టి మెట్లెక్కి పైకొచ్చాను. ఆఫీసురూం తెరచి కూర్చున్నాను.

ఈగిల్ బార్ లో వాళ్ళ మొహాలు చూడలేకపోవడం

ఆ తర్వాత వాళ్ళ కాయ్స్ వెంబడించలేకపోవడం, రెండూ నాకెందుకో విచిత్రంగా కనుపించాయి.

వాళ్ళకు నేను వెంబడిస్తున్న విషయం తెలిసివుండాలని పించింది. అలా కానిపక్షంలో అంత ప్రమాదకరంగా, ట్రాఫిక్ సిగ్నల్ దాటి వెళ్ళివుండే అవసరం నాకు కనుపించలేదు.

వెంటనే నాకు మరో అనుమానం వచ్చింది. వాళ్ళను ఈగిల్ బార్‌నుంచి వెంబడిస్తానని, వాళ్ళకు తెలిసివుండే అవకాశం లేదు. ఈ విషయం తెలిసింది ఒక్క లీలకే. ఆమె వాళ్ళకు చెప్పివుండదు. కారణం ఆమే నన్నాపనికి నియోగించడం. అలాంటప్పుడు ఈ రహస్యం వాళ్ళకు ఎలా తెలిసివుంటుంది?

తల బ్రద్దలుకొట్టుకొన్నాను. మెదడుకు పదును పెట్టాను. ఆలోచనల్ని కదలించాను. అయినా నాకు సమాధానం దొరకలేదు.

అలాగే కుర్చీలో కూర్చుని ఆలోచిస్తూనే పడుకుని నిద్రపోయాను.

మళ్ళీ కళ్ళు తెరచేసరికి అర్థరాత్రి పన్నెండుగంట అయింది. ఎవ్వరో అదే పనిగా కాలింగ్ బెల్ నొక్కుతూండటం గమనించాను.

లేచి వెళ్ళి తలుపు తీశాను. ఎదురుగా క్రైంబ్రాంచి ఇన్‌స్పెక్టర్ నాయర్ ప్రత్యక్షమైనాడు.

"నువ్వా! నాయర్ భాయ్! అర్థ రాత్రిపూట ఏమిటీ రాక? ఫోన్ చేస్తే పోయేదిగా?" అడిగాను లోపలకు రమ్మని ఆహ్వానిస్తూ.

"అరగంటనుంచి ఫోన్ చేసిచేసి విసుగెత్తి వచ్చాను. నువ్వేం చేస్తున్నావ్. నిద్రపోతున్నావా?" అడిగాడు నాయర్.

"అలాంటిదే!" అన్నాను.

"ఫోన్ శబ్దానికి నిద్ర లేవలేదు. కానీ కాలింగ్ బెల్ కొట్టగానే లేచావ్? విచిత్రంగా వుంది" అన్నాడు నాయర్.

"ఇందులో విచిత్రమేమీ లేదు. ఈ శబ్దం వేరు. ఇది వినగానే వెళ్ళి తలుపు తియ్యడమనే ప్రక్రియ అసంకల్ప ప్రతీకారచర్యలా జరిగిపోతుంది. టెలిఫోన్ శబ్దం అలాంటిది గాదు" అన్నాను.

"పని లేకుండావుంటే నీ దగ్గర కూర్చుని హాయిగా కబుర్లు చెప్పకోవచ్చు. నాకీ సర్వీసులో వున్నన్నాళ్ళు అది వీలయ్యేట్లు లేదు" అన్నాడు నాయర్.

"ఏం? ఇప్పుడేమయింది?"

"హత్యంటేనే పెద్ద హడావుడి మా పోలీసు డిపార్టుమెంటుకి. అందులోనూ, బాగా డబ్బున్నవాళ్ళు, పలుకుబడిగలవాళ్ళూ, హత్య చెయ్యబడితే అంతా కోలాహలమే" అన్నాడు నాయర్.

"అన్యాపదేశాలు ఆపి అసలుకథ వివరంగా చెప్పూ?" అన్నాను ఆతృత ఆపుకోలేక.

"ఈ వూళ్ళోకల్లా డబ్బుగల వ్యక్తి శ్రీ రాజాచంద్ర అనే ప్రముఖ వ్యాపారవేత్త హత్యకాబడ్డాడు" అన్నాడు నాయర్.

"ఎప్పుడు?"

"ఇంకా నిర్ణయం కాలేదు. ప్రాథమిక పరిశీలననుబట్టి, సాయంత్రం ఐదారుగంటల మధ్య జరిగివుండాలని భావిస్తున్నారు."

"ఎలా జరిగింది హత్య?"

"పాయింటు ముప్ఫయిరెండు కాలిబర్ రివాల్వర్

తూటాలు రెండింటిని, అతి దగ్గరనుంచి ఒకటి పడి కణత లోకీ, రెండోది గుండెలోకి పంపించినట్లు అనుమాని స్తున్నాం.''

''శవం దొరికిందెక్కడ?''

''అతని కార్లోనే!'' అన్నాడు నాయర్.

''అయితే నీవు సాయంగా ఈ కేసు పరిష్కరించేందుకు నన్ను పిల్చుకొని పోయేందుకు వచ్చావా?'' అడిగాను.

''కాదు! నీనుండి కొన్ని విషయాలు తెలుసుకోవడా నికి వచ్చాను.'' అన్నాడు నాయర్.

# 5

''ఇదీ నాయర్ జరిగింది. అసలు నేనింత దారుణంగా ఈ కేసులో వెనుకపడి ఓడిపోవడం తలచుకొని సిగ్గేసింది. లీలకు మొహం ఎలా చూపించాలో అర్థంగాక సతమత మవుతున్నాను. ఇంతలో నువ్వొచ్చావ్?'' అన్నాను.

''మనుషులు ఇక్కడే చేస్తారు పొరపాటు. నువ్వేదో పెద్ద డిటెక్టివ్ కాబట్టి తన భర్త హత్యకాకుండా కాపాడగలవన్న ఆశతో నీ దగ్గరకు లీల వచ్చింది. ఆమే గనుక తిన్నగా నా దగ్గరికి వచ్చివుంటే పరిస్థితి మరోలా వుండేది. ఈ అమాయకులకు జ్ఞానం ఎప్పుడొస్తుందో...'' అంటూ కప్పుకేసి చూశాడు నాయర్. అవకాశం చిక్కి నప్పుడల్లా మాలాటివాళ్ళను ఆడిపోసుకోవడం అతనికి పరిపాటి.

''ఇంతకూ ఇప్పుడేం చెయ్యాలని చూస్తున్నావ్?''

''ఆ లావణ్యను ఈగిల్ బార్‌లో నువ్వు కాస్తకూడా చూడలేదా. అలాంటి వెలుతురులో, అదేమనిషి, తటస్థ పడితే గుర్తుపట్టగలవేమో ఆలోచించు'' అడిగాడు నాయర్.

"ఏమో? చెప్పలేను" అన్నాను.

"వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూండగా నువ్వు ప్రక్కన వున్నానన్నావ్. ఆ సంభాషణలో పగ కానీ, కోపంగానీ, లేదా అలాంటి మరేదైనా భావం గానీ వున్నట్లు, వాళ్ళ చేష్టల్ను బట్టి ఊహించి చెప్పగలవా?"

"చాలా మెల్లగా మాట్లాడుకున్నారు. నాకేమీ వినిపించనే లేదు."

"ఆమెకన్నా అతను బలవంతుడిగా వున్నాడుకదా?"

"ఖచ్చితంగా."

"కార్లో ఇద్దరూ ముందే ఎక్కారా? లేక ఆమె వెనుక కూర్చొందా?"

"ఇద్దరూ ముందుప్రక్క నున్నారు" అన్నాను గుర్తు తెచ్చుకుని.

"రాజా చంద్రకు తెలిసిన పరిచయం వున్న కొంతమంది అమ్మాయిల్ని పిలిపించాలనుకుంటున్నాను. వాళ్ళను ఈగిల్ బార్‌కు తీసుకెళ్ళి ఒక్కొక్కర్ని నీకు ఆ వెలుగులో అంతకు ముందామె వేసుకున్న బట్టలాంటి బట్టలు వేసి చూపిస్తాను. ఎవర్నయినా పోల్చుకోగలవేమో చూడు" అన్నాడు నాయర్.

"అలాగే! నా పూర్తి సహకారం వుంటుంది" అన్నాను.

"వస్తాను" అంటూ నాయర్ శెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

నాకు చాలా విచారం కలిగింది. లీల తన భర్తకు ప్రమాదం జరుగుతుందేమోనన్న భయంతో నే ముందుగా వచ్చి నన్ను అతన్ని కాపాడమని, కోరింది. నా కర్తవ్యం నేను సరిగా నిర్వర్తించకపోవడంవల్ల అతను చని

పోయాడు. ఆమెకు అన్యాయం చేశానేమోనని తల్లడిల్లిపోయాను.

ఈ విషయం ఆమె ఫోన్ చేసి నాకు చెప్పివుండాల్సిందనిపించింది. ఇంతదాకా చెప్పలేదంటే, నా సామర్థ్యంపైన, శక్తియుక్తులపైన ఆమెకు నమ్మకం అసలు లేకుండాపోవడం తప్ప మరే కారణం వుండివుండదనుకున్నాను.

తెల్లారాక వెళ్ళి ఆమెను కలుసుకుని, కాస్త ఊరడించి, కనీసం ఆమె భర్తను దారుణంగా హత్యచేసిన ఆ మనిషిని పట్టుకునేందుకు తీర్మానించుకున్నాను.

నా కళ్ళు మూత పడకుండానే, భళ్ళున తెల్లవారిపోయింది. కాలకృత్యాలు తీర్చుకుని, ఫలహారం కాఫీ తీసుకుని, డ్రెస్ చేసుకుని కారెక్కి ఏడింటికల్లా బయలుదేరాను.

అరగంటకల్లా రాజాచంద్ర బంగళా ముందుకు చేరాను.

కాంపౌండ్ గేట్ వద్దవున్న గూర్ఖా "ఎవరు కావాలి?" అడిగాడు.

"లీలమ్మగార్ని చూడాలి!" అన్నాను.

"ఆమె మనస్సు బాగాలేదు. అయ్యగారు చనిపోయారు. ఇప్పటిదాకా పోలీసులు వస్తూ పోతూనే వున్నారు. ఎవర్నీ రానివ్వవద్దని చెప్పింది. రెస్టు తీసుకుంటూంది. మధ్యాహ్నం ఫోన్ చేసి అమ్మగారు రమ్మంటే రండి!" అన్నాడు వాడు.

"పోనీ ఒక పని చెయ్యి. ఈ కార్డు తీసుకెళ్ళి అమ్మగారికివ్వు. ఆమె రమ్మంటేనే వస్తాను. లేకుంటే వెళ్ళిపోతాను" అన్నాను.

"మీరు పోలీసులా?"

"ఆఁ!" అన్నాను బుకాయిస్తూ.

"అయితే వుండండి!" అని అతను కార్డు తీసుకొని వెళ్ళిపోయాడు.

నేను ఇంటికేసి చూస్తూ నిల్చున్నాను. అధునాతనంగా కట్టబడ్డ భవనం అది. మొత్తం మూడంతస్తులు వున్నాయి. ఇంటి ముందు చాలా పెద్ద తోటవుంది. దూరంగా నాలుగైదు కార్లు ఆగివున్నాయి.

ఐదు నిముషాల తర్వాత దర్వాను తిరిగి వచ్చాడు.

"ఏమంది ఆమె?" అడిగాను ఆత్రుతగా.

"డ్రాయింగ్ రూంలోకి వెళ్ళి కూర్చోండి. అమ్మగారు పది నిముషాల్లో వస్తారు!" అన్నాడు గేటుతీస్తూ.

కారు స్టార్టుచేసి లోనికి పోనిచ్చాను.

డ్రాయింగు రూంలోకి వెళ్ళి కూర్చున్నాను.

పనిమనిషి కప్పులో కాఫీ తెచ్చిపెట్టింది. తీసుకున్నాను. మరో పనిమనిషి రెండు న్యూస్ పేపర్లు తెచ్చి నా ముందున్న టీపాయ్ పైన పడేసి వెళ్ళాడు. ఒకటి తీసుకున్నాను చూద్దామని.

ఇంతలో నే టకటకమంటూ చప్పుడయింది. ఆ శబ్దం విని తలెత్తాను.

ఎదురుగా లీల నిల్చుని వుంది. నల్లటిచీర, జాకెట్ లో మూర్తీభవించిన శోకదేవతలాగుంది. నేనుకూడా లేచి నిలుచున్నాను.

కూర్చోమన్నట్లు చేత్తో సైగచేసి, ఆమె నా కెదురుగా వున్న సింగిల్ సోఫాలో కూర్చుంది. నేనుకూడా కూర్చున్నాను.

"ఎందుకొచ్చారు?" అడిగింది మెల్లగా.

"మీరు నాకు అప్పగించిన పని విజయవంతంగా నిర్వ

హించలేకపోయినందుకు క్షమాపణ చెప్పుకుని, మీ రిచ్చిన ఫీజు డబ్బు తిరిగి ఇద్దామని వచ్చాను."

"అవసరం లేదు. నా ఖర్మ అలా రాసివుంది. దీనికి మీరు కర్తలుగారు" అంది లీల.

"నేను ఇంకొంత జాగ్రత్త వహించి వుంటే రాజా చంద్ర కిలాంటి దారుణ మరణం సంభవించేదిగాదు. మీ రనుమతిస్తే హంతకుల్ని పట్టుకుని ఉరికంబ మెక్కిస్తాను. కనీసం ఈ రూపంగానైనా నా ఋణం తీర్చుకోనివ్వండి" అన్నాను.

"అవసరం లేదు. ఆ గొడవేదో పోలీసులు చూస్తారు. మీరు దయచేసి ఈ గొడవలోకి దిగకండి. మీకు తెలిసిన విషయాలేమైనా వుంటే ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి చెప్పండి చాలు!" అంది లీల.

"అంటే మీకు నామీద నమ్మకం పూర్తిగా పోయినట్లే వుంది. అందుకే ఇంత నిర్మొహమాటంగా చెప్తున్నారు" అన్నాను.

"అలా అనుకోకండి. హత్యచేసిన వాళ్ళనుపట్టుకున్నా నాకు జరిగేది ఏదీలేదు. మీరు గొడవలు మరచిపోయి హాయిగా వుండండి. పోలీసులు చూసుకుంటారు" అంది లీల.

"నా అపజయానికి కారణం నా అసమర్థత కాదు. ఒక విధంగా మీ అవివేకం!" అన్నాను ఆవేశం ఆపుకోలేక.

ఏమిటన్నట్లు చూసింది.

"మీరు నా యింటికి వచ్చినట్లు, లావణ్యాకూ, రాజా చంద్రకు తెలుసు. ఇద్దరూ నాకు ఫోన్ చేశారు. నేను ఎన్ని గంటలకు ఎక్కడ్నుంచి ఎలా వాళ్ళను వెంటాడేది వాళ్ళకు ముందుగానే తెలుసు. అందువల్లే సులభంగా నా

నుంచి తప్పుకొని పోయారు. మీరే వాళ్ళకు చెప్పివుండా అని నా అనుమానం" అన్నాను.

"నాన్సెన్స్! నేను చెపుతానా?అందులోనూ వాళ్ళకు"

"వాళ్ళకు గాకుంటే మరొకరికి. మీకు నమ్మకం అనిపించిన వ్యక్తికి మీరు చెప్పివుంటారు. ఆ వ్యక్తి వెంటనే ఆ విషయం వాళ్ళకు చేరవేసి వుంటాడు. కాకుంటే నాకు ఫోన్ చెయ్యడంగానీ, దృష్టినుంచి తప్పించుకొనిపోవడం గానీ, సాధ్యమయ్యేదికాదు!" అన్నాను దృఢంగా.

"వాళ్ళకు నేను చెప్పలేదు. నన్ను వెంబడించారేమో తెలీదు!" అంది లీల.

"వృత్తిరీత్యా నాకీ కేసు పెద్దదెబ్బ. నన్ను నేను నిలబెట్టుకొనేందుకు ఆ హంతకుల్ని పట్టుకోవాలి! దానికి మీ అనుమతి కావాలి!" అన్నాను.

అంతలో లాల్చీ పైజామా వేసుకున్న యువకుడు గదిలోకి వచ్చాడు.

"అత్తయ్యా! ఇక్కడున్నావా? రెస్టు తీసుకోమన లేదూ!" అడిగాడు.

"వీరు అర్జంటుగా మాట్లాడాలంటే వచ్చాను నరేన్" అంది లీల.

"నా పేరు సుధాకర్! ప్రైవేట్ డిటెక్టివ్ను" అన్నాను.

"విన్నాను. నా పేరు నరేన్. వీరి మేనల్లుడ్ని.అమెరికా యం.బి ఏ. చేశాను" అన్నాడతను.

ఇద్దరం కరచాలనం చేసుకొన్నాం.

"మళ్ళీ వస్తాను!" అన్నాను లేస్తూ. అతని సమక్షంలో ఈ విషయం గురించి ఆమెను ఒత్తిడి చేసేందుకు నాకు మనస్కరించలేదు.

నేను వెలుపలి కొచ్చేశాను.

# 6

పోలీస్ స్టేషను ముందు కారాపాను. దిగి లోనికి వెళ్ళాను.

నన్ను చూడగానే నాయర్ "రా! రా! క్రొత్త క్లూ ఏదన్నా గుర్తొచ్చిందా?" అడిగాడు నవ్వుతూ.

"లేదు! రాజాచంద్ర ఇంటికి వెళ్ళివచ్చాను" అన్నాను అతని కెదురుగా కూర్చుంటూ.

"ఎందుకు?"

"ఆమెను కాస్త పరామర్శ చేద్దామని" అంటూ "ఇంతకూ ఆ శవం ఫోటోలు వున్నాయా?" అడిగాను.

డ్రాయరులోంచి కవరుతీసి ఇచ్చాడు. దాన్ని తెరచి లోనున్న ఫోటోలన్నీ ఒక్కొక్కటే పరిశీలనగా చూశాను.

"కారెక్కడ దొరికింది?" అడిగాను.

"ఊరికి ఉత్తరంగా వున్న క్లాస్ క్లబ్ కు వెళ్ళే రోడ్ పైన" అన్నాడు నాయర్.

"ఎవరివైనా వ్రేలిముద్రలు దొరికాయా?"

"లేదు!"

"ఈ ఫోటో ప్రకారం రాజాచంద్ర చనిపోయే ముందు స్టీరింగు వీల్ ముందు వుండివుండాలి. అతన్ని హత్యచేసిన వ్యక్తి, ప్రక్కనే కూర్చునివుండాలి. నడుస్తూన్న కారులో కూర్చున్న మనిషి ప్రక్కనున్న మనిషి గుండెల్లోకి తుపాకీ ప్రేలుస్తే కారు కంట్రోలుతప్పి అటూఇటూ పోవాలికదా? కానీ అలాపోకుండా నడిరోడ్ లో నిలబడివుంది కారు. ఎందుకని ఆలోచించావా?" అడిగాను.

"కారాపుకుని యిద్దరూ మాట్లాడుకుంటూ వుండ

వమ్ము. వాగ్వివాదం పెరిగి పెద్దది కావటంతో ప్రక్క నున్న మనిషి కోపం పట్టలేక రివాల్వరుతో కాల్చి వుంటా లనుకున్నాను.''

''బట్టలపైన రక్తంవుందా?''

''ఆ బట్టలు చూస్తావా?'' అడిగాడు నాయర్.

''ఆc! నీ కభ్యంతరం లేకుంటే చూపించు'' అన్నాను.

కానిస్టేబుల్ని పిలిచి ఏదో చెప్పాడు. రెండు నిము షాల తర్వాత న్యూస్ పేపరు పార్శిలు తెచ్చి టేబుల్ పైన పెట్టాడు కానిస్టేబిల్. దానికున్న దారం విప్పాడు నాయర్. లోపల స్నఫ్ కలర్ పాంటు, కోటు ఎర్రటి టై, దానికున్న గోల్డ్ పిన్ కనుపించాయి. కానీ ఆ పిన్ స్వస్తిక్ షేప్ లో లేదు. మామూలు క్లిప్ లాగుంది.

నాకు ఆశ్చర్యమేసింది. బార్ లో నేను బాగా చూశాను. స్వస్తిక్ షేప్ పిన్ను కనుపించింది. అతను యింటినుంచి బయలుదేరబోయే ముందు ఆ మాటే చెప్పింది లీల నాకు. కారెక్కి, ప్రాణాలు పోగొట్టుకోవ బోయే లోపల టై పిన్ ఎలా మారివుంటుందాని ఆలో చించసాగాను.

''ఏమిటి ఆలోచిస్తున్నావ్?'' అడిగాడు నాయర్.

నా అనుమానం చెప్పాను.

''ఆ చీకటిలోంచి వెలుతురులో నీకు కనుపించి వుండదు. ఏదో పొరపాటుపడి వుంటావ్?'' అన్నాడు నాయర్.

''లేదు! నాకు బాగా గుర్తువుంది'' అన్నాను.

''అయితే వుండు!'' అంటూ ఫోన్ తీసుకుని లీలకు డయల్ చేశాడు. ఆమెను అడిగాడు. ఆమె, తన భర్త యిల్లు వదలిపోయే ముందు ఏ పిన్ పెట్టుకుందీ చూడ లేదని, నాయర్ తో చెప్పినట్లు చెప్పాడు.

ఫోన్ పెట్టేసి "యిప్పుడేమంటావ్?" అడిగాడు.

"ఏమనాలో నాకే తెలీడంలేదు. అయినా తెలుసు కుంటాను" అన్నాను కోపంగా.

"నీకీ కేసులో క్లయింట్లులేరు. అనవసరంగా తల దూర్చావంటే వున్న లైసెన్సు కాస్తా ఊడబీకుతారు. జాగ్రత్త!" అన్నాడు సాయర్.

"నీ సలహా గుర్తుంచుకుంటాను" అన్నాను లేస్తూ.

స్టేషను వెలుపల పార్క్ చేసిన కారెక్కి, తిన్నగా, హత్య జరిగిన ప్రదేశంవేపు పోనిచ్చాను.

ఊరు దాటాక మైలువెళ్తేగాని ఆ ప్రదేశం రాలేదు. ఆ చుట్టుప్రక్కల తచ్చాడిచూచాను. ఏ విధమైన క్లూలు దొరకలేదు.

కారును ఇంకా ముందుకు పోనిచ్చాను. క్లాస్ క్లబ్ కనుపించింది. కారాపి లోనికి వెళ్ళాను.

నే నందులో మెంబర్ని కాను. ఊళ్ళోవున్న గొప్ప వాళ్ళందరూ అక్కడ మెంబర్లే. బిలియర్డ్స్, గాల్ఫ్, పేకలు, మొదలైన అన్ని రకాల ఆటలూవున్నాయి.

లోనికెళ్ళగానే మేనేజరు అని రాసిన రూం కనుపించింది. తిన్నగా వెళ్ళి అందులోకి దూరాను.

# 7

ఏదో రాసుకుంటున్న వ్యక్తి నన్నుచూచి తలపైకెత్తి "ఎవరు కావాలి సార్!" అడిగాడు.

"మీరే!" అన్నాను యెదురుగా కూర్చుంటూ.

"చెప్పండి. మెంబర్‌షిప్ కోసం వచ్చారా?"

"లేదు! ఒక మెంబరు గురించి వాకబు చేసేందుకు వచ్చాను" అన్నాను జేబులోంచి సిగరెట్ తీసి ముట్టించు కుంటూ.

"ఎవరు?"

"రాజాచంద్ర. అతను మీ మెంబరేగా?"

"అవును సార్! పాపం ఎవరో హత్య చేశారట. పోలీసులుకూడా వచ్చి వెళ్ళారు" అన్నాడతను జాలిగా.

"నేను పోలీసను కాను. డిటెక్టివ్‌ను. అత నెలాంటి వాడో చెప్పగలరా?"

"చాలా మంచివాడు సార్. చాలా అరుదుగా వచ్చే వాడు. గోల్ఫ్ ఆడేవాడు" అన్నాడు అతను.

"నిన్న అంటే అతను హత్య కాబడిన రోజు వచ్చాడా?"

"వచ్చాడు సార్! ఉదయం పదకొండింటికివచ్చాడు. వెంట వారి శ్రీమతి లీలమ్మకూడా వుంది. ఇద్దరికీ భోజనం కూడా క్లబ్బులోనే ఆర్డరు చేశాడు. ఒంటిగంట దాకా వుండి భోంచేశారు. ఆ తర్వాత రాజాచంద్ర గారు మళ్ళా గోల్ఫ్ ఆడేందుకు వెళ్ళారు. లీలమ్మగారు ఆ చెట్లక్రింద తిరుగుతూండటం చూశాను. అంతే సార్. ఆ తరువాత నాకు తెలియదు" అన్నాడు మేనేజర్.

"వాళ్ళు ఎన్ని గంటలకు క్లబ్ నుండి వెళ్ళిపోయింది తెలీదన్న మాట."

"తెలీదు సార్!"

"థాంక్స్!" అంటూ లేచాను. వెలుపలికి వచ్చి పార్క్ చేసిన కార్లకొద్దీ దూరంలో కూర్చునివున్న కుంటివాడి దగ్గరకు కెళ్ళాను.

జేబులోంచి రూపాయినోటు తీసి వాడి దగ్గరున్న డాలా డబ్బాలో పడేశాను.

"ఎన్నాళ్ళ నుంచి యిక్కడుంటున్నావ్?" అడిగాను.

"ఎన్నాళ్ళా? ఏళ్లోని అడగండి" అన్నాడు గర్వంగా.

"అయితే పాతవాడివే నన్నమాట. ఇక్కడ ఎలా వుంది నీ వ్యాపారం?"

"బాగానే వుంది సార్. ఇక్కడికొచ్చే అయ్యల్నీ, అమ్మల్నీ చాలావరకు పేరుపేరున తెలిసిపోయింది. కార్లు శుభ్రంగా తుడిచిపెడతాను. పదో పరకో యిస్తుంటారు వాళ్ళు" అన్నాడు కుంటివాడు.

"నీకు రాజాచంద్రగారనే మెంబర్ను తెలుసా?"

"తెలుసు. వారి భార్యపేరు లీలమ్మ. అయ్యగారు చాలా మంచివాడు. పదికి తక్కువరాదు చేతికి. అమ్మగారు ఎప్పుడూ చిటపటలాడుతూంటుంది" అన్నాడు వాడు.

"నిన్న ఆయన్ను హత్యచేశారు. ఇక్కడి శాస్త్రి దగ్గరలోనే. నీకు తెలుసా?"

"విన్నాను సార్! మంచివాళ్ళని ఎన్నో రోజులు బ్రతకనీరు!"

"ఆయన్ను హత్యచేసిన వాళ్ళను పట్టుకునేందుకు ప్రయత్నం చేస్తున్నాను. బాగా గుర్తు చేసుకొని చెప్పు. నిన్న ఆయన క్లబ్‌కు వచ్చారు కదూ?"

"వచ్చారు సార్! హెరాల్డ్ కారులో వచ్చారు."

"అమ్మగారుందా?"

"ఉంది!"

"తిరిగి వాళ్ళు యెన్ని గంటలకు వెళ్ళిందీ చెప్పగలవా?"

"రెండుగంటల ప్రాంతంలో అమ్మగారు మాత్రం వచ్చింది. కారు తాళాలు నా దగ్గరుండాయి. లోపలా

వెలుపలా తుడవమని పురమాయించారు అయ్యగారు. తాళాలు తీసుకుంది. అయ్యగారేరమ్మా అని అడిగాను. ఆ ముందు ఎక్కడికో వెళ్ళారని చెప్పి వెళ్ళింది'' అన్నాడు వాడు.

''నీ ముందు అయ్యగారు ఎక్కడా లేదా?''

''లేదు సార్!'' అన్నాడు వాడు ఖచ్చితంగా.

ఐదురూపాయల కాగితంతీసిచ్చి, వెళ్ళి కారెక్కాను.

# 8

రాజాచంద్రగారి ఆఫీసుకి వెళ్ళాను. మేనేజరు నా కార్డు చూడగానే పిలిచాడు లోనికి.

''నమస్తే!'' అన్నాను ఎదురుగా కూర్చుంటూ.

''మీరీ కేసు తీసుకున్నారా?''

అవునన్నట్లు తలూపాను.

''వారు చాలా మంచివారు సార్! వార్ని చంపవలసి నంత అవసరం యెవరికొచ్చిందో నాకు అర్థం కావడం లేదు!'' అన్నాడతను.

''వ్యాపారరీత్యా ఎవరితో నన్నా విరోధంగానీ, మరే రకమైన తగాదాలుగాని వున్నాయా?'' అడిగాను.

''అలాంటివి లేవండీ!''

''ఆయనకు స్త్రీ వ్యసనం వుందా?''

''ఒకప్పు డుండేది. నాలుగు సంవత్సరాలనుంచి అలాంటిదేమీ లేదు. ఆయనకు ఒకమారు హార్ట్ అటాక్ వచ్చింది. బి. పి. కూడావుంది. షుగర్ వుంది. అందువల్ల చాలా జాగ్రత్తగా వుండేవాడు.''

''నిజంగానే...''

''నిజమండీ!'' నొక్కి చెప్పాడు.

''ఈ మధ్య అతను లావణ్య అనే ఒక అమ్మాయిని

సెక్రెటరీగా పెట్టుకుందామని అనుకున్నాడని విన్నాను. నిజమేనా?"

"నాతో యెప్పుడూ అనలేదండీ!"

"ఆమె యిక్కడికి వచ్చినట్లు నాకు రాజాచంద్ర గారు చెప్పారు. నేనుకూడా ఆమెను చూచాయగా చూచాను. ఆమే రాజాచంద్రగారిని చంపివుంటుందని, వారి శ్రీమతి గారి అనుమానం. ఆ లావణ్య రాజాచంద్రగార్ని బెదిరించి డబ్బు గుంజుతుందనీ కూడా నా కామె చెప్పింది. మీకు తెలిసినంతలో రాజాచంద్ర గారు యెక్కువ మొత్తంలో డబ్బు డ్రా చేసినట్లుగా వుందా?" అడిగాను.

"అబ్బే లేదండీ!" అన్నాడు మేనేజరు.

"మీ రెలాగైనా ఈ లావణ్య అనే ఆమె ఎవరో, ఏమిటో, యెక్కడుంటుందో కాస్త వాకబుచేసి చెప్పాలి. ఆమెను పట్టుకుంటే తప్ప అసలు విషయం వెల్లడికాదు. నేనూ నా ప్రయత్నం చేస్తాను. మీరు కాస్త శ్రమ తీసుకోవాలి" అన్నాను.

"అలాగే! ఇందాకా ఇన్‌స్పెక్టర్ నాయర్‌గారు వచ్చారు. ఆయన కూడా మీ రడిగిన ప్రశ్నలే అడిగాడు. మీకు చెప్పిన జవాబులే చెప్పాను"అన్నాడు మేనేజరు.

"థాంక్స్! వస్తాను" అంటూ లేచాను.

"కాఫీ తీసుకోరా?"

"వద్దండీ! అవతల చాలా అర్జంటు పనులున్నాయి" అన్నాను అక్కడ్నుంచి కదులుతూ.

క్రిందికొచ్చి కారెక్కాను. ఎటు పోవడమాని ఆలోచిస్తూ కూర్చున్నాను కాసేపు. ఆ తర్వాత నా ఆఫీసుకు పోవడంకన్నా వేరే పనిలేదని తేలింది. తిన్నగా పోనిచ్చాను కారును ఆఫీసువైపు.

ఆఫీసుకెళ్ళి కూర్చున్నాను.

మనస్సంతా చీకాకుగా వుంది. హత్య జరిగి ఇరవై నాలుగు గంటలు దాటిపోయినా ఏ విధమైన ప్రగతి సాధించలేదు నేను. పోలీసుల పరిస్థితి కూడా అలాగే వుంది.

లావణ్యా హత్యచేసి వుంటే, ఈపాటికి ఆమె ఊరు నుండి యెటన్నా ఉడాయించి వుండాలి. బ్లాక్ మెయిల్ చేసే వాళ్ళు, బంగారు గుడ్లు పెట్టే బాతుల్లాంటి తమ క్లయింట్లను చంపుకోవడం నేను వినలేదు. రాజాచంద్ర ఆ దినం బ్యాంక్ నుంచి డబ్బు డ్రా చేసినట్లు యెవ్వరూ చెప్పడంలేదు. అప్పుడు నాకు రివాల్వరు సంగతి గుర్తొచ్చింది. ఆ రివాల్వరు అంతదాకా యెక్కడా దొరకలేదు.

నాయర్ కు డయల్ చేశాను. రెస్పాన్స్ రాగానే "నేను భాయ్ సుధాకర్ ను. పాయింటు ముప్ఫయిరెండు కాలిబర్ రివాల్వర్స్ లైసెన్స్ వున్న వ్యక్తుల జాబితా చూశావా?" అడిగాను.

"ఆఁ!" అన్నాడు నాయర్.

"ఎంతమంది వున్నారు."

"ఆరుమంది."

"అందులో రాజాచంద్ర కూడా వున్నాడు."

"నువ్వెలా ఊహించావ్?"

"ఉన్నాడు కదూ."

"ఉన్నాడు!" అన్నాడు నాయర్.

"అయితే ఒక పని చెయ్యరాదు. ఆ ఆరు రివాల్వర్స్ తెప్పించి ఎక్స్ పర్ట్ కిచ్చి టెస్ట్ చేయించు. ఎవరిది హత్య కుపయోగించబడిందో తెలుస్తుంది" అన్నాను.

"ఇంత గొప్ప ఐడియా నీ కిప్పుడు వచ్చింది. నాకు

ఆరుగంటల క్రింద నే తెట్టింది. అమలు జరుగుతోంది''
అన్నాడు నాయర్.

''మరొకమాట. ఆ ఆరుగురి పరిచయస్థులలో 'లావణ్య' అనే అమ్మాయిగానీ, స్త్రీగానీ ఎవరన్నా వుండేమో విచారించు,'' అన్నాను.

''ఇది బ్రైట్ ఐడియా! ఇప్పుడే పని ప్రారంభం చేస్తాను.''

''థాంక్స్!'' అని ఫోన్ పెట్టేశాను.

ఉదయంనుండి నేను సేకరించిన సమాచారం మొత్తం మనస్సులోనే క్రోడీకరించుకున్నాను. అందులో తేలింది రాజాచంద్ర చాలా మంచివాడు. నాలుగైదు సంవత్స రాలనుండి హార్ట్ ఎటాక్ వచ్చింది. స్త్రీ వ్యసనం ప్రస్తుతం లేదు. ఎక్కువగా డబ్బు డ్రా చెయ్యలేదు. వ్యాపారంలో పగలుగానీ, ప్రత్యర్థులుగానీ లేవు, లేరు. లావణ్య అనే ఆమె ఎవ్వరూ రాజచంద్రగారి ఆఫీసుకు వచ్చిన దాఖలాలేదు.

గ్లాస్ క్లబ్ లోకి వెళ్ళడం మాత్రం చూచిన సాక్షి వున్నాడు. వెలుపలకు రావడం ఎవ్వరూ చూడలేదు. ఎర్రరంగు హెరాల్డ్ కారులో వెళ్ళారు క్లబ్బుకు.

లీల చెప్పిందానిప్రకారం అతనూ, లావణ్య గచ్చకాయ రంగు ఫియట్ కారులో వెళ్ళారు. రాజాచంద్ర శవం ఆ కారులోనే దొరికింది. అందులో ఎక్కడా రక్తపు మర కలు గానీ, వ్రేలిముద్రలు గానీ లేదు.

అతన్ని చంపివుంటుందనుకొన్న లావణ్య ఎటు పోయిందో తెలీలేదు.

వీటి ఆధారంగా మెదడుకు పదును పెట్టి ఆలోచించ సాగాను. లీల చెప్పిందాన్నిబట్టి చూస్తే. రాజాచంద్రను

చంపడానికో, లేదా చంపించడానికో ఎక్కువ అవసరం ఆమెకే వున్నట్లనిపించింది. లావణ్య మోజులో పడో, లేక బ్లాక్ మెయిల్ కి లోబడో తనను విడాకులిచ్చే ప్రమాదముందని ఆమె భయపడుతూ వుండవచ్చు.

విడాకులంటే ఐశ్వర్యాన్ని, ఆనందాన్ని, పోగొట్టుకోవడమే అవుతుంది. వాటికి అలవాటుపడ్డ లీల, అవి లేకుండా వుండలేదు. అందువల్ల అతన్ని హత్యచేసేందుకు ప్రయత్నం చేసినా చెయ్యవచ్చనుకున్నాను.

కానీ లావణ్యను, రాజాచంద్రను నేను చూశాను. వాళ్ళిద్దరూ నా కళ్ళముందే కారెక్కి వెళ్ళారు. లావణ్య చేత లీల రాజాచంద్రను చంపించి వుంటుందని అనుకోవడానికూడా వీలులేదు.

పోతే లావణ్య అనే అమ్మాయి తమ ఆఫీసుకు రానేలేదని ఆఫీసు మానేజరు చెప్పాడు. కానీ రాజాచంద్ర ఫోన్ లో స్వయంగా, తన ఆఫీసుకు ఆమె రెండు మూడుసార్లు వచ్చిందని చెప్పాడు. ఇందులో ఏది నిజం?

మేనేజర్ జవాబులు నాకెందుకో చాలా సిన్సియర్ గా కనుపించాయి. మరి రాజాచంద్ర మాటలు అబద్ధాలా? తన భార్య అనుమానిస్తున్నదని తెలిసీ, లావణ్య అనే అమ్మాయి తనకు తెలుసునని అతను చెప్పవలసిన అగత్యం ఏముందో నాకు అర్థంగాలేదు. అతను అబద్ధాలు చెప్పడం అవసరం లేకుంటే...అ చెప్పింది రాజాచంద్ర కాకుండా వుండాలనిపించింది. అది సాధ్యమా?

అవాక్కయి కూర్చున్నాను. నా మెదడు పని చెయ్యడం కొన్ని క్షణాలు నిలిచిపోయింది.

నాతో మాట్లాడింది రాజాచంద్రని నేను అనుకుంటున్నాను. నాకు అతన్ని తెలీదు. అతని గొంతు అంతకు

ముందు వినలేదు. ఎవరైనా ఫోన్ చేసి నేను రాజాచంద్ర నంటే కాదని అనుమాన పడవలసిన అవసరం కూడా కనుపించలేదు. అతను రాజాచంద్ర కాకుండా వుంటే...

అతనికి ముందు లావణ్యానంటూ చెప్పి మాట్లాడిన స్త్రీ కూడా లావణ్య అయివుండవలసిన ఆగత్యం లేదనిపించింది.

లీల నా యింటికి వచ్చి వెళ్ళడం తను తెలుసుకున్నానంటూ లావణ్య ఫోన్ చేసి చెప్పినప్పటినుండీ, నాకు కొంత చిత్రంగానే వుంది. కానీ అప్పట్లో అది ధృవీకరించుకోలేకపోయాను. అయితే ఇదంతా నాటకం అయి వుండాలి.

ఈ నాటకం వెనుకనున్న సూత్రధారి ఎవరు? ఏం ప్రయోజనం ఆశించి ఈ నాటకం మొదలెట్టి వుంటారు? ఈ ప్రశ్నలకు జవాబులు దొరికితే తప్ప కేసు ముందుకు నడవదు.

అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాను.

టైం చూసుకున్నాను. ఏడయింది. ఒకమారు వెళ్ళి లీలను కలుద్దామనిపించింది.

# 9

పోలీస్ స్టేషన్ ముందాగాను.

లోపల నాయర్ వున్నాడు. నన్ను చూసి "ఏం భాయ్! వచ్చావ్?" అన్నాడు.

"ఇటు వెళ్తూ ఓ మారు నిన్ను చూసి వెళ్దామనిపించి ఆగాను. ఏమైనా క్రొత్త విశేషాలు తెలిశాయా?"

"ఏంలేదు? నీకేమన్నా తెలిశాయా?"

"లేదు!" అంటూ "ఆ రివాల్వర్సు విషయం తెలిసిందా?" అడిగాను.

"ఆఁ! ఆ మిగిలిన వివరా దొరికాయి. రాజాచంద్రదే దొరకలేదు," అన్నాడు.

"లావణ్య గురించి వాకబు చేశావా?"

"ఆఁ! క్రిష్ణమూర్తిగారని వైన్ మర్చంట్ వున్నాడు. అతని కుమార్తె పేరు లావణ్య," అన్నాడు నాయర్.

"అయితే ఇంక ఆలస్యమెందుకు. ఆమెను పట్టుకుంటే తెలిసేదిగా?" అన్నాను.

"వెళ్ళొచ్చాను. ఆ అమ్మాయి స్కూలునుంచి రాలేదు. రెండో క్లాసు చదువుతూందట." అన్నాడు నాయర్ నవ్వుతూ.

నాకూ నవ్వాగలేదు.

"అయితే మనం కొండనుత్రవ్వి ఎలుకను పట్టినట్లయిందన్న మాట. రివాల్వరు గురించి లీలగారికి తెలుసేమో కనుక్కున్నావా?"

"అదీ అయింది. తనకు దాని సంగతి తెలీదంది. అదెప్పుడూ ఆమె భర్త ఆధీనంలోనే వుంటుందట" అన్నాడు నాయర్.

"ఆ రోజు అతను రివాల్వరు వెంట తీసుకెళ్ళాడని అనుకుందాం. అతనికూడా తెలీకుండా, లావణ్య దాన్ని తస్కరించి దాంతోనే అతన్ని చంపడం జరిగివుండాలి. ఇది సాధ్యమా?" అన్నాను.

"ఏం? ఎందుకు గాదు?"

"తన ప్రాణానికి ప్రమాదం వాటిల్లుతుందేమోనన్న అనుమానం లేనిది రాజాచంద్ర రివాల్వరు వెంట తీసుకెళ్ళాడు. అలాంటప్పుడు దాన్ని ఎంతో జాగ్రత్తగా పెట్టుకుని వుంటాడు. అతన్ని తన్ని రివాల్వరు తీసుకోవటానికి, ఒక స్త్రీ వల్ల సాధ్యమయ్యేపని కాదని నా అభిప్రాయం!" అన్నాను.

"ఆ రోజులు పోయాయి. ఇప్పుడు ఆడవాళ్ళు, కారాటే, జూడో, అన్నీ నేర్చుకుంటున్నారు. మగ వాళ్ళను మించి వున్నారు," అన్నాడు నాయర్ భాయ్.

"ఇంతకు నీ వూహా ఏమిటి?"

"ఇంకా ఊహాగానం చెయ్యడంలేదు. రకరకాల క్లూలు దొరికాయి. ఏదో మా పరిశోధన చేస్తున్నాం" అన్నాడు నాయర్.

అతని దగ్గర శెలవు పుచ్చుకుని తిన్నగా రాజాచంద్ర గారింటికి వెళ్ళాను.

ఎప్పటిలాగే దర్వాన్ నన్ను అడ్డగించాడు. తర్వాత వెళ్ళి చెప్పివచ్చి, లోనికి పంపాడు.

మళ్ళీ డ్రాయింగ్ రూంలో నే లీలను కలుసుకున్నాను. ఈ మారు మరో కుర్చీలో నరేన్ వున్నాడు.

"ఏమిటి? మళ్ళీ వచ్చారు?" అడిగింది లీల. ఆమె కాస్త తేరుకొని వుంది.

"రాక తప్పలేదు! నా అశ్రద్ధ మూలంగా మీ వారు హత్య చెయ్యబడ్డారు. అందువల్ల వార్ని హత్యచేసిన మనుషుల్ని పట్టి పోలీసుల కప్పగించడమనేది నా కనీస కర్తవ్యంగా భావించాను. నా ప్రయత్నాలు నేను చేస్తున్నాను. చాలావరకు నా పరిశోధన ముగిసింది. రెండు మూడు చిన్నచిన్న వివరాలు మాత్రం తెలుసుకోవాలి. అవి తెలిస్తే హంతకుల్ని సులభంగా పట్టుకోగలను," అన్నాను.

"అంత సమర్ధులా?" అడిగింది లీల ఎకసెక్కెంగా.

"మీరు నమ్మకపోవడానికి కారణం వుంది. నా సమర్ధత మీకు ఋజువు చేసుకునేందుకే నా ప్రయత్నం!" అన్నాను.

"ఈ కేసులో మీరేక పని చెయ్యొద్దని చెప్పాక ఎందుకండీ తిరుగుతారు?" అడిగాడు నరేన్.

"మీ కెవరికన్నా నా పరిశోధనవల్ల నష్టంగానీ, కష్టంగానీ, కలుగుతుందంటే చెప్పండి, మానుకుంటాను" అన్నాను.

"మీ యిష్టం. మీతో సహకరించవలసిన అవసరం గత్యంతరం మాకు లేవు!" అన్నాడు నరేన్.

"అదే కరెక్టు!" అంది లీల.

"నా ఊహకు అతీతంగా లేదు మీ ప్రవర్తన. మీరిలా అంటారని ముందే అనుకున్నాను" అన్నాను.

"అంటే మీ ఉద్దేశ్యం?" అడిగింది లీల.

"ఈ హత్య మీరే చేయించి వుండాలి. లేదా చేసిందెవరో మీకు తెలిసి, వాళ్ళు బాగా ఆత్మీయులు కావడం వల్ల, చిక్కుపడిపోతారేమోనన్న భయంతో, ఇటు నాతో గానీ, అటు పోలీసులతో గానీ, సహకరించడం మానుకున్నారు. పైగా తప్పుడు సాక్ష్యాలు చెప్పి, మమ్మల్ని తప్పుదోవల వెంట త్రిప్పుతున్నారు. ఈ నిజం నాయర్ కింకా తెలియ లేదు!" అన్నాను.

లీల మాట్లాడ లేదు.

నరేన్ ఆవేశంతో వూగిపోవడం గమనించాను.

"మీ రడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పాను. నే చెప్పిన పని చెయ్యకున్నా మీకు ఫీజు ఇచ్చాను" అంది లీల.

"అవును. అదే ఇన్నాళ్ళూ ఆలోచించాను. మీరు పోలీసులపైన ఇంత నమ్మకంతో వున్నవాళ్ళు రెండు దినాల ముందు వాళ్ళ దగ్గరకు వెళ్ళకుండా నా దగ్గరకు ఎందుకు వచ్చారా అన్నదే అర్థంకాలేదు" అన్నాను.

"మీరు సమర్థులనుకుని నమ్మారు. అసమర్థులని ఋజువు చేసుకున్నారు. అందువల్ల మళ్ళీ మీ జోలికి రాలేదు" అంది లీల.

"మిస్టర్ సుధాకర్! ఎవర్ని పెట్టుకోవలసింది, మా కేసులు ఎలా నడుపుకోవలసింది మా యిష్టాయిష్టాలతో కూడినది. మధ్య మీ బలవంతం ఎందుకు?" అడిగాడు నరేన్.

"ఎందుకో ఇప్పుడు తెలీదు? తర్వాత తెలుస్తుంది. నాకు కొన్ని సందేహాలున్నాయి. అవి నివృత్తి చేయగలరా మేడమ్!" అడిగాను ఆమెను.

"ఏమిటి?"

"మీ వారికి హార్ట్ అటాక్ వచ్చిన మాట నిజమేనా?"

"నిజమే!"

"వారి ఆహారంలో కాజూ, బటానీలు, ఉప్పు, తీసి వెయ్యమని డాక్టరు చెప్పాడుకదూ!" అడిగాను.

"అవును!" అంది లీల.

"మీ వారు ఈగల్ బార్ కు బయలుదేరే ముందు ఫోన్ చేశారు. అతని డ్రస్సు వివరిస్తూ, టైకి స్వస్తిక్ టైపు పిన్ను పెట్టుకున్నాడని చెప్పారు. అవునా?"

"కాదు! ఆ పిన్ను విషయం చెప్పలేదు."

"పోలీసులు మిమ్మల్ని అడిగాక మార్చుకున్నారు."

"లేదు!"

"పోనివ్వండి. గ్లాస్ క్లబ్ నుంచి తిరిగి వచ్చేటప్పుడు మీ కారులో మీవారు లేరని నాకు తెలిసింది. మీరు ఒంటరిగానే తిరిగి యింటికొచ్చినట్లు చూచినవాళ్ళు చెప్పారు. మీ వారు ఎలా వచ్చారో చెప్పగలరా?"

"లేదు వార్ని నేనే కారులో తీసుకొచ్చాను. అలా

తీసుకొని రాకుంటే వారు తిరిగి ఈగిల్ బార్ కు ఎలా వెళ్తారు? వారి డ్రెస్సు గురించి మీ కెలా ఫోన్ చేసి చెప్పగలుగుతాను?" అంటూ ఎదురుప్రశ్నలు వేసింది.

"ఈ కేసులోని తిరకాసంతా ఇక్కడే వుంది" అంటూ తలదించాను లీల వేపు.

ఆమె కాళ్ళకున్న చెప్పులు కనుపించాయి. కళ్ళు మూసుకున్నాను. అలాంటి చెప్పులే ఆరోజు ఈగల్ బార్ లో లావణ్య వేసుకుని వుండగా చూశాను. నాకు అక్కడి బార్, వాతావరణం గుర్తొచ్చింది. లావణ్య అడుగుల చప్పుడు గుర్తుచేసుకున్నాను.

"థాంక్స్! వస్తాను" అన్నాను లేస్తూ.

"మళ్ళీ రానవసరం లేదు!" అన్నాడు నరేన్.

"బహుశా వుండదనే అనుకుంటున్నాను." అంటూ వెలుపలికొచ్చాను.

కారెక్కే దర్వాన్ దగ్గరకు రాగానే ఆగాను. అతను నమస్కారం చేశాడు. అతన్ని పిలిచాను. జేబులోంచి వందరూపాయల నోటుతీసి అతనికి కనుపించేట్లు పెట్టాను.

ఈ మారు అతను దానికి నమస్కారం చేశాడు.

"ఇది ఇస్తాను. నా ప్రశ్నలకు జవాబు చెబుతావా?"

"అఁ!" అన్నాడు దర్వాన్.

"మీ అయ్యగారు చనిపోయిన రోజు ఉదయం హెరాల్డ్ కారులో ఎవరెవరు వెళ్ళారో గుర్తుందా?"

"అయ్యగారూ, అమ్మగారు వెళ్ళారు!"

"నరేన్ ఇంట్లో నే వున్నాడా?"

"లేదు! ఆ తర్వాత ఫియట్ లో వెళ్ళిపోయారు. అమ్మగారు రాబోయేముందు వచ్చారు."

"మీ అమ్మవారితో పాటు ఆయ్యగారు కూడా వచ్చారా?"

"రాలేదు!"

"బాగా గుర్తుచేసుకుని చెప్పు!"

"రాలేదు సార్!"

"ఐతే థియేటర్ లో మీ అయ్యగారు వెళ్ళడం చూశావా?"

"లేదండీ! ఇంపాలా కారు తుడవమని అమ్మగారు ఫోన్ లో చెప్పింది. ఆ పనిలో వుండిపోయాను. ఆలోగా అయ్యగారు వచ్చి వెళ్ళి వుండవచ్చు."

"నువ్వు కారు గారేజి దగ్గరే వున్నావుగా? నీకు తెలీకుండా మీ అయ్యగారు ఎలా వెళ్ళారు?" అడిగాను.

"ఆయన వెళ్ళిన కారు పోర్టికోలో వుంది." అన్నాడు దర్వాన్.

అతనికి వందరూపాయల నోటిచ్చి వెళ్ళిపోయాను.

# 10

నాయర్ దిగులుగా కూర్చుని వున్నాడు.

"ఏం భాయ్! నాకన్నా హుషారుగా వున్నావ్?" అడిగాడు నన్ను చూసి.

మారు మాట చెప్పకుండా ఫోన్ తీసుకొన్నాను. పోలీసు డాక్టరుకు రింగ్ చేసి మాట్లాడాను. ఆ తర్వాత రాజాచంద్ర గారి ఫామిలీ డాక్టరుతో మాట్లాడాను.

"ఏమిటూ హడావుడి?"

"హంతకులు చిక్కారు?"

"హంతకులా? అంటే ఎంతమంది?" అడిగాడు నాయర్.

"ఇద్దరు!" అన్నాను.

"ఎవరు వాళ్ళు!"

"ఇంకెవరు! రాజాచంద్ర భార్య లీల, ఆమె మేనల్లుడు నరేన్!" అన్నాను.

"ఏమిటి ఆధారం?"

"ఆమె చెప్పులు. ఆమె నడక. అవి చేసే చప్పుడు. నాకు బాగా గుర్తు వున్నాయి. నా యింటికొచ్చినప్పటి అడుగుల శబ్దానికి, బార్‌లో విన్న శబ్దానికి అణుమాత్రం కూడా తేడా లేదు" అన్నాను.

"ఇది కోర్టులో నిలవదు!"

"నరేన్‌కు ఆమెకూ సంబంధం వుంది. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుందా మనుకున్నారు. రాజాచంద్ర అడ్డు తొలగించుకుందా మనుకున్నారు. అందుకు తెలివైన పథకం వేశారు.

లావణ్య అనే ఒకామె వుందనే నమ్మకం కలిగించడం కోసం, నన్ను వాడుకుంది

క్లాస్ క్లబ్‌ను భర్తను తీసుకెళ్ళింది. గోల్ఫ్ ఆడుకునే ప్రాంతంల్లో వున్న చెట్లమధ్య నరేన్ కాచుకుని వుండి వుండాలి. అటురాగానే రాజాచంద్రను అతని రివాల్వర్‌తోనే కాల్చి చంపి శవాన్ని ఫియట్‌లోకి చేర్చివుండాలి. లీల తనకేం తెలీనట్లు హెరాల్డ్‌లో ఇంటికి చేరుకుంది.

నరేన్, రాజాచంద్రలాగా ముస్తాబై ఫియట్ తీసుకుని ఈగిల్ బార్ చేరుకున్నాడు. దొంగదోవన డ్రెస్ మార్చుకుని లీలకూడా అక్కడికి చేరుకుంది. నా కళ్ళకు కనుపించడానికి కాసేపు కూర్చున్నారు.

అక్కడే వాళ్ళు పప్పులో కాలేశారు. ఉప్పువేసి ప్రై చేసిన కాజూ, బటానీలు తెగతిన్నాడు రాజాచంద్ర వేషంలో వున్న నరేన్. ఈ విషయం బార్‌లో వున్న బట్లర్ చెపుతాడు కావాలంటే.

రాజాచంద్ర హార్ట్ పేషంటు. అతను అవి తినకూడదు. నాలుగు సంవత్సరాల నుంచి వాట్ని ముట్టుకోవడంలేదు,

అక్కడ్నించి కారెక్కారు. నేను వెంబడిస్తానని ఇద్దరికీ తెలుసు. అందుకని కొంతదూరం పోయాక నన్ను సులభంగా వదిలించుకున్నారు. శవాన్ని స్టీరింగు వీలు ముందు కూర్చోబెట్టి ఇద్దరూ చెరోదారిన ఇల్లు చేరుకున్నారు. ఇదీ జరిగిన కథ'' అన్నాను.

''అయితే నీకు రాజాచంద్ర, లావణ్య ఫోన్ చేశారన్నావ్?''

''చేశారు. నరేన్ రాజాచంద్రలా, లావణ్యలా లీల మాట్లాడారు. నేను ఖచ్చితంగా వాళ్ళను బార్‌లో చూడాలన్నదే వాళ్ళ ధ్యేయం. అక్కడే వాళ్ళు తప్పటడుగు వేశారు'' అన్నాను.

''ఇంకేమైనా సాక్ష్యాలు వున్నాయా?''

''రాజాచంద్ర వేసుకున్న సూటులాంటి మరో సూటు నరేన్‌కు వుండివుండాలి. టై పిన్నుమాత్రం దొరకలేదు. అందుకే ఆమె బుకాయించింది. నరేన్ బట్టలు బహుశా హెరాల్డ్ డిక్కీలో దొరుకుతాయి. ప్రయత్నించు'' అన్నాను.

''థాంక్స్! నీ పరిశోధన అమోఘం!'' అన్నాడు నాయర్.

తృప్తిగా సిగరెట్ పీల్చుకున్నాను. నన్ను ఇంకా అసమర్థుడిననే అంటుందా లీల? నవ్వుకున్నాను.

—: ఐపోయింది :—

సీరియల్

# ప్రేమసమంధుకు వేస్తే జెస్యో

## వసుంధర




(మొదటి భాగము)

"అందరూ సిద్ధంగా వుండండి. మీమీ పొజిషన్సు ఆడ్జస్టు చేసుకోండి. ఎక్కడా అలికిడి కానీకండి. ఏ క్షణంలోనైనా వాడు రావచ్చు—"

అన్నాడు ఇన్‌స్పెక్టర్ రఘునాథ్ నుదుటికి పట్టిన చెమటను తుడుచుకుంటూ.

ఆ సమయంలో అక్కడ ఎండ లేదు. కనీసం ఉక్కగా కూడా లేదు. చల్లనిగాలి మెల్లగా వీస్తున్న ఆ సమయంలో

రఘునాథ్‌కు చెమటపట్టడానికి అతడి ఆలోచనలు కారణం. ఆ ఆలోచనల్లో గురువులు వున్నాడు.

గురువుల్ని గజదొంగ అనాలో, బందిపోటు అనాలో, హంతకుడనాలో చెప్పడం కష్టం. వాడు అన్ని రకాల పనులూ చేశాడు. ఏమిచేసినా ఎంతో తెలివిగా చేస్తాడు. చేసిందాని కెప్పుడూ విచారించడు. విచారించవలసి వచ్చేలా ఏపనీ చేయడు.

గురువులు ఎప్పుడు ఎక్కడ ఏ నేరం చేయబోతున్నాడో ఎవ్వరూ చెప్పలేరు. ఈవేళ హైదరాబాదులో వుంటే రేపు మదరాసులో వుంటాడు. ఇంకోరోజు ఢిల్లీలో వుంటాడు. వాడు చాలా భాషలు ధారాళంగా మాట్లాడగలడు. అయితే వాడు తెలుగువాడన్నది నిర్వివాదాంశం.

నేరాన్ని కళగా గుర్తిస్తే ఆ కళలో అత్యున్నత స్థాయిలో పరిణతి పొందిన గురువుల్ని చూసి తెలుగుదేశం గర్వపడక తప్పదు. ఎందరో రాజకీయనాయకుల్ని, విద్యావేత్తల్ని, శాస్త్రజ్ఞుల్ని, బాబాలనూ తయారుచేసిన తెలుగుదేశం సర్వకళల్లోనూ తనకుగల ఆధిపత్యాన్ని నిరూపించుకోవడం కోసం గురువుల్ని సృష్టించింది.

వేషాలు వేయడంలోనూ, మనుషుల్ని అనుకరించడంలోనూ గురువులికి గురువులే సాటి. వాడి తత్వ మెలాంటిదో తెలియదుకానీ ఓ పట్టాన హత్యకు తలపడడు. తప్పనిసరి పరిస్థితుల్లో మాత్రమే వాడు హత్యలు చేస్తాడు. కానీ తప్పనిసరి పరిస్థితులు చాలా వచ్చాయి వాడికి.

గురువులకు అనుచరులు లేరు. అదే వాణ్నింతకాలమూ రక్షిస్తూ వచ్చింది. ఇన్నాళ్ళకు వాడికి ఓ అనుచరుడి అవసరం కలిగింది. అదే వాడికి ప్రాణాంతకమూ అయింది.

విశ్వేశ్వర్రావుగారిల్లు దోచడానికి వాడు నిశ్చయించు

కున్నప్పుడు మరో మనిషి అవసరముంటుందని వాడికి అనిపించింది. అందుకని వాడు రంగారావును ఎన్ను కున్నాడు.

రంగారావుకు తల్లిదండ్రులు లేరు. ఇల్లూ వాకిలీ లేదు. సామాన్లు మోసి డబ్బు సంపాదించుకుంటాడు. వాడి నిద్ర బస్ స్టాపులో.

అలాంటివాడికి ధనలోభం వుంటుందని గురువులుకు తెలుసును. వాడికి పదివేల రూపాయలు ఆశ చూపించాడు. పదిహేనేళ్ళ రంగారావు ఆ డబ్బుగురించి వినగానే చాలా ఆత్రుత చెందాడు. గురువులు తన పథకం వివరించాడు.

విశ్వేశ్వర్రావుగారిలో రవంత దయాగుణం వుంది. దానాధారంగా చేసుకుని రంగారావును గురువులు ఆయన ఇంట్లో ప్రవేశపెడతాడు. వాడా ఇంట్లో పనిచేస్తూ గురువులుకు అనుపానులన్నీ చెప్పాలి. రంగారావు అంగీక రించాడు.

గురువులు, రంగారావును తీసుకుని విశ్వేశ్వర్రావు ఇంటికి వెళ్ళి ఆయన ముందు దీనంగా విలపించి తన స్నేహితుడి కొడుకైన రంగారావుకో దారి చూపించమని వేడుకున్నాడు.

“ఏం చేయమంటావ్?” అనడిగాడు విశ్వేశ్వర్రావు.

“మీకేం తోస్తే అదే!”

విశ్వేశ్వర్రావు, రంగారావును ఇంట్లో పనికి కుదుర్చు కున్నాడు. ఓవారం రోజులుపాటు ఆయన రంగారావును రకరకాలుగా పరీక్షించాడు. ఎక్కడైనా డబ్బుగానీ, ఖరీదైన వస్తువుగానీ మరిచిపోతే క్షణాలమీద తెచ్చి ఇచ్చేసేవాడు రంగారావు. ఎంత కష్టమైన పని చెప్పినా

చేయడానికి ప్రయత్నించడమే కానీ చేయలేనని అనే వాడు కాదు. వాడి చలాకీతనం అమితకాలంలోనే విశ్వేశ్వర్రావుకు ఆకర్షించింది.

విశ్వేశ్వర్రావుకు బాగా డబ్బుంది. చాలావరకూ బ్లాక్ మనీ అని అంతా చెప్పుకుంటారు. చాలా స్మగ్లింగు వ్యవహారాలలోనూ, వ్యభిచార గృహాలలోనూ ఆయనకు సంబంధముందని లోపాయికారీగా అనుకుంటూంటారు. అయితే యేం? ఆయన సమాజంలో పెద్దమనిషిగా చలామణీ అవుతున్నవాడు. ఒక్క రాత్రి ఆయన ఇల్లు కొల్లగొడితే లక్షలు దొరకవచ్చునని గురువులు అనుకుంటున్నాడు.

నిజం చెప్పాలంటే గురువులుకు దొంగతనాలమీద విరక్తికలిగి విశ్వేశ్వర్రావు నెన్నుకున్నాడు. ఆ ఇంట్లో సంపాదించిన డబ్బుతో జీవితకాలం కాలుమీద కాలు వేసుకుని హాయిగా గడిపేయవచ్చునని వాడి నమ్మకం.

అందుకే వాడు విశ్వేశ్వర్రావుమీద చాలా ఆశలు పెట్టుకున్నాడు. ప్రమాదమని తెలిసుండీ అనుచరుణ్ని ఎన్నుకున్నాడు.

రంగారావు అటు విశ్వేశ్వర్రావుకీ ఇటు గురువులకూ కూడా నమ్మకంగా వుంటున్నాడు. అయితే విశ్వేశ్వర్రావు విషయాలు గురువులుకు తెలుస్తున్నాయి కానీ, గురువులు విషయాలు విశ్వేశ్వర్రావుకు తెలియవు. విశ్వేశ్వర్రావు నెల్లాళ్ళు పనిచేస్తే భోజనంపెట్టి పాతికరూపాయలిస్తాడు. గురువులు ఒక్కసారిగా పదివేలిస్తాడు. ఆ తేడా ఎలాగూ వుంటుంది మరి!

విశ్వేశ్వర్రావు ఇంటికి పెద్దగా రక్షణ ఏర్పాట్లు లేవు. ఆయన ఇల్లు చాలా సింపుల్ గా వుంటుంది. ఆయన పడు

కునే గదిలో ఓ ఇనప్పెట్టె వుంటుంది. డబ్బు అందులోనే దాస్తాడాయన.

రంగారావు నక్కి నక్కి ఓపర్యాయం కనిపెట్టిన విశేష మేమిటంటే ఆ ఇనప్పెట్టెలో ఓ రహస్యపు టర వుంది. ఎక్కువ డబ్బు నాయన అందులోనే దాస్తాడు. వంద రూపాయల నోట్లకట్టలు అందులో ఎన్ను న్నాయో!

రంగారావు సరైన సమయం చూసి గురువులుకు వార్త నందించాడు.

ఆ రోజు విశ్వేశ్వర్రావు ఒక్కడూ ఇంట్లో వున్నాడు. ఆయనకు సాయంగా రంగారా వొక్కడే వున్నాడు. అర్ధరాత్రి పన్నెండు గంటలకు గురువులా ఇంట ప్రవేశించ డానికి రంగారావు సాయం చేశాడు.

గురువులు, విశ్వేశ్వర్రావుకు స్పృహ తప్పించాడు. రంగారావు చెప్పిన సూచనల మేరకు తాళాలు తీసి ఇనప్పెట్టె తెరచి రహస్యపు అరను గుర్తించాడు. అందులో మొత్తం నాలుగు లక్షలుకు పైగా వుంది.

గురువులు గబగబా అందులోని డబ్బు తన బ్రీఫ్ కేసు లోకి తరలించాడు. సరిగ్గా పదివేలు లెక్కపెట్టి రంగా రావుకు యిచ్చాడు. ఉత్సాహంగా ఇనప్పెట్టె మూసేసి తాళాలు యధాస్థానంలో వుంచేసి—"ఈ డబ్బు నీకు తోచిన విధంగా ఖర్చుపెట్టుకో-పోలీసులకు విశ్వేశ్వర్రావీ విషయాన్ని చెప్పుకోడు. ఆయన ఎన్ని ప్రశ్నలు వేసినా అమాయకత్వాన్ని నటించు..." అన్నాడు.

ఆ డబ్బును చూస్తూనే రంగారావు కళ్ళు మెరిశాయి. కానీ అంతడబ్బు ఎక్కడ దాచుకోవాలో వాడికి తెలియ లేదు. విశ్వేశ్వర్రావుకు అనుమానం వస్తే తననేం చేస్తాడోనని కూడా వాడు భయపడుతున్నాడు.

"నాకు భయంగా వుంది. నేనూ నీతోనే వచ్చేస్తాను" అన్నాడు రంగారావు.

"మన ఒప్పందం నేను నీకు పని చేసివ్వడంవరకే. ఆ తర్వాత నీ దారి నీది. నా దారి నాది. విశ్వేశ్వర్రావుకు డబ్బు పోయిన సంగతి తెలియడానికి చాలాకాలం పట్టవచ్చు. ఆయన నిన్ను అనుమానించడానికి ఆస్కారం లేదు. నువ్వు మామూలుగా నీ పనిచేసుకునిపో—" అన్నాడు గురువులు.

రంగారావు చూస్తూండగానే గురువులు ఒక్క అడుగు కదిలి గుమ్మందాకా వెళ్ళి ఆగిపోయాడు. అక్కడ ఒక మనిషి నిలబడి వున్నాడు. అతడి రెండు చేతుల్లోనూ పిస్తోళ్ళున్నాయి. అవి గురువులు వైపే గురిపెట్టబడి వున్నాయి.

ఇటువంటి పరిణామాన్ని గురువులు ఊహించలేదు. ఈ ఇంట్లో విశ్వేశ్వర్రావు కాక ఇంకో మనిషి వున్నాడని అతను అనుకోలేదు. అయినా ఇలాంటి సమాచారం కోసమే తను రంగారావుని ఇంట్లో వుంచాడు. కానీ ఇప్పుడేమనుకుని ఏం ప్రయోజనం?

"ఎవర్నువ్వు?" అన్నాడు గురువులు. అవతలి వ్యక్తి కూడా తనలాంటి దొంగే అయితే వాడి పని సులువైపోతోంది. ఏ గొడవ లేకుండా చెరిసగం వాటా తీసుకోవచ్చు.

"విశ్వేశ్వర్రావుగారు నిశ్చింతగా నిద్రపోతున్నారంటే నా వల్లనే. నాకు తెలియకుండా చీమకూడా ఈ ఇంట్లోకి రాలేదు. ఈ ఇంట్లోంచి పోలేదు." అన్నాడు ఆ మనిషి.

"నేను చీమను కాదు. అందుకే నీకు తెలియకుండా లోపలకు వచ్చాను..."

ఆ మనిషి పకపకా నవ్వాడు. "నువ్వు రావడం నేను చూశాను. నువ్వు చేస్తున్న ప్రతిపనీ చూశాను. ఈ ఇంట్లోకి రావడానికి సాహసించావంటే నీకేదో ధైర్యం వుండివుండాలి. ఆ ధైర్యాన్ని తెలుసుకునేందుకు ఇంత వరకూ ఆగాను. రంగారావు నమ్మకద్రోహి అని తెలుసుకున్నాను. విమ్మల్నిద్దర్నీ విశ్వేశ్వర్రావుగారికి పట్టిస్తాను. ఏం చేసుకుంటారో ఆయన యిష్టం__"

గురువులు పెద్దగా చలించలేదు. "రంగారావు కూడా ఈ ఇంట్లో పనివాడు. అతనికి పదివేలిచ్చాను. నాకు సాయపడ్డాడు. నువ్వూ ఈ ఇంట్లో పనివాడివే. నీకో లక్ష ఇస్తాను నా దారికి అడ్డుతొలిగితే..."

ఆ మనిషి ముఖం ఎర్రబడింది__"ఈ ప్రతాప్ శరీరంలోని అణువణువూ విశ్వేశ్వర్రావు కోసమే! లక్షలకు లొంగే మనిషి కాదు వీడు..."

"లక్షలకు లొంగనప్పుడు ప్రాణాలు పోగొట్టుకోవాల్సి వుంటుందేమో!"

"ప్రాణాలు తీయడంలో స్పెషల్ డిప్లొమా వుంది నాకు. నేను ఇష్టపడితే తప్ప నా ప్రాణాల్ని దేవుడు కూడా తీయలేడు..." అన్నాడు ప్రతాప్.

"సరే_నీ గురించి నువ్వు చెప్పుకున్నావ్. మరి నా గురించి నేను చెప్పుకోనా? నా పేరు గురువులు..." అన్నాడు గురువులు.

అటు రంగారావు, ఇటు ప్రతాప్ కూడా ఆ మాట విని ఉలిక్కిపడ్డారు. ఆ ఒక్క క్షణం చాలు గురువులుకు. వాడు మెరుపు వేగంతో ప్రతాప్‌ని సమీపించి రెండు చేతులమీదా ఒకే పర్యాయం దెబ్బలు వేశాడు. ప్రతాప్ చేతిలోని రివాల్వర్లు క్రిందపడ్డాయి. ప్రతాప్ యింకా

తేరుకునేలోగా గురువులు మొలలోంచి కత్తి తీశాడు. కత్తి బలంగా ప్రతాప్ గుండెల్లో దిగబడింది. క్షణంగా అరిచి క్రిందపడ్డాడు ప్రతాప్. వెంటనే అతడి ప్రాణం పోయింది.

తన కళ్ళముందు జరిగిన ఈ ఘోరం చూసి రంగారావు వణికిపోతున్నాడు. గురువులు పేరు వాడు విన్నాడు. వాడొక మహా భయంకరమైన వ్యక్తి అని రంగారావుకు తెలుసు. అయితే గురువులు చేసే ఘోరాలెంత భయంకరంగా వుంటాయో వాడిప్పుడు ప్రత్యక్షంగా చూశాడు.

గురువులు మళ్ళీ రంగారావు దగ్గరకు వచ్చి—"భయపడ్డావా?" అన్నాడు. రంగారావు అవునన్నట్లు తలూపాడు.

"భయపడకు. నేను నిన్నేమీ చేయను. హత్య చేయడం నా కిష్టముండదు. కానీ ఒకోసారి తప్పనిసరి అవుతూంటుంది. ఈ ప్రతాప్‌కి నీగురించీ నాగురించీ తెలిసిపోయింది. వీడు బ్రతికుంటే నీకూ నాకూ ప్రమాదమే! అందుకే చంపేశాను. అయినా వీడీ ఇంట్లో వున్నట్లు నువ్వు నాకెందుకు చెప్పలేదు?" అన్నాడు గురువులు.

"నాకు నిజంగా వీడి సంగతి తెలియదు. వీడెప్పుడూ చూడలేదు నేను. బహుశా ఈ ఇంట్లో రహస్యంగా ఉంటున్నాడేమో—" అన్నాడు రంగారావు

"అయుండొచ్చు. విశ్వేశ్వరరావు సామాన్యుడు కాదు. ఈ ఇంటికి రక్షణగా వీడిని వుంచివుంటాడు. దగ్గరున్నది నల్లధనం కాబట్టి కాపలా మనిషిని బహిరంగంగా కాక రహస్యంగా ఉంచుతున్నాడన్నమాట. నువ్విక్కడే నిశ్చింతగా పడుకో. ఆయనకు స్పృహవచ్చి లేచితే నువ్వు కూడా లే! ఏమీ తెలియనట్లు నటించు..." అన్నాడు గురువులు.

రంగారావు భయంభయంగా తలూపాడు. గురువులు ముందుకు వెళ్ళి ప్రతాప్ దగ్గర ఆగాడు.

అతడి కళ్ళు భయంకరంగా చూస్తున్నాయి. ఓ పర్యాయం రంగారావు వంక చూసి ఆ రెప్పలు మూశాడు గురువులు. తర్వాత ప్రతాప్ గుండెల్లోని కత్తిని బయటకు లాగి తన జేబులోంచి ఒక నాప్‌కిన్ తీసి దానికి చుట్ట పెట్టి మళ్ళీ మొలలో దోపుకున్నాడు. మరో పర్యాయం రంగారావును హెచ్చరించి తను అక్కణ్ణించి కదిలాడు.

అయితే రంగారావుకు అక్కడ చాలా భయంగా వుంది. విశ్వేశ్వర్రావు స్పృహ లేకుండా ఉన్నాడు. ఆయన ఇనప్పెట్టె ఖాళీగా ఉంది. అక్కడ ప్రతాప్ అనబడే ఓ మనిషి చచ్చిపడి ఉన్నాడు. ఆ హత్య చేసిన మనిషి అప్పుడే అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

రంగారావు మనసు అతన్ని హెచ్చరిస్తోంది. వాడి జేబులో పదివేల రూపాయలున్నాయి. ఆ డబ్బు అర్జంటుగా ఎక్కడైనా దాచాలి. అక్కడే ఉంటే చాలా ప్రమాదం. అందుకని వాడు కూడా ఇంట్లోంచి బయట పడ్డాడు. బయటపడ్డగానే సందుమలుపు తిరుగుతున్న గురువులు వాడి కళ్ళబడ్డాడు. గురువుల్ని చూస్తూనే రంగారావు బుర్రలో రకరకాల ఆలోచనలు వచ్చాయి.

గురువు లిప్పుడేం చేస్తాడు? ఎక్కడికి వెడతాడు?

రంగారావు ఇప్పుడెలాగూ ప్రమాదంలో వున్నాడు. అనుమానించవలసిన పరిస్థితుల్లో ఇరుక్కున్నాడు వాడు. విశ్వేశ్వర్రావు డబ్బు మాయం, ఆ ఇంట్లో హత్య, రంగారావు జేబులో పదివేలు!

మారు ఆలోచన లేకుండా రంగారావు గురువుల్ని అనుసరించసాగాడు. గురువులు వెనక్కి తిరిగినప్పుడల్లా

పక్కకు తప్పుకుంటూ వాడికి ఏ విధంగానూ అనుమానం కలక్కుండా వుండేలా చూసుకుంటూ గురువులు వెంట బడ్డాడు రంగారావు.

గురువులలా నడుచుకుంటూ ఊరి చివరకు వెళ్ళాడు అక్కడ రోడ్డు పక్కగా దిగి ఓ తోటలోకి వెళ్ళాడు. చుట్టూ చెట్లున్నచోట మధ్యలో ఆగాడు. వాడి బ్రీఫ్ కేసులోంచి ఓ చిన్న గునపం తీశాడు.

రంగారావు చూస్తూండగా అక్కడ ఓ పెద్ద గొయ్యి తిసి అందులో తన బ్రీఫ్ కేసు, మొలలోని కత్తి నేప్ కిన్ తో సహా అందులో పారేసి గొయ్యి కప్పెట్టేశాడు. తర్వాత ఓ చెట్టు దగ్గరకు వెళ్ళి జేబులో వున్న టేపుతీసి ఆ చెట్టు దగ్గర్నుంచి గొయ్యి దగ్గరకున్న దూరం కొలిచాడు. ఓ కాగితంమీద వివరాలు నోట్ చేసుకుని మళ్ళీ అక్కణ్నించి కదిలాడు.

రంగారావు మళ్ళీ గురువుల్ని అనుసరించాడు. గురువులు తిన్నగా రైల్వేస్టేషన్ కు వెళ్ళాడు. మర్నాడు ట్రయిన్లో బొంబాయి వెళ్ళడానికి టికెట్ రిజర్వ్ చేసుకున్నాడు. కాస్త దూరంగా వున్నప్పటికీ గురువులు ప్రయాణం వివరాలు తెలుసుకునేందుకు ప్రయత్నించాడు రంగారావు.

గురువులు అక్కణ్నించి కదిలేక కౌంటర్లో అడిగి— గురువులు సుబ్బారావు పేరుతో మర్నాటికి బొంబాయికి టికెట్ రిజర్వ్ చేసుకున్నట్లు గ్రహించాడు.

రైల్వేస్టేషనులో టైము మూడున్నరవుతోంది. రంగారావు బుర్రలో పురుగు దొలుస్తోంది. హఠాత్తుగా వాణ్ని ధైర్యలక్ష్మి కరుణించింది.

గురువులు చెప్పిన ప్రకారం విశ్వేశ్వర్రావు ఇంట్లో వున్నది నల్లధనం. కాపలావాడు ప్రతాప్ రహస్యంగా

వుంటున్నాడు. అందువల్ల ఆయన దొంగతనం గురించి కానీ, హత్య గురించి కానీ పోలీసులకు చెప్పకపోవచ్చు. ఆయనకు తెల్లవారి ఆరేడు గంటలవరకూ స్పృహ రాదని గురువులు అన్నాడు.

విశ్వేశ్వర్రావుకు తనమీద తప్పకుండా అనుమానం కలుగుతుంది. తన నాయన చిత్రహింసలు పెట్టవచ్చు. తానిప్పుడు వెనక్కి వెళ్ళి గురువులుదాచిన డబ్బు తీసుకుని వెంటనే స్టేషన్‌కువచ్చి అందుబాట్లోవున్న రైలెక్కి వెళ్ళిపోతే తన నెవ్వరూ ఏమీ చేయలేరు. గురువులు బొంబాయి వైపు వెళ్ళాలనుకున్నాడు కాబట్టి తను కలకత్తావైపు వెళ్ళిపోతే సరిపోతుంది.

ఈ ఊహ రాగానే రంగారావు వెంటనే స్టేషన్ వదిలిపెట్టి ఊరిచివర తోటకు పరుగెత్తాడు. భయమూ, ఆవేశమూ, ఉద్రేకం, సంతోషం, కంగారు వగైరా రకరకాల భావాలతో వాడు అక్కడికి చేరుకున్నాడు. దాపుల్లోవున్న ఓ మొక్కకొమ్మ విరిచి ఆకులు దూశాడు. దాంతో గురువులు దాచిపెట్టిన స్థలంలో తవ్వసాగాడు.

కొద్ది గంటల క్రితమే తవ్వబడిన చోటు కాబట్టి ఆ ప్రాంతం గుర్తుపట్టడానికి పెద్ద కష్టం కాలేదు. అలాగే గొయ్యి తవ్వడానికీ యిబ్బందికాలేదు.

బ్రీఫ్‌కేసూ, కత్తి బయటపడ్డాయి. కత్తిని చూస్తూంటే కొద్ది గంటల క్రితం జరిగిన హత్య గుర్తుకువచ్చి రంగారావు కళ్ళు చెదిరిపోయాయి. కత్తిని మళ్ళీ ఆ గోతిలోకే జారవిడిచాడు వాడు. బ్రీఫ్‌కేసు గురించే ఆలోచిస్తున్నాడు వాడు. తను ఆ బ్రీఫ్‌కేసు తీసుకుని బయటకు వెళ్ళడం మంచిదా, లేక వీలైనంత డబ్బు తీసుకుని జేబులో కుక్కుకుని అక్కణ్నించి తప్పుకోవడం మంచిదా?

బ్రీఫ్ కేసు తనలాంటి కుర్రాడి చేతిలో వుంటే రకరకాల అనుమానాలకు దారితీస్తుంది. అందువల్ల రంగారావుకు డబ్బు తీసుకోవడమే శ్రేయస్కరమనిపించింది. ఆ ఉద్దేశ్యంతో వాడు బ్రీఫ్ కేసు తెరిచాడు.

"ఎవర్నువ్వు?" అన్న ప్రశ్న ఒకటి అప్పుడే వాడికి వినిపించి ఉలిక్కిపడి తలెత్తి చూశాడు. వాడి పై ప్రాణాలు పైనే పోయాయి.

ఆ మనిషి ఖాకీదుస్తుల్లో వున్నాడు. తప్పకుండా పోలీసు మనిషై వుంటాడు. రంగారావుకు నోటమాట రాలేదు.

"ఎవర్నువ్వు? ఇక్కడేం చేస్తున్నావు?" ఆ మనిషి గద్దించాడు.

రంగారావు చటుక్కున లేచి అక్కణ్ణించి పరుగెత్తబోయాడు. అయితే ఆ మనిషి ఓ నిముషంలో వాడిని అందుకుని చేయిపట్టుకుని — "వేషాలు వెయ్యకు. చావు దెబ్బలు తింటావు..." అన్నాడు.

రంగారావు భయంగా — "నాకేమీ తెలియదు..." అన్నాడు.

"తెలియనివి నిన్నడగను. తెలిసినవే చెప్పు..." అన్నాడా మనిషి.

రంగారావుకు తను తప్పించుకోలేనని తెలిసింది.

"రైల్వేస్టేషను దగ్గర నిన్ను చూశాను. నీ జేబు ఎత్తుగా కనబడుతోంది. ఎవరిదైనా జేబు కొట్టేశావేమోననిపించింది నీ ప్రవర్తన చూస్తుంటే. అక్కడే అటకాయించాలనుకున్నాను కానీ నువ్వు కంగారుగా పోతున్నావు. సరే–ఎక్కడకు పోతున్నావో చూద్దామని నీ వెనకే బయల్దేరాను.

కొంతదూరం వెళ్ళాక నువ్వు వెళ్ళేచోటు మామూలుది కాదనిపించింది. దాంతో నిన్ను రహస్యంగా అనుసరించడం ప్రారంభించాను. నేననుసరిస్తూన్నట్లు తెలిస్తే నువ్వు చేరవలసిన చోటుకు వెళ్ళవని అనుమానం వచ్చింది. అందుకే ఇంతవరకూ రహస్యంగా ఆగాను. చూడ్డానికి వ్రాడిలాగే వున్నా నువ్వు ఏదో హత్య చేసినట్లు నాకను మానంగా వుంది—" అన్నాడా మనిషి.

రంగారావుకు భయంవేసింది. వాడు గబగబా నిజం చెప్పేశాడు. తన జేబులోని పదివేలుకూడా తీసి చూపిం చాడు. మొత్తం డబ్బంతా తీసుకుని తనను కరుణించి వదిలిపెట్టమని వేడుకున్నాడు.

ఆ మనిషి నవ్వి "ఈ కానిస్టేబుల్ కనకయ్యకు డ్యూటీ తర్వాతే ఏదైనా!" అన్నాడు. ఆ తర్వాత—"నువ్వు చెప్పిందంతా నిజమైతే నీకో మంచి ఉపకారం చేయ గలను. గురువులుకోసం పోలీస్ డిపార్ట్మెంట్ చాలా కాలంగా గాలిస్తోంది. వాడి గురించిన సమాచారం అందిం చిన వారికి పదివేల రూపాయల బహుమానంకూడా వుంది. వాణ్ని పట్టుకున్న వారికి యాభైవేల రూపాయల నగదు బహుమతి వుంది. నువ్వు చెప్పినప్రకారం రేపటిలోగా గురువులు ఇక్కడికి తన సామానుకోసం వస్తాడు. గురువులు మాకు దొరికితే నీకు మంచి బహుమానం..." అన్నాడు కనకయ్య, రంగారావుతో.

బ్రీఫ్ కేసునూ, కత్తినీ అక్కడ మళ్ళీ పాతిపెట్టి, కనకయ్య రంగారావును తీసుకుని పోలీస్ స్టేషన్ కు వెళ్ళి ఇన్ స్పెక్టర్ రఘునాథ్ కు సమాచారాన్నందించాడు.

రఘునాథ్ అప్పటికప్పుడు విశ్వేశ్వరరావు ఇంటికి వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికి విశ్వేశ్వరరావుకింకా స్పృహ

రాలేదు. ప్రతాప్ శవం అక్కడే వుంది. రంగారావు ఇచ్చిన సమాచారం చాలావరకూ నిజమేనని అతడు గ్రహించాడు. తర్వాత నెమ్మదిగా విశ్వేశ్వర్రావుకు స్పృహ తెప్పించడానికి ప్రయత్నించాడు.

విశ్వేశ్వర్రావు సులభంగానే మేలుకున్నాడు. రఘునాథ్ చెప్పినదంతా వినేసరికి ఆయనకు మతిపోయినట్లు అయింది. అంతా అర్థం చేసుకుని మామూలుగా మాట్లాడడానికాయనకు కొంతసేపు పట్టింది.

"నా ఇంట్లో వున్నది బ్లాక్ మనీ కాదు. దొంగలనుంచి రక్షించుకోవడం కోసమే నేను రహస్యపుటరను వాడుకుంటున్నాను. ఇన్‌కంటాక్సు డిపార్ట్‌మెంటు వాళ్ళకు నా డబ్బు వివరాలన్నీ తెలుసును. ఎప్పుడో అవసరముస్తుందో తెలియక ఇంట్లో ఎక్కువ డబ్బు వుంచుకుంటాను. అంత డబ్బుకు రక్షణ చాలా అవసరం కాబట్టి ఓ కాపలావాడిని వుంచుకున్నాను. అందరికీ తెలిసేలా వుంటే వాడిని మోసం చేయడానికి ప్రయత్నాలు జరుగుతాయి కాబట్టి — కాపలావాడి విషయం రహస్యంగా వుంచాను. ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ దొంగతనం చేసినవాడు సామాన్యుడు కాడు" అన్నాడు విశ్వేశ్వర్రావు.

"అవును. వాడు సామాన్యుడు కాడు. వాడు గురువులు" అన్నాడు రఘునాథ్—"మీ ఇంట్లో జరిగిన దొంగతనం గురించీ, హత్యగురించీ ఒకరోజు ఆలస్యంగా విచారిద్దాం. ముందుగా గురువుల్ని పట్టుకోవాలి. అంతవరకూ ఈ విషయాన్ని కాస్త గోప్యంగా వుంచాలి."

"అలాగే" — అన్నాడు విశ్వేశ్వర్రావో క్షణం ఆలోచించి.

పోలీసు బలగం ఒకరి తర్వాత ఒకరుగా వీలైనంత రహస్యంగా రంగారావు చెప్పిన చోట చేరుకున్నారు. అందరూ చెట్లమాటున దాగున్నారు. ఏ క్షణంలోనైనా గురువులు రావచ్చునని ఎదురు చూస్తున్నారు.

ఎదురుగా జోడు పిస్తోళ్ళతో నిలబడ్డ ప్రతాప్‌ని గురువులు ఎలా చంపాడో రంగారావు ద్వారా విన్న రఘునాథ్‌కు గురువులును తలచుకుంటే వళ్ళంతా చెమటలు పడుతున్నాయి. అతను బైనాక్యులర్స్‌తో పరిసరాలను పరికిస్తూ మాటిమాటికీ తన బలగాన్ని హెచ్చరిస్తున్నాడు.

సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో రోడ్డుమీద నుంచి తోటవైపుకు తిరిగిన మనిషి ఒకడు రఘునాథ్‌కు బైనాక్యులర్స్‌లో కనిపించాడు.

"అందరూ సిద్ధంగా వుండండి. పూర్తి నిశ్శబ్దం. గురువులు వస్తున్నాడు" అంటూ అందర్నీ హెచ్చరించాడు రఘునాథ్.

అంతా ఊపిరి బిగబట్టారు.

కాసేపటికి ఆ తోట మధ్యకు నెమ్మదిగా నడుస్తూ గురువులు వచ్చాడు. వాడు అనుమానంగా చుట్టూ చూస్తున్నాడు.

రఘునాథ్ ఆశ్చర్యంగా గురువులు వంక చూస్తున్నాడు. అదే అతను గురువులును మొదటిసారిగా చూడడం. గురువులు రూపం రఘునాథ్ ఆలోచనలకు భిన్నంగా వుంది.

గురువులు చూడ్డానికి నాజూగ్గా వున్నాడు. ముఖం కరుగ్గాలేదు. సరిగదా అందంగా వుంది. మాపుల్లో కొద్ది పాటి కర్కశత్వం లేకపోలేదు. మనిషిని చూడగానే సంస్కారవంతుడిలా కనబడతాడు. వయసు పాతిక్కు ముప్పైకీ మధ్యలో వున్నట్లు అనిపిస్తుంది.

గురువులు తను బ్రీఫ్ కేసు పాతిపెట్టిన చోటుకు వెళ్ళాడు. అక్కడ గుర్తుగానే వుంది. జేబులోంచి ఓ చిన్న గునపంలాంటి వస్తువుతీసి అక్కడ త్వవ్వసాగాడు. తవ్వకం సులువుగానే వుంది. కొద్ది నిమిషాల్లోనే వాడు అక్కణ్ణుంచి బ్రీఫ్ కేసు తీశాడు. ఓ క్షణం ఆలోచించి కత్తినికూడా బయటకు తీసి మొలలో దోపుకున్నాడు.

ఉన్నట్లుండి గురువులుపైన దీపపు కాంతి పడింది. గురువులు కంగారుగా అటూ ఇటూ చూశాడు. చెట్ల చాటునుంచి పోలీసులు ముందుకు వచ్చారు.

అందరి చేతుల్లోనూ తుపాకులున్నాయి. ఆ తుపాకులు గురువులువైపే గురిపెట్టబడి వున్నాయి.

చుట్టూ చూశాడు గురువులు. వలయాకారంలో తనను చుట్టుముట్టారు పోలీసులు.

"మిస్టర్ గురువులూ! కదలడానికి ప్రయత్నించేస్తే శరీరం తూట్లుబడిపోతుంది. చేతులెత్తి నిలబడు..." అన్నాడు రఘునాథ్.

గురువులు ముఖంలో దెబ్బతిన్న అనుభూతి కనబడుతోంది.ఇదెలా జరిగిందన్న ఆశ్చర్యంకూడా అతని కళ్ళలో స్పష్టంగా కనబడుతోంది. ఏదో ఆలోచిస్తూ అతను చేతులు పైకి ఎత్తాడు.

అతని చూపులు పోలీసులమీదా వారి చేతుల్లోని తుపాకులమీదా లేవు. ఆ పోలీసుల వెనుక ఏమున్నదా అని పరీక్షిస్తున్నాయి. ఆ కళ్ళలో ఇంకా ఆశ వుంది.

* * *

రంగారావు తన ననుసరించి వచ్చినట్లు గురువులుకు తెలియదు. వాడు రైల్వేస్టేషన్లో టికెట్ తీసుకున్నాక అక్కణ్ణుంచి తిన్నగా తన బసకు వెళ్ళాడు. వాడి బస అజంతా లాడ్జిలో.

అజంతా లాడ్జిలో ఇరవై ఏడో నంబరు గదిలో వాడూ ఇంకో మనిషీ వుంటున్నారు. ఆ మనిషి పురుష దుస్తుల్లో, పురుష వేషంలో వున్నప్పటికీ ఒక స్త్రీ! ఆమె పేరు ఈశ్వరి.

ఈశ్వరికి పదహారోయేట పెళ్ళయింది. పద్దెనిమిదో యేట భర్త పోయాడు. వేరే బంధువులెవ్వరూ లేనందున ఆమె తన అక్క ఇంట్లో వుంటోంది. ఈశ్వరి ఒంటరితనాన్నీ, అసహాయతనూ ఆధారం చేసుకుని, ఆమె బావ ఆమెగురించి పిచ్చి ప్రయత్నాలు చేస్తున్నాడు అక్కకంటే అందంగా వుంటుంది ఈశ్వరి.

తన భర్త ఈశ్వరి గురించి చేస్తున్న ప్రయత్నాలు ఈశ్వరి అక్కకు తెలుసును. కానీ ఆమె భర్తనేమీ చేయలేక తన ఆక్కసునంతా చెల్లెలిమీద వెళ్ళబుచ్చుకునేది. తన తప్పేమీ లేదని ఈశ్వరి ఎంత చెప్పినా వినిపించుకునేది కాదు.

తానెంత ప్రయత్నించినా ఈశ్వరి లొంగలేదని ఆమె బావకూడా ఆమె అంటే మంటగా వుంది. ఈశ్వరి ఆ ఇంట్లో అనుభవిస్తున్న మానసిక వేదన ఆ భగవంతుడికే తెలియాలి. వేరే దారిలేక ఎలాగో ఆమె అన్ని బాధలూ సహిస్తోంది.

ఒక రోజున గురువులు ఆ యింట్లో దొంగతనానికి ప్రవేశించాడు. వాడు తన పని తాను చేసుకుందామనుకుంటూండగా ఏదో అలికిడయింది. వాడు బీరువా చాటుకు తప్పుకున్నాడు.

ఈశ్వరి బావ ఈశ్వరికోసం వచ్చాడు. నిద్ర పోతున్న ఈశ్వరిని లేపాడు. ఈశ్వరి తొట్రుపడుతూ లేచింది. మత్తువిడి బావకోరిక విన్నాక — "ఈ యింట్లో వుంటూ అక్కకు ద్రోహం చేయలేను. నా జోలికి రాకు..." అందామె.

(సశేషం) ★

## " ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ "

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 15 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరు కూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పైసలు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చేనెల మాస పత్రికలో చూడండి. *

## " హోమ్ డెలివరీ "

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారా గాని మీ ఇంటిదగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య ఎంతమాత్రం లేదు.

నెలనెలా వి.పి.తీసుకోవటం వీలుకాని వారు ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రిజిస్టర్డ్ డెలివరీ'లో పంపగలము. *



# త్రేమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును. —ఎడిటర్]

## పనికోసం?

చలపతి ఎమ్.కామ్. చదివాడు. పాపం ఉద్యోగం కోసం ఎక్కడెక్కడో తిరిగాడు. కానీ ఎక్కడా ఉద్యోగం దొరకలేదు.

చలపతి ఆఖరికి హోటల్లో పనిచేయాలని నిర్ణయించుకుని, ఒక హోటల్‌కి వెళ్ళి ఉద్యోగం అడిగాడు.

హోటల్ యజమాని మండిపడి, "నీలాంటి వాళ్ళు ఇక్కడ చాలామంది పనిచేస్తున్నారు. వెళ్ళు, వెళ్ళు! ఉద్యోగం లేదూ గిద్యోగంలేదు" అని వెళ్ళగొట్టాడు.

చలపతి బయటకు వెళ్ళిపోయాడు.

చలపతికి మెదడులో ఒక ఆలోచన మెదిలింది. టిఫిన్ చేసాక బిల్లు చెల్లించకపోతే లోపల పిండి రుబ్బించడమో ఏదో ఒక పని చేయిస్తారు.... ఒకసారి తను కళ్ళారా చూసాడు. అలాగయినా పని సంపాదించవచ్చు.

లోపలికి వెళ్ళి తృప్తిగా టిఫిన్ చేసి, బిల్లు చెల్లించకుండా బయట పడబోయాడు.

హోటల్ యజమానికి ఒళ్ళుమండింది. "ఏం నాయనా, ఉద్యోగం లేదన్నానని హాయిగా టిఫిన్ చేసి వెళదామనుకున్నావా? అయ్!...." అంటూ లోపలి కుర్రాడిని పిలిచాడు.

చలపతి ఆనందానికి అవధులులేవు. ఈ విధంగానైనా తనకి పని దొరికిందని సంతోషపడ్డాడు.

ఇంతలో లోపలినుంచి వచ్చిన పనికుర్రాడితో, "ఒరే! వీడి చొక్కా, పాంటు విప్పతీసి పంపేయండి," అన్న యజమాని మాటలతో చలపతి కళ్ళు బైర్లు కమ్మాయి.

కాళంగి హనుమంతరావు, గుంటూరు-2.

## తెలివి అలాగుండాలి!

"అమ్మా, అబద్ధాలాడటం తప్పు కదూ?" ముద్దు ముద్దుగా అడిగాడు ఆరేళ్ళబాబు తల్లిని.

"అవును బాబూ" అంది వసంత బాబుని ముద్దుపెట్టుకుంటూ.

"ఎప్పుడూ నిజమే చెప్పాలికదూ?"మళ్ళీఅడిగాడుబాబు.

"అవును" అంది వసంత ఎందుకలా అడుగుతున్నాడో అర్థంగాక.

"అయితే చాక్‌లెట్ డబ్బా ఎక్కడ దాచావో నిజం చెప్పు" అన్నాడు బాబు.

వసంత తెల్లబోయింది.

పూసర్ల భాస్కరరావు, విశాఖపట్టణం-4.

## ఉద్యోగం?

ఒక ఆఫీసులో యింటర్వ్యూ జరిగింది. ఎన్నో యక్ష ప్రశ్నలకు తట్టుకుని రామారావు సెలక్టు అయ్యాడు.

ఆఫీసర్: మిస్టర్ రామారావు! నిన్ను సెలక్టు చేసుకున్నాం! కానీ యీ ఆఫీసులో మొదటి మూడు నెలలు జీతం యివ్వరు. ఆ తరువాత నెలకు మూడొందలిస్తారు. సమ్మతమేనా?

రామారావు: సమ్మతమే సార్! కాని మూడునెలలు పోయిన తరువాతనే వచ్చి జాయినవుతాను.

యస్. సుధారాణి, మద్రాసు-35.

